# మానవజాతి చరిత్ర

మూలం.

జేమ్స్ అవెరి జాయిస్

ముందు మాట

**ఉథాంట్**

(ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి)



అనువాదం:

నండూరి పార్థసారథి

హిగ్గిన్ బాథమ్స్ (ప్రైవేట్) లిమిటెడ్

మద్రాసు-2.

లౌకిక విజ్ఞాన గ్రంథాలు-1

మానవజాతి చరిత్ర

హిగ్గిన్ బాథమ్స్ ప్రచురణ

తెనుగు ప్రథమ ముద్రణ - మే 1967

ముద్రాపకులు: కృష్ణ చిత్ర ప్రింటర్స్, మద్రాసు-17.

పుస్తకం తయారుచేసిన వారు: విషువల్ గ్రాఫిక్ ఎడిటోరియల్
అసోసియేట్స్ & చిరంజీవి.

వెల

రూ 1-00

---


THE STORY OF INTERNATIONAL CO-OPERATION

by

James Avery Joyce

Published by Franklin Watts Inc., New York.

# ముందు మాట

ఈనాడు అంతర్జాతీయ సమస్యలను గురించి, [illegible]లను గురించి ప్రపంచంలో అంతా చెప్పుకుంటున్నారు. కాని, వివిధ దేశాల మధ్య నానాటికీ విస్తృతమవుతున్న సహకారాన్ని గురించి అంతగా చెప్పుకోవటంలేదు. ఈ సహకారాన్ని పటిష్ఠంచేసి, విస్తృతం చేసే ఉద్దేశంతోనూ, ప్రపంచ స్వరూపాన్ని ప్రజలు మరింత వాస్తవికంగా, సమగ్రంగా అవగాహన చేసుకొనేటట్లు ఈ సహకారాన్ని గురించి ప్రచారం చేసే ఉద్దేశంతోనూ ఐక్యరాజ్యసమితి 1965 సంవత్సరాన్ని అంతర్జాతీయ సహకార సంవత్సరంగా పరిగణించింది.

సహకారాన్ని గురించి గానీ, సంఘర్షణని గురించి గానీ, ఇప్పుడు కొత్తగా చెప్పవలసింది ఏమీలేదు కానీ, ఈ రెండింటినీ చారిత్రక దృష్టితో పరిశీలించటం వల్ల ప్రయోజనం ఉంటుంది. ‘‘గతంలో నాటిన బీజం వర్తమానంలో ఫలాన్నిస్తుంది. వర్తమానమే భవిష్యత్తుకు బీజం వేస్తుంది’’ ఇది ఒక నానుడి. ఐకమత్యమే మహాబలమని మానవునికి ఆది కాలం నుంచీ తెలుసు తెగలుగా, తండాలుగా కలిసి జీవించాలనే వాంఛ మనిషిలో స్వతస్సిద్ధంగా ఉంది. శతాబ్దాల కాల గమనంలో ఆ వాంఛ ప్రబలమై, విస్తృతమై క్రమబద్ధమైన సహకారంగా రూపు దాల్చింది. ఆ సహకారం ఈ నాడు ప్రపంచ మంతటా పరివ్యాప్త మయింది. దాని భవిష్యత్తు మరింత ఆశావహంగా ఉన్నది.

‘సహకారం’ ఏ విధంగా పుట్టిందో, పెరిగిందో ప్రస్తుతం ప్రపంచంపై దాని ప్రభావం ఎటువంటిదో సమగ్రంగా పరిశీలించవలసిన తరుణం ఇది. ‘అంతర్జాతీయ సహకారం’ అనే ఈ పుస్తకంలో అటువంటి పరిశీలనే చక్కగా జరిగింది. ఇందులో వెలిబుచ్చినవన్నీ రచయిత వ్యక్తిగత అభిప్రాయాలే అయినప్పటికీ, ఐక్యరాజ్యసమితి దృక్పథంతోనే దీనిని రచించడం జరిగింది.

ఉ థాంట్
ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి.

# ఉపోద్ఘాతం

## ఈ పుస్తకంలో చెప్పిన విషయం

ఇది సృష్టిలో అతి ముఖ్యమైన కథ. ఎందుకంటే ఇది—మాన వుడు ఆటవిక దశనుంచి, ఏకాకి జీవితంనుంచి బైటపడి, ప్రపంచపౌరుడు ఏ విధంగా కాగలిగాడో ఈ పుస్తకం సవిస్తరంగా తెలియజేస్తుంది. ప్రపంచ దేశాలన్నీ ఇరుగు పొరుగు కుటుంబాలుగా ఎలా మారాయో, ఇక ముందు కూడా ఇలాగే జీవించవలసిన అవసరమేమిటో వివరిస్తుంది.

దేశాలను ముక్కలు ముక్కలు చేసి, ప్రజల తలలను ఊచకోత కోసి, రక్తపుటేరులు పారించిన యుద్ధాలు, సంఘర్షణలు, తిరుగు బాటులు, విప్లవాలను గురించే మనం చరిత్ర పుస్తకాలలో ఎక్కువగా చదువుకున్నాము. మానవుని కథలో మరొక భాగం వీటి మరుగున ఉండి పోయిందని మనం మరిచిపోతున్నాము.

చరిత్రను తిరగ వ్రాయడం ఈ పుస్తకం ఉద్దేశం కాదు. ఆ పని మనం చేయలేము. కానీ, మానవుని ఆలోచన, ఆచరణ ఎప్పుడు ఏ విధ ముగా ఉంటూ వచ్చిందో చరిత్రను తరచి తెలుసుకోగలము. యుద్ధాలు, మారణ హోమాలకంటే దీనిని గురించి తెలుసుకోవటమే నేటి ప్రపం చంలో ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది.

## సమగ్ర పరిశీలన

ఈ కథలో చాలా భాగం మీకు ఇదివరకే తెలుసు. అంటే— విడి విడి ముక్కలుగా ఇందులోని సమాచారం చాలావరకు మీకు తెలిసి ఉంటుంది. అయితే, ఆ ముక్కలన్నింటినీ ఒక క్రమంలో పేర్చుకుని చూస్తే, అది సంఘటనల గొలుసుకట్టుగా, గొలుసుకట్టు కథగా కని పిస్తుందని మీరు ఆలోచించి ఉండకపోవచ్చు. ఇప్పుడు మనం ఈ పుస్తకంలో చెప్పబోయేది అటువంటి గొలుసుకట్టు కథే. విశ్వ

సమాజ గమ్యం దిశగా మన ప్రపంచం సాగిస్తున్న యాత్రలాంటి అనేక మజిలీల సంగ్రహ కథల సంపుటి ఇది.

మొదట్లో ఈ ప్రపంచం ఒకే ప్రపంచంలాగా కనిపించేది కాదు. అనేక వేల సంవత్సరాల క్రితం మనుష్యులు చిన్న చిన్న బృందాలుగా నివసిస్తూ, తమలో తాము ఒక జీవన విధానాన్ని నెలకొల్పుకున్నారు. కాని, వారు భూగోళంపై అక్కడక్కడ చెల్లాచెదరుగా, చిన్న చిన్న ప్రదేశాలలో ఉండేవారు. తమ సమాజానికి వెలుపల ఏం జరుగుతున్నదీ వారికి తెలియదు. తెలుసుకోవాలన్న కోరిక కూడా వాళ్ళకి ఉండేది కాదు.

అయినా, అంత ప్రాచీన కాలంలో కూడా ఆదిమానవులు తమ పరిమిత పరిధుల్లోనే కొన్ని సిద్ధాంతాలను, సంప్రదాయాలను సృష్టించారు. అవే ఈనాటికి ప్రపంచ సిద్ధాంతాలుగా, ప్రపంచ సంస్థలుగా స్థిరపడిపోయాయి.

ప్రకృతిసిద్ధమైన అవరోధాలను, తాను స్వయంగా కల్పించుకున్న అవరోధాలను మానవుడు ఏ విధంగా అధిగమించాడో ఈ పుస్తకంలో మనం సమీక్షించే చరిత్ర తెలుపుతుంది. నిరంతర పరిశోధన ద్వారా, అన్వేషణ ద్వారా, యాత్రలు, వార్తా సంబంధాల ద్వారా మానవుడు నానాటికీ ప్రపంచంలోని ఇతర ప్రజలకు ఎలా సన్నిహితుడవుతూ వచ్చాడో ఈ చరిత్రలో మనం గమనిస్తాము. ప్రపంచ సమైక్య సాధనకు చేసే ప్రతి యత్నంలో అడుగునా మానవునికి మరింత స్వాతంత్ర్యం, ఆహారం, స్నేహం కూడా లభిస్తున్నాయి. ఈ మూడింటి సమాహారమే శాంతి. అదే మన కథలో ప్రధాన విషయం.

## చరిత్రే మనకు మార్గదర్శి

ఈ మానవ చరిత్ర ముగింపులేని మహా నాటకం. ఇంత పెద్ద నాటకంలో అన్ని దృశ్యాలను పూర్తిగా దర్శించటం ఈ చిన్న పుస్తకంలో సాధ్యమయ్యే పని కాదు. కొద్ది దృశ్యాలను మాత్రం—వాటిని

కూడా పైపైనే చూడగలుగుతాము. ఇందులో ఒక్కొక్క అధ్యాయం మానవ పురోగతిలోని ఒక్కొక్క మజిలీని గురించి చెబుతుంది. మనం ఈనాడు ఈ విధంగా ఉండటానికి కారణమైన అలనాటి వ్యక్తులను, సంఘటనలను కూడా మధ్య మధ్య కొద్ది కొద్దిగా సంస్మరించుకుంటూ పోదాం.

ఈ నాటకంలో నవయుగం రంగస్థలంపై అవతరించేసరికి— మనం కేవలం ప్రేక్షకులం కాదనీ, మనం కూడా నాటకంలో పాత్రలమే ననీ మనం కూడా చరిత్రను సృష్టిస్తున్నామనీ—అనిపిస్తుంది.

ఎందుకంటే ఈ కథకు ముగింపు లేదు. ప్రపంచ మానవులందరికీ స్వాతంత్ర్యం, ఆహారం, స్నేహం లభింపచేసే లక్ష్యం ఇంకా చాలా దూరంలో ఉంది. ఆఫ్రికా, ఆసియా, దక్షిణ అమెరికాలలో కోట్లాది ప్రజలు ఇంకా చాల కష్టాల్లోనే వున్నారు.

నిజానికి ప్రపంచమంతా వస్తుతః ఒక్కటే అయినా, ఇప్పటికీ భూమి ఉపరితలం భిన్న భిన్నమైన వంద ముక్కలుగా ఉంది. ఈ ముక్కలన్నీ 'సర్వసత్తాక ప్రతిపత్తి'గల దేశాలు. (ఈ మాటకు అర్థం ఏమిటో ముందు ముందు వివరంగా తెలుసుకుందాం.) దేశ పరిపాలనా నిర్వహణ విషయంలో వీటి భావాలు వేర్వేరుగా ఉంటున్నాయి. వీటినే సిద్ధాంతాలు అని కూడా అంటూ వుంటారు. ఒక్క మానవజాతి ఇన్ని ముక్కలు ఎందుకు అయింది ? ఆ ప్రస్తావన వచ్చినప్పుడు మనం— తప్పక తెలుసుకోవాలి. దానివల్ల నేడు మన నాయకులు ఎదుర్కొంటున్న మహా సమస్యలను ఇంకా చక్కగా అర్థం చేసుకోగలుగుతాము.

## వైవిధ్యానికి భద్రత

ప్రపంచ సమైక్య సాధనలో ప్రతి దేశానికి, ప్రతి జాతికి ఎంతో కొంత పాత్ర ఉన్నదని చరిత్రవల్ల మనకు తెలుస్తుంది.

నిజానికి వివిధ జాతుల మధ్య గల ఈ భేదాలే—విజ్ఞాన శాస్త్ర

ములో గానీ, కళలలో గాని ప్రభుత్వ వ్యవస్థలో గానీ—మానవుడు వాస్తవమైన పురోభివృద్ధి సాధించడానికి దోహదం చేశాయి. భూమిపై మొత్తం మానవజాతి అంతా కలిసి సాధించిన అభివృద్ధిలో అన్ని భాషలకు, అన్ని వర్గాలకు, అన్ని జీవన రీతులకు ఎంతో కొంత భాగస్వామ్యం ఉన్నది. చరిత్ర మనకు బోధించే విషయం ఇదే. ఇప్పటికీ నిజం ఇదే.

ఇక్కడ మనం ఒక విషయంలో పొరపడకూడదు. వివిధ జాతుల మధ్య సమైక్యం అంటే ఏకరూపత కాదని మనం గుర్తించాలి. నిజానికి వైవిధ్యమే జీవితానికి ఆకర్షణ నిస్తుంది. వైవిధ్యమే పురోభివృద్ధికి మూలం. ఈ భావాన్ని ఆధారంగా గ్రహించి అంతర్జాతీయ సహకారాన్ని గురించి అధ్యయనం చేద్దాం. (ఇందులో ఒక్కొక్క అధ్యాయానికి ఒక్కొక్క భావం ప్రధానంగా ఉంటుంది. ఆ భావమే ఆయా కాలాలను, లేదా సంఘటనలను ముడి వేస్తుంది.)

ఈ పుస్తకంలో మానవ పురోగతి చిత్రణకు ఆధారమైన భావాన్ని ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి శ్రీ ఊథాంట్ న్యూయార్క్ లోని కొలంబియా విశ్వ విద్యాలయంలో జరిగిన డాగ్ హామర్‌షల్డ్ వర్ధంతి సభలో చక్కగా వివరించారు. ఆయన చెప్పింది ఇది:

"ప్రపంచంలో 300 కోట్లకు పైగా మనుష్యులు ఉన్నారు. వీరిలో ఏ ఇద్దరి వేలిముద్రలు ఒక్క రకంగా లేవని వేలిముద్రల నిపుణులు చెబుతున్నారు. మనుష్యులలో పెక్కు పరిణామాలవారు, పెక్కు రూపాలవారు, పెక్కు రంగులవారు ఉన్నారు. వారి రంగులలో, రూపాలలో పరిణామాలలో ఎంత వైవిధ్యం ఉన్నదో, వారి మత విశ్వాసాలలో, రాజకీయ సిద్ధాంతాలలో అంత వైవిధ్యం ఉన్నది. దేవుడు మనల్ని అందరినీ కలిపి కట్టకట్టి భూమిమీద పడవేశాడు. మనం కలిసి బ్రతకాలి."

మనలో ఇన్ని భేదాలు ఉన్నాయి కనుక, ఒకరితో ఒకరు కలిసి బ్రతకడానికై మనం అందరం కట్టకట్టుకుని భూమిమీద పడ్డాము.

కనుక, మనం చేయవలసింది ఏమిటో (అదే ఈ పుస్తకంలోని ప్రధాన చర్చనీయ విషయం)—ఉ థాంట్ అదే సభలో చెప్పిన మరొక వాక్యంలో—చెబుతాను. ఆ భావాన్ని అంతకంటే స్పష్టంగా చెప్పటం సాధ్యం కాదు.

"మనం సాగించవలసిన సమరానికి లక్ష్యం ఒక్కటే—అది, ప్రపంచంలో వైవిధ్యానికి భద్రత కల్పించటం."

# విషయాల వరుస

## భాగం 1



## భాగం 2



## భాగం 3

రచయితను గురించి

# జేమ్స్ ఆవెరి జాయిస్

అంతర్జాతీయ అవగాహనను పెంపొందించడానికి జీవితమంతా కృషిచేస్తున్న వ్యక్తిగా జేమ్స్ ఆవెరి జాయిస్ అట్లాంటిక్ అవతలి వైపున, ఇవతలి వైపున కూడా సుప్రసిద్ధులైనారు. ఈయన లండన్ విశ్వ విద్యాలయం నుంచి ఆర్థిక, రాజకీయ శాస్త్రాలలో డిగ్రీలు పొందారు. తదుపరి న్యాయ శాస్త్రంలోనూ, చరిత్రలోనూ కూడా డిగ్రీలు సంపాదించుకున్నారు. డెన్వర్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంటర్నేషనల్ అడ్మినిస్ట్రేషన్‌లో విజిటింగ్ లెక్చరర్‌గానూ, కొలంబియా, కాలిఫోర్నియా, కొలరేడో, ఉటాహ్, హార్వర్డ్, న్యూయార్క్ మొదలయిన అమెరికన్ విశ్వ విద్యాలయాలలో గెస్ట్ లెక్చరర్‌గానూ ఉన్నారు. ఐక్య రాజ్య సమితి గురించి, ప్రపంచ సాంఘిక సమస్యలను గురించి పెక్కు పుస్తకాలు రచించారు.

# 1

# నాగరికత నిలయాలు

ప్రపంచ పటాన్ని గీసిన మొదటివారిలో గ్రీక్ జాతీయుడు ఇరాటో సైనిస్ ఒకడు. అతడు క్రీస్తుకు పూర్వం సుమారు రెండువేల సంవత్సరాల క్రితం ఈజిప్టులోని అలెగ్జాండ్రియాలో ఉండేవాడు. ప్రపంచమంటే సముద్ర మధ్యంలో ఉన్న ఒక సుందర ద్వీపమని అతడు ఊహించాడు.

ఇప్పటి ప్రపంచ పటాలతో పోల్చి చూస్తే అతడు గీసిన ప్రపంచ పటం మరీ అంత తప్పుల తడకగా ఉండదు. ఆ మాటకు వస్తే-ఆకాలంలో భారతీయ ఋషులు కొందరు ఊహించిన దానికంటె అతడి ఊహ వాస్తవానికి మరికాస్త దగ్గరగానే ఉంది తీరంలేని సముద్రంలో ఒకపెద్ద తాబేలు నిరంతరంగా ఈదుతూ ఉందనీ, దాని వీపుమీద కొండంత ఏనుగు ఒకటి నిలబడి ఉందని, ఆ ఏనుగు వీపుమీద అంబారీలాగా అమరి ఉన్న అందమైన సౌధమే ఈ ప్రపంచమనీ భారతీయ ఋషులు భావించారు.

ఈ ప్రపంచాన్ని ఒకే మొత్తంగా చూస్తే దాని స్వరూపం ఎలా ఉంటుందో ఊహించటం నిజానికి ఆ రోజుల్లో చాలా అయోమయంగా ఉండేది. సుమారు నాలుగు శతాబ్దాలక్రితం సముద్ర మార్గాన్వేషకులు ప్రపంచాన్ని చుట్టి వచ్చేవరకు ప్రజలు ప్రపంచమంటే ఇలా ఉంటుందని సరియైన అంచనా వేసుకోలేకపోయారు. (ఈ సముద్ర మార్గాన్వేషనలకును గురించి

ముందు ముందు ఐదవ అధ్యాయంలో వివరంగా తెలుసుకుందాం) ప్రపంచం బంతిలాగా ఉందనీ, దానిచుట్టూ మొదలూ, తుదీలేని సముద్రం ఆవరించి ఉందనీ వారు గ్రహించారు.

ప్రపంచంలోని ప్రధానమైన భూమండలాలు-లేక ఖండాలు-సముద్ర గర్భంనుంచి పైకి ఉబికి వచ్చి విస్తరించుకున్న ద్వీపాలుగా వారికి కనిపించాయి.

ఇరాటోస్తెనిస్ భూమి గుండ్రంగా ఉందని సరిగానే ఊహించినప్పటికీ, తను రచించిన ప్రపంచ పటంలోని సరిహద్దులకు అవతల ఏముందో ఊహించలేక పోయాడు. అయినప్పటికీ-భౌగోళికంగా ప్రపంచమంతా నిజానికి ఒక్కటేనని మాత్రం అతడు నిర్ధారణ చేశాడు. అప్పట్లో అది చాలా విప్లవాత్మకమైన పరిశోధన. ఈ పుస్తకంలో ముందు ముందు చెప్పబోయే విషయాలన్నింటికీ ఇదే ప్రాతిపదిక.

అంటే, మొత్తం మానవజాతి అంతా ఒక్కటే కుటుంబం వంటిదని అర్థం. ఇరాటోస్తెనిస్ గీసిన ప్రపంచపటంలో "నవప్రపంచం" (అమెరికాలు) లేకపోయినప్పటికీ, యూరప్, ఈజిప్ట్, భారతదేశం-ఇవన్నీ ఉన్నాయి. (కొలంబస్ కనిపెట్టే వరకు 'నవప్రపంచం' సంగతి ఎవరికీ తెలియదు.) ప్రపంచమంతా ఒకే పెద్ద ద్వీపంలాగా ఉన్నట్లు, దానిచుట్టూ-కోటగోడచుట్టూ కందకంలాగా-పెద్ద సముద్రం వ్యాపించి ఉన్నట్టూ ఇరాటోస్తెనిస్ తన పటంలో చిత్రించాడు.

కాని, మరొక విధంగా చూస్తే ఇరాటోస్తెనిస్ అంచనా తప్పు. ఎందుకంటే, ఆరంభదశలో మానవ సమాజాలు అతడు ఊహించిన దానికి సరిగా వ్యతిరేకంగా ప్రవర్తిల్లాయి. (ఈ మానవ సమాజాలను గురించి ఈ అధ్యాయంలోనే ముందు పేజీలలో వివరంగా పరిశీలించుదాం.) ప్రపంచ పటాలను తయారు చేయటం ప్రారంభించడానికి కొన్ని వేల సంవత్సరాల

పూర్వం నాగరికత–జల పరివేష్టితమైన భూమిని ఆశ్రయించుకుని కాక భూపరి
వేష్టితమైన జలాన్ని ఆశ్రయించుకుని వర్ధిల్లింది.

అంటే, నాగరికత నదీతీరాలపై పుట్టి, నదీతీరాల పొడుగునా
వ్యాపించి, విలసిల్లింది. ఉమ్మడిగా జీవించటం ప్రారంభించిన తొలి మానవ
కుటుంబాలకు, జనసమూహాలకు మధ్య సంబంధ బాంధవ్యాలను కల్పించిన
సాధనాలు నదీమార్గాలే. నదీ తీరాలలోనే వారు గ్రామాలను, ఆ తర్వాత
పట్టణాలను నిర్మించుకున్నారు.




ఈ అంశాన్ని గురించి ముందు పేజీలలో ఇంకా విశదంగా చర్చిం
చుదాం. జన నివాసంగల ప్రదేశాలమధ్య సముద్రాలు అవరోధాలు కాలేదు.
పైపెచ్చు వాటిమధ్య సంబంధాలకు అవే సాధనాలైనాయి.

20 వ శతాబ్దంలో మానవమేధ 'గాలి'ని కూడా జయించటంతో,
ఆయా ప్రదేశాల మధ్య సంబంధాలకు అన్నిటికంటే ప్రబలమైన, ప్రధాన
మైన సాధనం 'గాలి' అయింది. గాలికంటే పైన ఈ భూగోళాన్ని

యూవత్తూ ఆవరించిన 'రోదసి' ఉన్నది. అది ఊహకందని అద్భుతం. ఆ అద్భుతాన్ని కూడా ఇప్పుడు మానవుడు కైవసం చేసుకున్నాడు. దీని ఫలితంగా, ఇప్పడీ భూగోళం మీది ప్రజల సమాచార సంబంధాలకు 'టెల్ స్టార్' కూడా ఒక సాధనమయింది. దీని అంతటి అంతరార్థం ఇరాటో స్తైనిస్ గీసిన ప్రపంచపటంలో ఇమిడి ఉంది-అయితే నిజంగా తన ఊహలో ఇంత నిజం ఉందని ఆతడికే తెలిసి ఉండక పోవచ్చు.

## నాగరకత పుట్టిన రోజు

ఈ కథను కొనసాగించేముందు 'నాగరకత' అనే పదాన్ని పరిశీలించుదాము. 'నాగరకత' అంటే 'స్థిరపడిన' జీవితం అని అర్థం.

అటువంటి జీవితం భూమిమీద ఎప్పుడు ప్రారంభమయిందో ఖచ్చితంగా ఎవరికీ తెలియదు. 1927 లో చైనాలో పరిశోధకులకు అతిపురాతనమైన మనిషి ఎముకలు కొన్ని దొరికాయి. ఆ ఎముకల తాలూకు మనిషికి 'పీకింగ్ మనిషి' అని పేరుపెట్టారు. ఆ మనిషి కనీసం 5 లక్షల సంవత్సరాల క్రిందటివాడై ఉంటాడనీ, 10 లక్షల సంవత్సరాల క్రిందటివాడుకూడా కావచ్చుననీ పరిశోధకులు భావించారు. 5 లక్షలైనా, 10 లక్షలైనా మనకు అంతగా పట్టింపులేదు. నాగరకత పుట్టిన రోజును వెతికి పట్టుకోడానికి మనం గతంలో అంత లోతుకు వెళ్ళనవసరంలేదు. ఆరు లేక ఏడువేల సంవత్సరాల వెనుకకు వెడితేచాలు. ఈ అధ్యాయంలో మనకథను అప్పటినుంచి ప్రారంభించితే చాలు.అదే చాలా ఎక్కువ.

ప్రాచీన ప్రపంచంలో నాగరకత ఏదో ఒక్కచోటనే పుట్టిందనడానికి వీలు లేదు. కనీసం నాలుగు పెద్ద నదీ లోయలలో అవతరించింది. మన శకానికి అనేకవేళ సంవత్సరాలక్రితం ఈ నాలుగు ప్రాంతాలు దాదాపు ఏకకాలంలోనే అభివృద్ధి చెందాయి, (ఈ నాలుగింటిలో మూడు లోయలు నిజానికి రెండేసి నదుల మధ్య ఏర్పడినవి.) ఈ నాలుగు లోయలు ఇవి:



(1) ఈజిప్టులోని నైలు నదీలోయ. (2) మెసపొటేమియాలోని యూఫ్రటిస్, టైగ్రిస్ నదుల మధ్యప్రాంతం. (3) ఉత్తర భారతదేశంలోని గంగా సింధునదుల మధ్యప్రాంతం. ఈ ప్రాంతం ప్రపంచంలోకెల్ల అత్యున్నతమైన హిమాలయ పర్వత శ్రేణికి మధ్య భారతదేశంలోని పర్వతశ్రేణికి మధ్యలో ఉంది (4) చైనాలోని హ్వాంగ్‌హో, యాంగిట్జ్ నదుల మధ్యప్రాంతం.

ఈ నాలుగు లోయలూ నాగరకతా నిలయాలుగా చరిత్రలో ప్రసిద్ధికెక్కాయి. ఈ ప్రాంతాలలోనే మొట్ట మొదటగా మానవుడు తనతోటి

వారితో కలిసి సాంఘిక జీవితాన్ని రూపొందించు కున్నాడు. ఆ జీవిత విధానమే క్రమంగా ప్రపంచమంతటా విస్తరించుకున్నది. మనం ఈనాడు - పూర్తిగా కాకున్నా-దరిదాపుగా సాధించిన విశ్వసమాజం కూడా దాని పరిణామ ఫలితమే.

ఈ నాలుగు ప్రాంతాలలోనూ దైనందిని జీవన పరిస్థితులు దాదాపు ఒకే విధంగా ఇండేవి అని కూడా మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ




ప్రాతాంలన్నింటిలోనూ నదీ మార్గాలు ఉన్నాయి. అవి జన నివాస ప్రదేశాల మధ్యగా ప్రవహిస్తూ, అనేక విధాల ప్రయోజనకరంగా ఉండేవి. ఈ నదులు రవాణాకు ఎంతో ఉపయోగకరంగా ఉండేవి. ప్రతిరోజూ జనాభా అంతటికీ త్రాగడానికి, స్నానానికి నీరు అందించేవి. తీరం పొడుగునా ఉండే పొలా

లకు, తోటలకు సంవత్సరం పొడుగునా నీరు సరఫరా చేసేవి. ఆ నీటివల్ల పంటలుపండి, ప్రజలందరికీ కడుపులు నిండేవి.

పైన సాహసయాత్రికులు గురించి చెప్పేటప్పుడు 'పొడి మార్గం' అంటూ ఉంటారు. అసలు ఏదైనా మార్గాన్ని గురించి వారికి మొట్టమొదటగా కలిగిన ఆలోచన ఏమిటంటే-అది తప్పకుండా 'తడి' మార్గమే అయిఉండాలని అంటే, జలమార్గం అన్నమాట. దీనినిబట్టి జన నివాస ప్రదేశాల మధ్యగా ప్రవహించే నదీమార్గాల ప్రయోజనం ఎంతటిదో మనకు కొంత తెలుస్తుంది.

ఈ నదీ మార్గాలపై పుట్టి పెరిగిన సమాజాలకు జలమార్గాలు వెన్నెముకలాగా ఉండేవి. మనిషి శరీరంలో వెన్నెముక ఏ విధంగా అవయవాలను మొండానికి అతికి ఉంచుతుందో, అదేవిధంగా ఈ నదులు దేశంలోని ఒక ప్రదేశానికి మధ్య 'సంబంధా'ల్ని కల్పించే సాధనాలైనాయి. ఇటువంటి సాధనాలే లేకపోయినట్లయితే ఆనాటి సమాజాలు అంతకాలం మనగలిగేవి కావు.

## శత్రువుల నుంచి రక్షణ

ఈ సమాజాల మనుగడకు నదులవలెనే ఉన్నత పర్వత శ్రేణులు కూడా దాదాపు అంత ముఖ్యమైనవిగా ఉండేవి. బాల్యావస్థలోనున్న ఈ సమాజాలకు అవి పెట్టని కోటలవలె ఉండి, శత్రువుల బారినుంచి వారిని కాపాడుతూ ఉండేవి. ఈజిప్టులో పర్వతాలకు బదులు ఎడారులు ఈ విధమైన రక్షణ కల్పించేవి. తాగడానికి నీటిచుక్క లేకుండా, నడవడానికి వీల్లేకుండా ఇసుకమయమై ఉండే పెద్ద ఎడారి నైలు నదీలోయలోని మానవ సమాజానికి రక్షణ కల్పించేవి.

అయితే, పైన చెప్పిన నాలుగు ప్రాంతాల అదృష్టం ఒకేవిధంగా లేదు. మెసపొటేమియాలోనికి అస్సీరియనులనే భయంకరమైన జాతివారు

తోడేళ్ళ గుంపులా వచ్చి పడ్డారు. వారు పర్వతాల కనుమలగుండా చొరబడి దాడి జరిపారు. (మెసపొటేమియా అంటే 'రెండు నదులమధ్య భూమి'అని అర్థం) యూఫ్రటిస్, టైగ్రిస్ లోయలలో అప్పుడప్పుడే మొగ్గ తొడుగు తున్న లేత నాగరికతను నలిపివేసి, ప్రజలను బానిసలుగా చేసి వారుకొంత కాలంపాటు పెత్తనం చెలాయించారు.

ఏమైనప్పటికీ, మొత్తంమీద, ఈ నాలుగు 'నాగరకతా నిలయాల' లోనూ ప్రజలకు-అస్తమానం శత్రుభయం లేకుండా-కాస్త స్థిమితంగా ఊపిరి పీల్చుకునేందుకు తగిన ప్రశాంతత, భద్రత లభించాయి. వాటివల్లనే వారు కొన్ని ఉమ్మడి సంప్రదాయాలను. ఒక ఉమ్మడి భాషను, మతాన్ని రూపొందించుకోగలిగారు. ఇవన్నీ కలిసి ఒక సంఘటితనమైన, కుదుమట్ట మైన సమాజం ఏర్పడేది. ఈ విధంగా ప్రతినాగరికత తనకు తాను ఒక చిన్న ప్రపంచాన్ని సృష్టించుకుంటూ ఉండేది.

అయితే. ఈ నాలుగు సమాజాలు ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా, కేవలం ద్వీపాలలాగా ఉండేవికావు. వీటిమధ్య వర్తకులు, యాత్రి కులు రాకపోకలు సాగిస్తూ ఉండేవారు. మధ్యలో ఆటవిక జాతులు నివసించే ప్రదేశాలు ఉండేవి. దారిపొడుగునా బందిపోటు దొంగలు ఉండేవారు. ఇటు వంటి ప్రమాదాలు ఎన్ని ఉన్నా లెక్కచేయకుండా తెగించి వర్తకులు. వస్తూ పోతూ ఉండేవారు. వారిని గురించిన జానపదగాథలెన్నో ఇప్పటికీ ప్రచారంలో ఉన్నాయి.

ఇలా రాకపోకలు సాగించేవారు కొందరు ఉన్నప్పటికీ, మొత్తంమీద ఈ నాలుగు నాగరక జాతుల ప్రజలూ తమ ప్రాంతాలలో తాము, ఇతరు లతో నిమిత్తం లేనట్లుగా జీవించారు. ప్రపంచంలో తాము ఒక్కరే గొప్ప వారని భావించక పోయినప్పటికీ, తమప్రాంతం, తమ ప్రజలు, తమ జీవన విధానం ప్రపంచంలో మిగతా వాటికంటే గొప్పవనే భావం ఆ నాలుగు జాతులలో ప్రతి ఒక్క దానికి ఉండేది.

## స్నేహము-శాంతి

నాగరకతా సౌధానికి మొట్టమొదటి పునాదిరాయి 'స్నేహం.'

స్నేహితుల మధ్య శాంతి నెలకొంటుంది. శత్రువులమధ్య యుద్ధం సంభవిస్తుంది. యుద్ధం లేకుండా చేయటమే అన్నిటికంటే పెద్ద సమస్య అని నాటి నాగరక మానవుడు గుర్తించాడు. ఎందుకంటే, శాంతిలేనిదే నాగరక జీవితానికి మనుగడలేదు. అందుచేత, ఒక క్రమపద్ధతిలో శాంతిని నెలకొల్పి, పరిరక్షించవలసిన అవసరం ఉందని మనిషి గ్రహించాడు. న్యాయస్థానాలద్వారా, శాసనాల ద్వారా, అచారాల ద్వారా, సహకారంద్వారా, తన ప్రాంతంలో తాను శాంతిని చక్కగా నెలకొల్పుకో వచ్చునని తెలుసు కున్నాడు. కాని, ఇతర ప్రాంతాలవారు తమ జోలికి రాకుండా, వారికి తమకు మధ్య శాంతిని నెలకొల్పు కోవటం మాత్రం-అసాధ్యం కాకపోయినా - కష్ట సాధ్యమని మనిషి గుర్తించాడు.

మెసపొటేమియా విషయంలో అలాగే జరిగిందని కదా చెప్పు కున్నాము. యూఫ్రటీస్, టైగ్రిస్ లోయలకు వెలుపల ఉన్న అనాగరక జాతు లకు ఆకలి ఎక్కువ. వారు అస్తమానం తిండికోసం వెతుక్కుంటూ ఒక చోటినుంచి మరొక చోటికి తండాలు తండాలుగా పడిపోతూ ఉండేవారు ఎక్కడైనా పాడిపంటలతో పచ్చగా ఉన్న నాగరక ప్రాంతం కంటబడితే దానిమీద పడి దోచుకు తినేవారు.

మనిషిలోని ఆకలి బాధ ఎటువంటి క్రూరమైన పనులు చేయిస్తుందో గమనించటం అవసరం. మామూలు మనిషిని తీసుకుందాం. అతడికి అను వైన ఉద్యోగం ఉంటుంది. భార్య, పిల్లలు ఉంటారు తమ ఉద్యోగాలు తాము చేసుకుంటూ మధ్యమధ్య కాలక్షేపానికి వచ్చి పోయే, స్నేహితులు ఉంటారు. చక్కటి మంచి నీటివసతి ఉంటుంది. పొలాలనుంచి సమృద్ధిగా ధాన్యం వస్తుంది. తోటలనుంచి గంపలతో పళ్ళు, కూరగాయలు వస్తాయి.

అతడు తృప్తిగా, హాయిగా కాలం వెళ్ళ బుచ్చుతూ ఉంటాడు. ఇటువంటి మనిషి-పైన చెప్పిన దేశద్రిమ్మరులలాగా-తన వాళ్ళందరినీ కూడగట్టుకుని తండాలుగా ఒకచోటినుంచి మరొక చోటికి వలసపోతూ, ఇతర ప్రజలపై దాడిచేసి దోచుకుంటూ జీవితం గడపవలసిన అవసరంలేదు. అతడు అలా చేయడు.

శాంతి అంటే సహకారమే. ఈ సహకారాన్ని క్రమబద్ధం చేయటం, వ్యవస్థీకరించటం అవసరం. అంటే కలిసి పనిచేయటం అన్నమాట, ఉదాహరణకు- స్త్రీలకు పురుషులకు, పిల్లలకు నిలవ నీడకావాలి. ఒంటి మీద బట్ట కావాలి. రోజుకు కనీసం ఒక పూట-వీలయితే రెండు మూడు పూటలు-తిండి కావాలి.



నిలవ నీడకోసం నాగరక మానవుడు ఇళ్లు కట్టటం ప్రారంభించాడు. కాలం గడుస్తున్న కొద్దీ భవనాలు, సౌధాలు మందిరాలు మరెంత విశాలంగా సుందరంగా నిర్మించుకో గలుగుతున్నాడు. కాని, ఎంతోమంది ఇతరుల్ని మనతో కలిసి పనిచేయకుండా-అంటే ఇతరుల 'సహకారం' లేకుండా-మనం ఇంత అందమైన ఇళ్ళు కట్టుకోలేము, ఇంత నాజూకైన వస్త్రాలు ఉత్పత్తి చేయలేము. ఇంత ధాన్యాన్ని పండించలేము.

## ప్రభుత్వ-ఆవశ్యకత

కుటుంబాలు అంతకంతకు పెరిగి పెద్దవైనప్పుడు, ఒక్క కుటుంబం పెక్కు కుటుంబాలుగా మారటం, ఆ కుటుంబాలన్నీ ఒకే గ్రామంలో కలిసి జీవించటం సహజం. అటువంటి గ్రామంలో అందరి శ్రేయస్సుకోరి సమష్టి నిర్ణయాలు చేసేవారు కొందరు కావాలి. ఇందుకోసం గ్రామస్థు లందరూ కలిసి తెలివిగలవారిని కొందరికి ఎంచుకునేవారు.

ఈ విధంగా మనుషుల మధ్య 'ప్రభుత్వాలు' అవతరించాయి. మను షులు ఒక సమాజంగా కట్టుబడి ఉండేటట్లు చేయగలిగిన ప్రబల శక్తులలో 'ప్రభుత్వం' ఒకటయింది. దీనిని గురించి త్వరగా విపులంగా తెలుసుకుందాం స్థానిక ప్రభుత్వాలు-అంటే గ్రామ ప్రభుత్వాలు-ఆరు వేల సంవత్సరాల క్రిందటే ఉన్నాయి. ప్రభుత్వం లేకుండా మనిషికీ మనిషికీ మధ్య ప్రయోజనకరమైన సహకారంగానీ, శాంతిగానీ ఉండదు

సమాజ మంతటికీ ఉమ్మడిగా వర్తించే ప్రవర్తన నిబంధనలను-అంటే శాసనాలను—కూడా నాటి నాగరకులు రూపొందించారు; ఒక మనిషి హక్కులకు మరొక మనిషి భంగం కలిగించకుండా న్యాయస్థానాలు కాపా డుతూ ఉండేవి. తద్వారా 'శాంతి'ని పరిరక్షిస్తూ ఉండేవి

## కడుపునిండితే-చాలదు

కాని, ప్రభుత్వాలు, శాసనాలే సమస్తం కాదు. ఆ రెండూ మానవుని మతంతో, విశ్వాసాలతో ముడిపడి ఉన్నాయి. సమాజంపై మతంయొక్క పలుకుబడి ఎంతబలంగా ఉండేదంటే ఒక్కొక్కప్పుడు మతాధికారే సర్వాధి కారిగా వ్యవహరించేవాడు. రాజ్యాలేలిన మతాధికారులు పూర్వం చాలా మంది ఉండేవారు

ఏసుక్రీస్తు చెప్పినట్లు "మనిషి కేవలం తిండితోనే జీవించడు." అత డికి ఏదో ఒకదానిలో 'విశ్వాసం' కావాలి

పనివాడితనాన్ని పెంపొందించుకుంటే కళాకారుడు కావచ్చునని నాగరక మానవుడు గ్రహించాడు వస్త్రాలు నేయటంలోగానీ. పనిముట్లు తయారుచేయటంలోగానీ మనిషి-వాటిని సృష్టించాలనే కోరికను తీర్చుకో వటంతోపాటు-తనలో నిగూఢమై ఉన్న సౌందర్యభావాన్ని వ్యక్తం చేస్తూ వచ్చాడు. ఆ విధంగా వస్తూత్పత్తితోపాటు కళ అభివృద్ధి చెందింది.

అందమైన విగ్రహాలు, అద్భుతమైన మందిరాలు, ఎన్నో రకాల సుందరమైన పాత్రలు, కలశాలు, గృహోపకరణాలు ఇటీవల కాలంలో జరి పిన త్రవ్వకాలలో లభించాయి. ఇవన్నీ ప్రాచీన నాగరకత విలసిల్లిన ప్రదే శాలలోనే దొరికాయి, "అందమైన వస్తువెప్పుడూ ఆనందదాయకమే" అని ఆంగ్లకవి జాన్ కీట్స్ చెప్పినమాట నిజం.

ఇలా ప్రభుత్వాలు, శాసనాలు, మతాలు, పూజలు-కళలు, చేతిపనులు క్రమంగా అభివృద్ధి చెందుతున్న కొద్దీ సమాజం మరింత కట్టుదిట్టంగా, సురక్షితంగా రూపొందుతూ వచ్చింది.

## ఆహారోత్పత్తికి-ప్రణాళిక

నాటి నాగరకతలకు మొదటి పునాదిరాయి 'స్నేహం' అని చెప్పు కున్నాము. రెండవ పునాదిరాయి 'ఆహారం'

ఆహారం అనగానే ఇక్కడ మళ్ళీ నదుల ప్రసక్తి వస్తుంది. నీరు పల్లానికే ప్రవహిస్తుంది కాని ఎగువకి ప్రవహించదు కదా. ఈజిప్టులో ఏం జరిగిందో చూద్దాం. అక్కడ నైలునదిలోకి వచ్చికలిసే ప్రవాహాలు అట్టే ఎక్కువ ఉండేవి కావు. జనాభా పెరుగుతున్న కొద్దీ మరింత ఎక్కువ భూమిని సాగులోకి తీసుకురావలసి వచ్చేది. నది పక్కనే ఉన్న భూమి అయితే ఇబ్బంది లేదు కానీ, దూరాన ఉన్న భూమిని సాగు చేయాలంటే నదీ జలాలను అంత దూరం తీసుకు పోవలసి వచ్చేది. దీనికోసం-జాగ్రత్తగా ఒక ప్రణాళిక తయారు చేసుకోవటం, కలిసి కృషిచేయటం అవసమయింది. ముఖ్యంగా-ఏ ఋతువులో నైలు నది పొంగుతుందో-ఏ ఋతువులో నీటి మట్టం తగ్గిపోతుందో శ్రద్ధగా కనిపెట్టి ఉండవలసి వచ్చేది. వ్యవసాయపు పనులను ఎక్కువగా బానిసల చేత చేయించేవారు, ఇలా బానిసలను ఉపయోగించుకొనడం కూడా ఒక ప్రణాళిక ప్రకారం చేయవలసి వచ్చేది.

వ్యవసాయ పథకాలను నిర్వహించాలంటే ఇంజనీరింగ్ ప్రతిభ కావాలి. నీటిని ఒక మట్టం నుంచి ఇంకొక మట్టానికి ఎత్తి పోయటం వంటి ఘనకార్యాలు కొన్ని చేయవలసి వచ్చింది. వీటికి ఇంకా ఎక్కువ మంది ప్రజల సహకారం అవసరమయింది. ఇక్కడ అర్థశాస్త్రం రంగంలోకి ప్రవేశించింది. వర్తకులకు, ప్రజా వ్యవహార నిర్వాహకులకు ప్రాధాన్యం హెచ్చింది. (మనుషులు జీవితం సాగించడానికి అవసరమైన సంపాదన కోసం ఏ విధంగా పరస్పర సహకారంతో కృషి చేస్తారో వివరించేది అర్థశాస్త్రం.)

నైలు నదీలోయలో మాదిరిగానే ఇతర నాగరకతా నిలయాలలో కూడా ఆహారోత్పత్తిని పెంపొందించడానికి ప్రజలు వివిధ పథకాలు తయారు చేసుకుంటూ ఉండేవారు. అయితే, నాగరకత ఫలానా విధంగా అభివృద్ధి చెందాలని ముందుగా ఎవ్వరూ ఆలోచించలేదు. కాని, పరిస్థితులు,- సంఘట

నేను ఎప్పటికప్పుడు సమాజాన్ని ముందుకు తోస్తూఉండేవి, వాటి ఫలితంగా వ్యవసాయంలో, గృహ నిర్మాణంలో, వస్త్ర ఉత్పత్తిలో పద్ధతులు వాడుక లోకి వచ్చాయి. చరిత్రఎప్పుడూ నిలకడ లేనిది కదా.

## పనులు, ఉద్యోగాలు

జనాభా పెరుగుతున్న కొద్దీ మనిషి ఒక కొత్త విషయం గ్రహించటం ప్రారంభించాడు. అన్ని పనులలోనూ ఆరితేరాలని ప్రయత్నించటం కంటే, ఏదో ఒక పనిలో ప్రావీణ్యం సంపాదించటం, దానికోసం తన కాలాన్ని, శక్తిని పూర్తిగా వినియోగించటం మంచిదని తెలుసుకున్నాడు. అంటే, ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క పనిలో ప్రత్యేక ప్రావీణ్యం సంపాదించటం మొదలు పెట్టాడు. ఆప్రత్యేక ప్రావీణ్యం వడ్రంగంలో కావచ్చు, తాపీ పనిలో కావచ్చు, వర్తకంలో కావచ్చు, మరొక వృత్తిలో కావచ్చు, ఈ విధంగా ఒక్కొక్కరు చేసిన కృషి ఫలితాన్ని సేకరించి, ఆ మొత్తం ఫలితాన్ని అందరూ కలిసి అనుభవించటం మొదలుపెట్టారు. ఈ పద్ధతి వల్ల వారు మరింత సౌకర్యం, సౌలభ్యం పొందగలుగుతున్నారు. దీనికే అర్థ శాస్త్రజ్ఞులు 'కృషి విభజన' (Division of Labour) అని పేరు పెట్టారు. ఇది ఆర్థికాభివృద్ధికి వెన్నెముక వంటిది.

మనుషులు ఈ విధంగా కృషిని పంచుకొనటం ప్రారంభించిన తర్వాత, తమ కృషి ఫలితాలను-అంటే తమ ఉత్పత్తులను-అందరి సౌకర్యం కోసం ఒక్క చోటికి చేర్చడానికి మరొకటి అవసరమయింది. అదే 'వినిమయం' (Exchange)-లేక ఇచ్చి పుచ్చుకోవటం. ప్రత్యేక నిపుణులు ఉత్పత్తి చేసిన వస్తువులను-అంటే రొట్టెలు, బట్టలు, కుండలు, గుర్రపు నాడాలు మొదలయిన సమస్త వస్తువులను-ప్రజలు ఒకరి నొకరు ఇచ్చి పుచ్చుకునే వారు. ఈ విధంగా సమాజంలోని వారందరికీ ఆ వస్తువులు అందుబాటులోకి వచ్చేవి.

ఈ వస్తు వినిమయం అనేది కొన్ని ప్రత్యేక కేంద్రాలలో మాత్రమే జరిగేది. వాటినే 'సంత' లనీ, 'విపణు'ల నీ అనేవారు. ఇవి ఒక పట్టణం మధ్యలో గానీ, కొన్ని పట్టణాల మధ్య రహదారులు కలసే చోటగానీ, రద్దీ ఎక్కువగా ఉండే పడవ రేవుల దగ్గరగానీ ఉండేవి. వర్తకులందరూ అక్కడ దుకాణాలు నెలకొల్పే వారు. మొత్తం సమాజం ఉత్పత్తి చేసిన



సరకులన్నీ అక్కడే చేతులు మారేవి. ఈ విధంగా 'వస్తు వినిమయ ఆర్థిక వ్యవస్థ' ప్రపంచమంతటా నెలకొన్నది.

కొన్నాళ్ళకు మనుషులు 'డబ్బు'ను కనిపెట్టారు. ఇచ్చి పుచ్చుకోవటాలు సాఫీగా జరగాలంటే ఇది అత్యుత్తమ సాధనమని గ్రహించారు. 'డబ్బు' లేకుండా సరకులు మార్చుకోవటం చాలాచికాకుగా తయారయింది. 'డబ్బు' వల్ల మరొక సౌకర్యం కూడా కనిపించింది. దానిని పుష్కలంగా సంపాదించుకో గలిగిన అదృష్టవంతులు ముందు జాగ్రత్త కోసం కూడ బెట్టుకో గలుగుతున్నారు. (అయితే డబ్బుకు విలువ-మనకు కావలసిన వస్తువును పొందడానికి ఎక్కడో అక్కడ దానిని చెలామణి చేయగలిగితేనే-ఉంటుందని గుర్తించాలి.)

క్రమంగా నాగరక జీవన పరిస్థితి అంతకంతకు క్లిష్టమవుతూ వచ్చింది. సరకుల వినిమయం, విపణులు, ద్రవ్యవిధానం—వీటిపై ఆధార పడటం ఎక్కువయింది. సమాజమంతటినీ ఒక్కటిగా దృష్టిలో పెట్టుకుని ఆహారం ఉత్పత్తిని, పంపిణీని క్రమబద్ధం చేయవలసి వచ్చింది. ఆహార పదార్థాల సరఫరాకు హామీ యేమీ లేకుండా ఉన్నట్లయితే నాగరకత అతి దీనావస్థలో ఉండి ఉండేది. (ఆకలిని జయించడమే ఈనాటికీ మానవుని సమస్య లన్నింటిలోకి క్లిష్టమైనదిగా ఉన్నది. ఇది యావత్ప్రపంచం ఎదు ర్కొంటున్న సమస్య. ఈ పుస్తకం చివరి పేజీలలో దీనిని గురించి చర్చించుదాం.)

## స్వాతంత్ర్యానికి ఆధారం శాసన విధానం

నాగరకతకు మూడవ పునాదిరాయి 'స్వాతంత్ర్యం.' ఇదే చివరిది కూడా.

బానిసలు ఎక్కువగా ఉండే నాగరకత ఆట్టే కాలం నిలబడదు అటు వంటి వ్యవస్థలో కొద్ది మంది నియంతలు పెక్కుమంది బానిసలపై పెత్త నం చేస్తూ, వారిచేత వెట్టి చాకిరి చేయిస్తూ ఉంటారు. ఈ బానిసలు విసు గెత్తి, ఏదో ఒక నాడు అన్నింటికీ తెగించి తిరుగుబాటు చేయటం తథ్యం. ఏ సమాజమైనా సరే-కాస్త ముందూ వెనకగా-ఎప్పటికైనా బానిసలకు స్వాతంత్ర్యం ఇవ్వక తప్పదు. లేకుంటే ఆ సమాజానికి విచ్ఛిత్తి తప్పదు. చరిత్రలో ఇందుకు పెక్కు ఉదాహరణలు కనిపిస్తాయి.

ఈ బానిసలు సాధారణంగా యుద్ధ ఖైదీలై ఉంటారు. ఒక్కొక్క ప్పుడు స్వతంత్రులే తిండిలేక, కడుపుమంట భరించలేక, తమకు తిండిపెట్ట గలవారి వద్ద ఊడిగానికి ఒప్పుకునే వారు. పూర్వం యుద్ధం, ఆకలి మాన వుని స్వాతంత్ర్యాన్ని ఏ విధంగా కబళించాయో దీనివల్ల తెలుస్తుంది. "స్వాతంత్ర్యం ఎప్పుడూ-ఆహారం, స్నేహం - ఈ రెండింటితో ముడిపడి

ఉంటుంది.'' చంద్ర నేర్పే అతిముఖ్యమైన పాఠాలలో ఇది ఒకటి, అయితే ఈ సత్యాన్ని కొందరు చాలా ఆలస్యంగా గుర్తించారు.

'స్వాతంత్ర్యం' శాసనం విధానం పైన ఆధారపడి ఉంటుంది, అంటే-ప్రజలందరి శ్రేయస్సు కోసం సమాజం అనుసరించే ప్రవర్తన నిబంధనావళి పైన ఆధారపడి ఉంటుందన్న మాట. అయితే, మంచి శాసనాలు ఎప్పుడూ మంచి ప్రభుత్వంపై ఆధారపడి ఉంటాయి. విశాల మైదా-



నంలో ఒంటరిగా తిరుగాడే తోడేలుకు 'స్వాతంత్ర్యం' ఉండదు. ఏ వేటగాడైనా అటువైపు వస్తే దాన్ని తుపాకితో కాల్చి చంపవచ్చు. తోడేలు శాసనానికి కట్టుబడిన జీవి కాదు.

పూర్వం అత్యుత్తమ శాసనాలు రూపొందించిన వారిలో మెసపొటేమియాను పాలించిన హమూరాబీ అనే రాజు ఒకడు. అతడు నాలుగు

వేల సంవత్సరాల క్రిందటి వాడు. అతడు తన శాసనాలలో కొన్నింటిని - అందరూ చదువుకోడానికి వీలుగా - ఒక ఎత్తైన శిల్ప పాలరాతి స్తంభంపై చెక్కించాడు. (ఆ స్తంభం ఇప్పటికీ ఒక మ్యూజియంలో భద్రంగా ఉన్నది.) ఆ శాసనాలు చాలా స్పష్టంగా, అపరూప మాత్రంగా ఉన్నాయి. నిత్య జీవితానుభవాలను దృష్టిలో ఉంచుకుని, ప్రతి వ్యక్తికీ న్యాయం చేకూర్చే ఉద్దేశంతో అతడు ఆ శాసనాలను రూపొందించాడు. న్యాయమైనవిగా ఉంటే తప్ప, శాసనాలు చిరకాలం మనజాలవు.

## సర్వమానవ సౌభ్రాతృత్వం

కాని, మతానికి కూడా 'స్వాతంత్ర్యం'తో చాలా సంబంధం ఉన్నది. ప్రపంచంలోని, గొప్పమతాలన్నీ కూడ ఏదో ఒక రూపంలో 'సౌభ్రాతృ' త్వాన్ని ప్రతిపాదించాయి. మానవజాతి అంతా ఒక తండ్రి సంతాన మేననీ, అందుచేత మానవులంతా ఒకే విశ్వకుటుంబంలోని సోదరీ సోదరు లనీ మతాలు ప్రవచించాయి, ప్రబోధించాయి.

ప్రసిద్ధ చైనా ప్రవక్త కన్‌ఫ్యూషియస్ "ఆకాశపు నీడలో అంతా ఒక్కటే కుటుంబం" అనీ, "చతుస్సాగర పర్యంతం మానవులందరూ సోదరులు" అని ప్రవచించాడు.

అదేవిధంగా గౌతమబుద్ధుడు, ఇతర మతప్రవక్తలు కూడా ప్రబోధించారు. వివిధ నాగరకతలుగా, ప్రాంతాలుగా, భాషలుగా విభక్తమై ఉన్నప్పటికీ, మానవజాతి అంతా-ఆధ్యాత్మికంగా-ఒక్కటేనని వారందరూ విశ్వసించారు.

"భగవంతుడు అన్ని జాతులకూ ఒకే రక్తాన్ని పంచాడు" అని ప్రసిద్ధ క్రైస్తవ ప్రవక్త సెయింట్ పాల్ ప్రవచించాడు.

అయితే, ఈ ప్రవచనాలకు స్వాతంత్ర్యానికీ సంబంధం ఏమిటి? రెండు ముక్కల్లో చెప్పాలంటే - స్వాతంత్ర్యం కేవలం రాజకీయాలకు,

కా[illegible] సహకరించడం నేర్చుకుంటాం. ప్రజలలో ఒకరిపట్ల మరొకరికి ఏ భావం ఉన్నదో దానికీ, స్వాతంత్ర్యానికి సంబంధం ఉన్నది. అంటే - ప్రజా[illegible]తో [illegible] 'విశ్వాసం'తో దానికి నిమిత్తం ఉన్నదన్నమాట.

'ప్రపంచమంతా ఒక్కటే కుటుంబం, మానవులందరిదీ ఒక్కటే భవిష్యత్తు' అనే వాదం అతిముఖ్యమైనది. ఇందులోని అర్థం ఇది. మానవులందరూ-[illegible]-ఏదో విధంగా పరస్పరం సన్నిహితులై కలిసి కృషిచేయక తప్పదు. అలా చేయకపోతే వారు నిరంతరం యుద్ధాలతో ఒకరినొకరు నాశనం చేసుకుంటూ ఉంటారు. అంతేకాక, తమలోతాము [illegible] భయసందేహంతో సతమతమై పోతారు. తాము 'భద్రం'గా ఉన్నామనే ప్రశాంతి ఉండదు. [illegible] హాయిగా నిశ్చింతగా నిద్రపోలేరు.

[illegible]చేత మతాన్ని అవలంబించినట్లయితే, మనుషులు పరస్పర విభేదాలు విస్మరించి, ద్వేషాన్ని త్యజించి, స్నేహ సౌభ్రాత్రాలతో కలిసి మెలిసి [illegible]కుంటారని ప్రవక్తలు ఆశించారు. పీడాబాధనుంచి, యుద్ధ భయం నుంచి మనిషికి స్వాతంత్ర్యాన్ని ఇవ్వగల ఏకైక మార్గం ఇదే నని వారు ఘోషించారు.

ఈ అధ్యాయంలో మనం చర్చించిన అంశాలన్నింటినీ సమన్వయించి చెప్పాలంటే, సామాజిక జీవిత మంతటికీ-స్వాతంత్ర్యం, ఆహారం స్నేహం-మూడు పునాదిరాళ్ళు. ఈ మూడూ ఒకదానితో ఒకటి విడదీయ రాని విధంగా ముడిపడి ఉన్నాయి. దీని సారాంశం ఇది:

'నాగరకత' అంటే సహకారం.

# 2

# అన్నిదారులకు ఒకటే గమ్యం - రోమ్

ప్రపంచప్రసిద్ధమైన ఒలింపిక్ క్రీడలకు పుట్టినిల్లు గ్రీసుదేశం.

పరుగుపందాలు, కుస్తీపందాలు, గుర్రపు పందాలు-ఇటువంటి అనేక రకాల పందాలలో పాల్గొనడానికి ఏజియన్ సముద్రప్రాంతంలోని పెక్కురేవు పట్టణాలనుంచి, దీవులనుంచి క్రీడాకారులు వచ్చేవారు. అక్కడ గ్రీసుదేశపు తూర్పుకోస్తాకు, ఆసియామైనర్ పశ్చిమ కోస్తాకు మధ్య ఏజయన్ సముద్రం అఖాతంలాగా చొచ్చుకు వస్తుంది. రెండు కోస్తాలూ ఎదురూ బొదురూగా ఉంటాయి, కోస్తాల పొడుగునా లెక్కలేనన్ని చిన్నచిన్న కయ్యలు ఉన్నాయి.

ఈ ప్రాంతంలో ఒక సమైక్య సమాజం రూపురేఖలు దిద్దుకోవటం చూస్తాము. ఇక్కడ కూడా మళ్ళీ జలమార్గాలే సంబంధ సాధనాలు అయినాయి. ఇక్కడ ఏజియన్ సముద్రానికి మూడు వైపుల ఎత్తైన కొండలు గోడల్లాగా ఉన్నాయి. ఈ ప్రాంతం మరొక సాగరికతా నిలయంగా రూపొందింది.

అతి ప్రాచీనులైన గ్రీకులు 'నగర రాజ్యాల'లో నివసిస్తూ ఉండేవారు. కోస్తాపొడుగునా వున్న ఎత్తైన పర్వత శ్రేణులమధ్య సన్నని లోయ

లలో ఈ నగర రాజ్యాలు వుండేవి. అవి ఒక్కొక్కటి, ఇప్పటి మన చిన్న పట్టణాలంత వుండేవి. అయినా దేనికదే ఒక స్వతంత్రరాజ్యంగా ఉండేది. దేని ప్రభుత్వం దానికి ఉండేది. దేని శాసనాలు దానికి ఉండేవి. ఒకదాని వ్యవహారాలలో ఇంకొకటి జోక్యం కలిగించుకోవడానికి వీల్లేదు. అందుకే నాటిని 'నగర రాజ్యాలు' అనే పేరు వచ్చింది.



మళ్ళీ ఒలింపిక్ క్రీడల విషయానికి వద్దాం. ఈ క్రీడలు ఒలింపియా వద్ద నాలుగేళ్ళు కొకసారి జరుగుతూ ఉండేవి. ఏజియన్ ప్రాంతం అంతటి నుంచి క్రీడాకారులు, ప్రేక్షకులు అక్కడకు వచ్చేవారు. మొదటి ఒలింపిక్ క్రీడోత్సవం క్రీస్తుపూర్వం 776 సంవత్సరంలో జరిగింది, అప్పటినుంచి సుమారు వెయ్యి సంవత్సరాల వరకు క్రమం తప్పకుండా నాలుగేళ్ళ కొకసారి ఈ క్రీడోత్సవాలు జరుగతూ వచ్చాయి. తర్వాత ఎన్నో శతాబ్దాలు ఈ క్రీడలు జరగలేదు. మళ్ళీ నవీనకాలంలో ఒలింపిక్ క్రీడలు ప్రారంభమైనాయి. ఇప్పుడివి నాలుగేళ్ళకొకసారి, ఒక్కొక్కసారి ఒక్కొక్క నగరంలో జరుగుతున్నాయి. ప్రపంచదేశాలన్నీ వీటిలో, పాల్గొంటున్నాయి.

ఇటీవల కాలంలో లాస్ ఏంజెలెస్, బెర్లిన్, టోకియో, లండన్, రోమ్, హెల్సింకీ మొదలయిన నగరాలలో ఈ ఉత్సవాలు జరిగాయి

1964 లో జరిగిన శీతకాలపు ఒలింపిక్ క్రీడోత్సవంలో క్రీడాకారు లందరి తరపున ఒక ఆస్ట్రియన్ ఆటగాడు ఒలింపిక్ శపథం స్వీకరించాడు. అప్పుడే 'ఈ ప్రమాణ వాక్యం'లో ఒక చిన్న మార్పు చేయటం జరిగింది. "క్రీడల వైభవోన్నతి కోసం, మన దేశాలగౌరవంకోసం" అనే వాక్యంలో 'దేశాల' అనే మాటను తీసివేసి, దాని బదులు 'బృందాల' అనే మాటను పెట్టారు. ఒలింపిక్ క్రీడలు జాతీయతకు అతీతమైనవనీ, వీటిలో జాతిప్రసక్తి ఉండరాదనీ భావించి ఈ మార్పు చేశారు. ఈ మార్పును పూర్వపు గ్రీకులు కూడా హర్షించి ఉండేవారనే భావించవచ్చు. (జాతీయతను గురించిన చర్చ నాల్గవ అధ్యాయంలో వస్తుంది )

ఒలింపిక్ క్రీడోత్సవ సందర్భంలోనే పెద్దపెద్ద ఇతర వేడుకలు, ఉత్సవాలు కూడా జరిపేవారు. ప్రపంచ సాహిత్యంలో మనకు తెలిసిన అతి ప్రాచీన నాటకాలలో కొన్ని, ఈ ఉత్సవాలలోనే మొదటిసారిగా రంగస్థలం మీదికి వచ్చాయి. వీటిలో చాలా నాటకాలు ఈ నాటికీ ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. సార్వజనికమైన సమస్యలను, అతిగంభీరమైన భావాలను ఆధారం చేసుకుని వ్రాసిన నాటకాలు కాబట్టే అవి అమరకావ్యాలైనాయి.

క్రీడోత్సవం ప్రారంభించడానికి ముందు మతగురువులు, పూజారులు అక్కడచేరి, క్రీడను నిర్విఘ్నంగా జరగడానికి భగవత్కృప కోసం కొన్ని పవిత్ర కర్మలు జరిపేవారు. దేవతలందరూ ఒలింపస్ శిఖరం మీద ఉంటారనీ, వారిని ప్రార్థిస్తే ఆశీస్సులు కురిపిస్తారనీ ఆనాటి గ్రీకులు విశ్వసించేవారు. ఒలింపస్ పర్వతం వారికి అతి పవిత్రమైనది. నగర రాజ్యాల మధ్య తగవులాటలు ఎన్ని ఉన్నా, అందరూ ఒలింపస్ పర్వతాన్నే నమ్మి పూజించేవారు. దేవతల ఆగ్రహానుగ్రహాలు, పూజాపురస్కారాల విషయంలో పూజారులు ఎంత చెబితే అంతగా ఉండేవి.

ఆ విధంగా, వేరువేరుగా విడిగా, స్వతంత్రంగా బతికిన నగరరాజ్యాలు ఐక్యం కావటానికి తోడ్పడిన శక్తులలో గ్రీకు మతం ఒకటయింది.

చెల్లా చెదరుగా ఉన్న ఈ నగర రాజ్యాలు కొన్నిరకాల సమస్య లను-అంటే, ఆర్థిక, రాజకీయ, అంతర్జాతీయ సమస్యలను-పరిష్కరించుకో వలసి వచ్చింది. మనుషులు కలిసి ఆటలాడుకోగలుగుతున్నప్పుడు, ఇతర పనులు మాత్రం కలిపి ఎందుకు చేయలేరు? పైగా మతం, భాష ఒకటే అయి నప్పుడు కలిసి కృషి చేయటం కష్టమేముంది? గ్రీకు నగర రాజ్యాల పరిస్థితి అలాగే ఉంది.

ప్రతి నగరానికి వారు ఉత్కృష్టమైన 'ప్రభుత్వాన్ని' రూపొందించుకో వాలని తహతహలాడుతూ ఉండేవారు. (ఇంగ్లీషులో 'రాజనీతి' అనే పదా నికి ఇప్పుడు వ్యవహారంలో ఉన్న 'పొలిటిక్స్' అనే పదం ఆ రోజుల్లోనే పుట్టింది. 'నగర వ్యవహారాల నిర్వహణ పద్ధతి' అని దాని అర్థం.) ప్రసిద్ధ విజ్ఞానులు ప్లేటో, అరిస్టాటిల్ ఆ రోజుల్లోనే రాజకీయాల మీద ప్రప్రథ మంగా కొన్ని గ్రంథాలు రచించారు. మనుష్యులను 'పరిపాలించటం' ఎలా అనే విషయమై వారు ప్రకటించిన భావాలు ఈ నాటికీ ఎంతో విలువైన విగా ఉన్నాయి. అప్పటికీ, ఇప్పటికీ రాజకీయాలు ఎంతో విస్తృతమై, క్లిష్టమైనప్పటికీ, నాటి గ్రీకులు ప్రతిపాదించిన పరిపాలనా సూత్రాలు నేటికీ అనుసరణీయాలుగా వున్నాయి.

ఆనాటి గ్రీకులలో మరొక ప్రసిద్ధ తత్త్వవేత్త సోక్రటీసు. ఆయన ఏథెన్సు నగర వాసి, సమాజంలో సమష్టి జీవనానికి సంబంధించిన సమస్య లను గురించి ఆయన తీవ్రంగా ఆలోచించాడు. తన చుట్టూ వున్నవారిలో ఆలోచనలు పురికొల్పాడు. పైకి అవివేకంగా, మెరటుగా కనిపించే ప్రశ్నలు వేస్తూ ఉండేవాడు. ఆ ప్రశ్నలు కొందరికి ఆగ్రహాన్ని కలిగించేవి. చివరికి నగరపాలకులు ఆయనకు విషం ఇచ్చి చంపారు. ఒక విషయాన్ని బోధిం చటంలో ఆయన కొన్ని ప్రత్యేక పద్ధతులు అనుసరించేవాడు. ఆ విషయం

అంతుచిక్కే వరకు విసుగుపుట్టేటట్లు ప్రతి వ్యక్తినీ ప్రతి విషయం పైనా ప్రశ్నిస్తూ ఉండేవాడు.

ఒకానొక సందర్భంలో సోక్రటీసు చెప్పిన మాటలు ఈ పుస్తకానికి చాలా ముఖ్యమైనవి. ఆ మాటలు ఇవి. "నీది ఏ దేశమని ఎవరైనా అడిగితే, ఏథెన్సు వాసిననీ, కొరింథియనుననీ చెప్పకు. ప్రపంచ పౌరుడినని చెప్పు."

## ప్రజాస్వామ్యం పుట్టిన రోజు

ప్లేటో, అరిస్టాటిల్, సోక్రటీసు వంటి విజ్ఞానుల ప్రభావంవల్ల రెండు ముఖ్యమైన వ్యవస్థలు క్రమంగా రూపుదిద్దుకుంటూ వచ్చాయి. నాటి నుంచి నేటి వరకు ప్రపంచ ప్రజలందరికీ అవి అనుసరణీయాలైనాయి.

వీటిలో మొదటిది 'ప్రజాస్వామిక ప్రభుత్వం.'

2,500 సంవత్సరాల క్రితం గ్రీసులో దైనందిన పరిస్థితులు ఇప్పటి వలె ఉండేవి కావు. నిజానికి ఆనాటి గ్రీకు ప్రజాస్వామ్యం ఎక్కువగా 'పై తరగతి' ప్రజల వ్యవహారంగా ఉండేది. నగర రాజ్యాలలో ఆర్థిక జీవన ప్రమాణం ఉన్నతికోసం చాకిరి చేసినవారు బానిసలే. వీరి సంఖ్య చాలా ఎక్కువగా ఉండేది. సమాజంలో ప్రజలందరి సుఖజీవనానికీ రోజూ చేయవలసిన వెట్టి పనులన్నీ వారే చేసేవారు. అయితే, వీరిలో అద్భుతమైన నైపుణిగల కళాకారులు, చేతిపనులవారు, తాపీ పనివారు కూడా ఉండేవారు.

ఏమైనప్పటికీ,-కొన్ని వందల సంవత్సరాలపాటు-ఈ నగర రాజ్యాలలో క్రమం తప్పకుండా నగరపాలకమండలి 'ఎన్నికలు' జరుగుతూ వచ్చాయి. ఆ విధంగా-పరిమిత భావంలోనే అయినప్పటికీ-వారు 'ప్రజల కోసం', 'ప్రజలచేత' నిర్వహింపబడే 'ప్రజలయొక్క' ప్రభుత్వాన్ని స్థాపించారు. అదే ప్రజాస్వామ్య ప్రభుత్వ సిద్ధాంతం. (ఇంగ్లీషులో ప్రజా

స్వామ్యాన్ని 'డెమోక్రసీ' అంటారు. 'డెమోస్', 'క్రటియా' అనే రెండు గ్రీకు పదాలలో నుంచి ఈ మాట పుట్టింది 'డెమోస్' అంటే 'ప్రజలు అనీ, 'క్రటియా' అంటే 'పరిపాలించటం' అనీ అర్థం )

నాటికీ నేటికీ-ఒక ప్రభుత్వ విధానంగా-ప్రజాస్వామ్యం ఎంతో విస్తృతి, పరిణతి పొందింది. నవీనకాలంలో అది మరింత శీఘ్రంగా విస్తృతమయింది. అయితే, ఈ పుస్తకంలో మనం 'ప్రజాస్వామ్యం' అనే పదాన్ని వాడుతున్నప్పుడు ఒక విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. ఈ నాడు ప్రపంచంలోని వివిధ దేశాలు వివిధ రకాల ప్రభుత్వాలను ఏర్పాటు చేసుకుంటున్నాయి. 'ప్రజాస్వామిక' అనే విశేషణాన్ని తగిలించుకున్న దేశాలన్నీ ఒకే రకమైన ప్రజాస్వామ్యాన్ని అనుసరించటం లేదు. ముందు అధ్యాయాలలో ఉదహరించిన నలభై పైచిలుకు 'కొత్త' దేశాలు పాశ్చాత్య ప్రజాస్వామ్య సంప్రదాయాన్నే పాటిస్తాయన్న నమ్మకం లేదు.

అసలు నిజం చెప్పాలంటే-సర్వకాలాలకు, సర్వ ప్రజలకు అను సరణ యోగ్యమైన పరిపూర్ణ రాజకీయ విధానం అంటూ ఒక్కటి కూడా ప్రపంచంలో లేదు. పూర్వపు నాగరికతలను క్షుణ్ణంగా పరిశీలిస్తే ఈ విషయం మనకు బోధపడుతుంది. 'వసుధైక' ప్రజాస్వామ్యాన్ని స్థాపించ డానికి సాగిస్తున్న కృషిలో మనం మన జీవితకాలంలోనే చాలా పెద్ద పరి ణామాలను చూడగలం. అందుకే ఐక్యరాజ్య సమితి నిబంధనావళి సహ నాన్ని గురించి అంతగా ఘోషించింది (ఈ నిబంధనావళిని గురించి 10 వ అధ్యాయంలో చర్చించు కుందాము.) సహనం లేనిదే ఇన్నిరకాల జాతీయ ప్రభుత్వాలు నేటి ప్రపంచంలో శాంతియుత సహజీవనం సాగించలేవు.

## సమితుల అవతరణ

గ్రీకులు రూపకల్పన చేసిన రెండవ ముఖ్యవ్యవస్థ 'సమితి' (League)

ఈ సమితులు కొన్ని సమిష్టి ప్రయోజనాల కోసం నగర రాజ్యా లన్నింటినీ ఒక్కచోటికి చేర్చాయి. 'నానా జాతి సమితి'ని ఒకదాన్ని స్థాపించడానికి చరిత్రలో జరిగిన మొట్టమొదటి ప్రయత్నం అదే. ఇది పాతిక శతాబ్దాల క్రితం జరిగిందన్న సంగతి మరచి పోకూడదు.

క్రీడల విషయంలో పరస్పరం సహకరించుకొనటం ఈ సమితుల ముఖ్య లక్ష్యాలలో ఒకటి. వాటి ఇతర లక్ష్యాలు ఇవి;

పర్షియా దాడులనుంచి తమను తాము కాపాడుకోవడం;

ఏజియన్ సముద్రపు దొంగలను అణచివేయడం;

వివాహాది సాంఘికాచారాల విషయంలో సమిష్టి శాసనాలు రూపొందించుకొనడం.

డెలాస్ ద్వీపంలో గల అపోలో దేవుని ఆలయంలోనూ, ఇతర ఆలయాలలోనూ అందరూ కలిసి పూజలు, ప్రార్థనలు చేసుకోవడం.

ప్రజాస్వామిక ప్రభుత్వ విధానం ఈ సమితులకు గిట్టనట్లు పైకి కనిపించవచ్చు. కాని, నగర రాజ్యాల స్వాతంత్ర్యాన్ని స్వాధీనం చేసుకో డానికి ముందు, ఈ సమితులు సభ్యరాజ్యాలన్నింటినీ పటిష్ఠం చేయడానికి కృషిచేశాయి. "సమాజం కోసం వ్యక్తి, వ్యక్తికోసం సమాజం" అనేది వాటి ధ్యేయం.

నగర రాజ్యాలన్నింటికీ వోట్లు సమానంగా వుండేవి. ఒకటి ఎక్కువ ఒకటి తక్కువ అని లేకుండా అన్నింటికీ సమాన ప్రతిపత్తి ఉండేది. అందుచేత, సమితిలో సభ్యత్వంవల్ల ప్రతి నగరరాజ్యానికి హెచ్చు 'స్వాతంత్ర్యం' లభించేది. ఈ సమితుల పుణ్యమా అని గ్రీసు దేశం అనేక సంవత్సరాలపాటు శాంతి సౌభాగ్యాలతో తులతూగింది. సమితులు లేకుండా ఆ రాజ్యాలేవీ తమంతట తాము అంత భద్రత పొంద గలిగేవి కాదు.

క్రమంగా, ఈ సమితులవల్ల కలుగుతూన్న లాభాలు అనుభవానికి వస్తున్నకొద్దీ, సభ్యరాజ్యాలు కొన్ని సమిష్టి శాసనాలను రూపొందించుకోవటం ప్రారంభించాయి. ఉదాహరణకు— తమలో తమకు యుద్ధాలు వచ్చినప్పుడు ఖైదీలను చంపకుండా బంధించి ఉంచి, ఆ తర్వాత సమయం సందర్భం కలిసి వచ్చినప్పుడు ఒకరి ఖైదీలను మరొకరికి అప్పగించుకుంటూ ఉండేవారు. అలాగే, ఒకరి నీటివనరులకు మరొకరు ఆటంకం




కల్పించరాదనీ, ఒకరి దేవాలయాలను మరొకరు గౌరవించాలనీ కూడా సభ్యరాజ్యాలు అంగీకారానికి వచ్చాయి

ఆ విధంగా 'అంతర్జాతీయ న్యాయసూత్రాలు' అవతరించాయి. ఆ శాసనాలు ఏదో ఒక రాజ్యానికి కాక, ప్రపంచంలో ఎక్కడెక్కడ గ్రీకులు

ఉన్నారో ఆ ప్రాంతాలన్నింటికీ వర్తించేవి. ఈనాడు ప్రపంచ దేశాలన్నీ ఈ అంతర్జాతీయ న్యాయసూత్రాలకు కట్టుబడి, యుద్ధకాలంలో గానీ, శాంతి కాలంలో గానీ, ఒకరిపట్ల మరొకరికిగల విధులను నిర్వర్తించడానికి ప్రమాణం చేస్తున్నాయి దీనివల్ల దీర్ఘకాలికంగా అన్ని దేశాలకూ లాభం ఉంటుంది. (నేటి అంతర్జాతీయ న్యాయసూత్రాన్ని గురించి ముందు పేజీలలో తెలుసుకుందాం )

కాలపరిస్థితులు ఎప్పుడూ ఒక్క విధంగా వుండవు. గ్రీకులకూ క్షీణదశ ప్రాప్తించింది నగర రాజ్యాలు, వాటి సమితులు చీటికీ మాటికీ కీచులాడుకోవటం మొదలు పెట్టాయి. తమలో తమకే కాకుండా, బయటి వారితో కూడా వారికి పోట్లాటలు ఎక్కువైనాయి. చివరికి-పిట్టపోరు పిట్ట పోరు పిల్లి తీర్చిందన్నట్లు-రోమనులు వచ్చి దాడి జరిపి ఈ గ్రీకు రాజ్యాలన్నింటిని ఆక్రమించు కున్నారు.

## కథారంగంలో రోమ్ ప్రవేశం

మొదట్లో రోమ్ కూడా నగరరాజ్యంగానే ఉండేది, సముద్రానికి అట్టే దూరం కాకుండా, ఏడు కొండలమీద కుదుమట్టంగా అమరి ఉండేది. తర్వాత క్రమంగా చుట్టూ వున్న ప్రదేశాలను ఆకమించుకోవటం ప్రారంభించింది. ఇది క్రీస్తుకు 500 సంవత్సరాల క్రిందటి మాట.

మొదట రోమనులు ఇటలీ నంతటినీ వశం చేసుకున్నారు. ఆ తర్వాత తమ ఎల్లలను ఉత్తరానికి, దక్షిణానికి, తూర్పుకు, పడమరకు జరుపుకుంటూ వచ్చారు రోమనుల వైభవం అత్యున్నత స్థాయికి వచ్చేనాటికి, ప్రపంచంలో రోమన్ 'సామ్రాజ్యా'నికి సాటి మరొకటి లేదు. అంతటి బలసంపత్తిని, సుస్థిరతను సాధించిన సామ్రాజ్యం ప్రాచీన ప్రపంచ చరిత్రలోనే మరొకటి లేదు.

రోమన్ సామ్రాజ్యం ఏ పునాదులపై అంత దృఢంగా నిలవగలి గిందో చూద్దాం.

మొట్టమొదటగా వారి రహదార్లను గురించి చెప్పుకోవాలి. ఇక్కడ మళ్ళీ మన కథలో రవాణా మార్గాల ప్రసక్తి తప్పదు. రోమ్ ఎక్కువ భూభాగాన్ని తన సైనిక శక్తితోనే జయించింది రాజధానియైన రోమ్‌లో కూచుని, సామ్రాజ్యంలో ఏ మూల ఎప్పుడు ఏమి జరుగుతున్నదో వెంటనే తెలుసుకోవడానికి వీలయిన హంగులన్నీ సమకూర్చుకున్నారు. కనుకనే రోమనులు తాము జయించిన భూభాగంలో రాజకీయ సమైక్యాన్ని సాధించి కొన్ని వందల సంవత్సరాలపాటు దానిని కాపాడుకో గలిగారు.

ఇప్పుడు స్పెయిన్, ఫ్రాన్స్, బ్రిటన్, జర్మనీ దేశాలుగా పిలవ బడుతున్న భూభాగాలన్నీ ఆనాడు రోమన్ సామ్రాజ్యంలో భాగాలు నాటి




రోమన్ ఇంజనీర్లు రాజధానినుంచి ఈ ప్రాంతాలన్నింటికీ దిట్టమైన రహదార్లు నిర్మించారు. చక్రంలోని ఆకులన్నింటికీ ఇరుసు కేంద్రంగా ఉన్నట్లు,

సామ్రాజ్యంలోని రహదార్లన్నింటికీ రోమ్ కేంద్రంగా ఉండేది. ఇది రోమనులు సాధించిన మహాద్భుత కార్యం.

అయితే, రోమనుల రవాణా మార్గాలు కేవలం రహదార్లు మాత్రమే కాదు. వారికి జలమార్గాలు కూడా ఉండేవి. (పటంలో చూడండి) రోమన్ సామ్రాజ్యం మధ్యధరా సముద్రం చుట్టూ-ఎక్కడా ఖాళీ లేకుండా అల్లుకుంది. మధ్యధరా సముద్రం యావత్తూ రోమన్ సామ్రాజ్యపు గుప్పిట్లో ఉండేది. రోమనుల నౌకలు మధ్యధరా సముద్రం మీదుగానే మెసపొటేమియా, ఈజిప్టులకు ప్రయాణం చేసేవి. తనకంటే ప్రాచీన నాగరికతగల ఈ రెండు ప్రాంతాలకు రోమ్ తన ఆచార వ్యవహారాలను, తన ప్రభుత్వ విధానాలను, సంప్రదాయాలను రవాణా చేసింది.

రోమన్ సామ్రాజ్యానికి పశ్చిమాన సహారా ఎడారి, ఉత్తర ఆఫ్రికాలోని కొండలు పెట్టని కోట గోడల్లాగా ఉండేవి. వాటిని దాటి వీరు పోవడానికి వీల్లేదు, ఇంకొకరు రావడానికి వీలులేదు. పశ్చిమాన అట్లాంటిక్ మహాసముద్రం పెట్టని అవరోధంగా ఉండేది. ఆ సముద్రానికి అడ్డంపడి పోయినవారు ఆ కాలంనాటి వారిలో ఎవ్వరూ లేరు. అంతటి సాహసానికి ఎవరూ ఒడిగట్టేవారు కారు. ఇక ఉత్తరాన, తూర్పున కొండలు, సముద్రాలు, అరణ్యాలు, మంచుముద్దలాంటి స్టెప్పీ మైదానాలు ఉన్నాయి. వీటిలో కిరాతకుల్లాంటి దేశద్రిమ్మరి తెగలవారు ఉండేవారు. అందుచేత రోమనులు ఉత్తరాన, తూర్పున పెద్ద నదులను తమ సరిహద్దులుగా పెట్టుకోవలసి వచ్చింది. రైన్, డాన్యూబ్ నదుల తీరాలు, నల్లసముద్రం కోస్తావారి సరిహద్దులయినాయి. సామ్రాజ్య విస్తరణ ఆ సరిహద్దుల దగ్గర ఆగిపోయింది.

ఇక్కడ మనం గమనించదగ్గ గొప్ప విషయం ఒకటుంది: 150 సంవత్సరాల క్రితం రోమ్ నుంచి ఫ్రాన్స్‌కుగానీ, బ్రిటన్‌కుగానీ వెళ్ళడానికి ఎన్ని రోజులు పట్టేదో, రోమన్ సామ్రాజ్య కాలంలో కూడా అన్నే

రోజులు పట్టేది. (ఆరోజుల్లో ఫ్రాన్సు పేరు గాల్.) అంటే — 1820 ప్రాంతంలో యూరప్‌లో రైల్వే మార్గాల నిర్మాణం జరిగే వరకు రవాణా మార్గాల పరిస్థితి రోమనుల కాలంలో ఎలా ఉండేదో అలాగే ఉన్నదన్న మాట,

దీనిని బట్టి యూరప్‌లో రవాణా మార్గాలు రెండువేల సంవత్సరాల కాలంలో ఎంత స్వల్పంగా అభివృద్ధి చెందాయో తెలుస్తుంది. యూరప్‌లో ఒక చోటినుంచి ఇంకొక చోటికి గుర్రాలమీద వెళ్ళాలన్నా, నాలుగు చక్రాల బళ్ళమీద వెళ్ళాలన్నా-150 సంవత్సరాల క్రితం వరకు-పూర్వపు రోమన్ ఇంజనీర్లు నిర్మించిన రహదారులే శరణ్యంగా ఉండేవి. (యాంత్రిక ప్రయాణ సాధనాల అభివృద్ధి, వాటి ఫలితాలను గురించి 7, 8 అధ్యాయాలలో చర్చించుకుందాం.)

## న్యాయ్యం — అంటే ఏమిటి?

రోమనుల రహదార్లు సామ్రాజ్య మంతటా ఒక 'క్రమస్థితి'ని నెలకొల్పగలిగాయి. కాని, ఈ క్రమస్థితి సాధనకు వెనుక 'శాసనం' యొక్క ప్రభావం ఉంది.

క్రీస్తుపూర్వం సుమారు 500 సంవత్సరంలో రోమన్ సామ్రాజ్య స్థాపన జరిగినప్పటి నుంచి, క్రీస్తు తర్వాత సుమారు 500 సంవత్సరంలో సామ్రాజ్యం పతన మయ్యే వరకు-సుమారు ఒక సహస్రాబ్ది కాలం-రోమనులు 'న్యాయ్యాన్ని' పరిపూర్ణంగా విశ్వసించారు; తమ ఏలుబడి క్రింద ఉన్న అన్ని ప్రాంతాలలో నూ వారు న్యాయ స్థానాలను నెలకొల్పారు. గొప్ప న్యాయ మూర్తులను నియమించారు.

'న్యాయ్యం' అనే మాటకు ఖచ్చితంగా అర్థం చెప్పటం కష్టం. కళ్ళకు గంతలు కట్టుకుని, తూకం తప్పకుండా త్రాసును చేతబట్టుకున్న ఒక దేవతను న్యాయానికి అధిష్ఠగా రోమనులు చిత్రించుకున్నారు. అందరి పట్ల

నిష్పక్షపాతంగా వ్యవహరించటం ముఖ్యమని వారు గుర్తించారు జస్టినియన్ అనే గొప్ప రోమన్ న్యాయవాది క్రీస్తు శకం 553 లో న్యాయ్యానికి ఈ విధంగా నిర్వచనం చెప్పాడు. "ప్రతి మనిషికి చెందవలసిన దానిని చెందే టట్లు చేయడం 'న్యాయ్యం.' "



శాసనాన్ని ఉల్లంఘించిన వారిపట్ల రోమన్ న్యాయం చాలా కఠినంగా ఉండేది. బానిసల పట్ల మరింత క్రూరంగా ఉండేది. అయినప్పటికీ అది విశ్వసించతగినదిగా ఉండేది. ప్రజలు దాని మీద నమ్మకంతో ధైర్యంగా ఉండగలిగేవారు. క్రమంగా ఆ న్యాయ్యాన్ని-రోమనులకు మాత్రమే కాక-వారి ఏలుబడి క్రిందకు వచ్చిన విదేశీయులందరికీ వర్తింప చేశారు. గ్రీకు శాసనాలలోని అత్యుత్తమమైన వాటిని వారు స్వీకరించారు. నాగరక ప్రజలందరి సమష్టి శాసనంగా పునర్వ్యవస్థీకరించారు. ప్రపంచ న్యాయ సూత్రా



నికి అది ప్రాథమికస్వరూపమని చెప్పవచ్చు. నేటికాలంలో ప్రపంచ న్యాయ సూత్రపు ప్రాముఖ్యాన్ని గురించి చర్చించేటప్పుడు మళ్ళీ ఈ విషయానికి వద్దాం.

## రెండు - రకాల మతం

రోమనులకు మత విషయాలలో అట్టే ఆసక్తి ఉండేది కాదు వారు క్రియాశీలురు. మతవ్యవహారాలను పండితులకు, పురోహితులకు వదిలి వేశారు. ప్రభుత్వానికి చికాకులు కల్పించనంతవరకు ఏమతాన్నైనా వారు సహించేవారు. కాని, క్రైస్తవ మతం నేరుగా వచ్చి ప్రభుత్వాన్ని ఢీకొనే సరికి, దానితో వారికి పెద్ద ఘర్షణ ఏర్పడింది. ఎందుకంటేక్రైస్తవ మతం- దేశభక్తి, రాజభక్తి కాకుండా-ఇంకొక కొత్త భక్తిని ప్రబోధించటం మొదలు పెట్టింది. అప్పటి నుంచీ రోమన్ ప్రభుత్వం అతి కఠినమైన శిక్షలు విధించటం ప్రారంభించింది.

అయితే, క్రీస్తుశకం నాల్గవ శతాబ్దం నాటికి ఈ పరిస్థితి మారింది. కాన్‌స్టంటైన్ చక్రవర్తి క్రైస్తవాన్ని స్వీకరించి, రోమన్ సామ్రాజ్యం అంతటా దానిని అధికారమతంగా ప్రకటించాడు. అప్పటినుంచి ఇతర మతా పట్ల సహనం నశిస్తూ వచ్చింది. క్రైస్తవేతరులను తీవ్రంగా శిక్షించటం మొదలు పెట్టారు.

రోమన్ సామ్రాజ్యంగా మత పరిణామాలు ఇలా ఉండగా, ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో మతాల పరిస్థితి ఎలా ఉన్నదో చూద్దాం. ఎందుకంటే, ప్రపంచంలోని గొప్ప మతాలన్నీ పూర్వార్ధ గోళంలో పుట్టినవే,



అక్కడి నుండే అవి పశ్చిమ దేశాలలో వ్యాపించాయి. ('పాశ్చాత్య ప్రపంచం' అంటూ రాజకీయ నాయకులు గొప్పగా చెప్పడం మనం తరచుగా వింటున్నాం. కాని. పూర్వ శతాబ్దాలలో ఈ పాశ్చాత్య ప్రపంచం తూర్పు దేశాలకు ఎంతగా ఋణబడి ఉన్నదో మనం మరచిపోకూడదు.)

సోక్రటీసు జీవితకాలంలోనే-అంటే క్రీస్తుకు 500 సంవత్సరాల పూర్వం భారత దేశంలో గౌతమ బుద్ధుడు ఒక నూతన మతాన్ని స్థాపించాడు. అదే బౌద్ధమతం. కొద్ది శతాబ్దాల వ్యవధిలో ఆ మతం భారత దేశంలోనూ, ఆసియాలోనూ వేలాదిమైళ్ళ దూరం వ్యాపించింది. కోట్లకొలది ప్రజలు ఆ మతాన్ని స్వీకరించారు.

క్రీస్తుకి సుమారు 250 సంవత్సరాల పూర్వం భరతదేశాన్ని పరిపాలించిన అశోక చక్రవర్తి తన సామ్రాజ్యమంతటా బౌద్ధ మతాన్ని అధికారమతంగా ప్రకటించాడు. అంతేకాక, బౌద్ధమతాన్ని ఇతర దేశాలలో వ్యాపింప చేయడానికి పెక్కుమంది ప్రచారకులను పంపాడు. అశోకుడు తన విశాల సామ్రాజ్యాన్ని పెక్కు సంవత్సరాలు ఎటువంటి కల్లోలాలు లేకుండా ప్రశాంతంగా పరిపాలించాడు.

ఉత్తరాన జపాన్ మొదలు కొని, దక్షిణాన సింహళం వరకు తూర్పు దేశాలన్నింటిలోనూ బౌద్ధ మతం వ్యాపించింది. మానవ చరిత్రలో ప్రపంచ శాంతికి దోహదం చేసిన అతి ప్రబల శక్తులలో బౌద్ధమతం ఒకటి. 'ప్రపంచమంతా ఒక్కటి' అనీ, మానవులు ఒకరి విశ్వాసాలపట్ల, భావాల పట్ల మరొకరు సహనం చూపాలనీ ఆ మతం ప్రబోధించింది. మనకాలంలో ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి ఊథాంట్ బౌద్ధమతస్థుడు కావడం గమనార్హం

## రోమనులు - నెల కొల్పిన శాంతి

మళ్ళీ పాశ్చాత్య ప్రపంచానికి వద్దాం. మానవ నాగరకతకు రోమనులు ప్రసాదించిన అమూల్యమైన కానుకలు మూడు.

(1) అద్భుతమైన 'రవాణా మార్గాలు;'

(2) కట్టుదిట్టమైన 'శాసనాల'ను వ్యాప్తిలోకి తీసుకు రావడం;

(3) 'మతం' విషయంలో భిన్న భిన్న భావాల పట్ల సహనం వహించడం, ఆ తర్వాత-ఒకే దేవుని బిడ్డలుగా ప్రజలందరి మధ్య సౌదర్యం నెలకొల్పడం.

ఈ వ్యవస్థకే చరిత్రకారులు 'రోమనుల శాంతి' (Peace of Rome) అని పేరు పెట్టారు. రోమనుల శాంతి ఎక్కువగా సైనిక శక్తి మీదనే ఆధారపడిన మాట నిజం. అవినీతి, స్వార్థం కూడా ఆలంబనాలుగా ఉండేవి. అయినప్పటికీ రోమనుల వ్యవస్థ శాంతి భద్రలతో వెయ్యేళ్ళు వర్ధిల్లింది.

## "నేను రోమ్ పౌరుడను"

తాము సాధించిన ఘన కార్యాల దృష్ట్యా, ప్రపంచ నాగరకతకు తాము ప్రసాదించిన కానుకల దృష్ట్యా ప్రాచీన రోమనులకు గర్వ కారణమైనది వారి 'పౌరసత్వం.'

ఒక్క ఉదాహరణ: క్రీస్తుశకం ఒకటవ శతాబ్దంలో ఆసియాకు చెందిన సెయింట్‌పాల్ కాలి నడకన, ఓడమీద, మధ్యధరా సముద్రం మీదుగా, కోస్తాలమీదుగా సాహసోపేతమైన సుదీర్ఘ యాత్రసాగించి రోమ్ చేరాడు. మార్గంలో అడుగడుగున ప్రమాదాలను గడచి గట్టెక్కేందుకు ఆయన ఒక 'మంత్రాన్ని' ఉచ్చరించేవాడు. ఆ మంత్రాన్ని వినేసరికి ప్రభువులు, పాలకులూ సైతం ఆయనను గౌరవించేవారు. ఆ మంత్రం ఇది:- 'అహం రోమన్' ('నేను రోమన్ పౌరుణ్ణి')

రోమన్ సామ్రాజ్యంలో నివసించే ప్రజలందరూ-ఏ తెగవారైనా, ఏ మతం వారైనా, ఏ భాష వారైనా సరే-రోమనుల శాసనాలకు విధేయులై ఉండవలసిందే. అయితే అందుకు ప్రతిఫలంగా శాసనాలు వారికి

రక్షణ కల్పించేవి. అంటే—ప్రజలకు 'బాధ్యతలు,' 'హక్కులు' కూడా ఉండేవి. రోమన్ పౌరులు ఒకరి పట్ల ఒకరికిగల బాధ్యతలను నిర్వర్తిస్తే, శాసనాలు ప్రసాదించే హక్కుల వల్ల వారు లాభం పొందగలిగే వారు.

దీనినే 'న్యాయసూత్రం' అనికూడా అంటారు. దీనిని గురించి తర్వాత వివరంగా చర్చించుదాం. ఎందుకంటే, దేశాల మధ్య, ప్రజల మధ్య న్యాయసూత్రం అనేది లేనిదే ప్రపంచశాంతి అసంభవం.

చివరికి రోమనుల సామ్రాజ్య దాహం, వారి ప్రభుత్వంలోని మరి కొన్ని పెద్ద లోపాలు వారి పతనానికి దారితీశాయి. వారు యుద్ధాలలో విజయాన్ని సాధించగలిగారు గానీ, శాంతిని సాధించలేక పోయారు. వారి రహదార్లు, వారి ఆర్థిక జీవనం, వారి నైతికస్థాయి అన్నీ పతనమైపోయాయి.

ఏమైనప్పటికీ, ప్రపంచ సమైక్యం దృష్ట్యా, గ్రీకు నాగరకత నుంచి. రోమన్ నాగరకతనుంచి మనం నేర్చుకొనదగిన పాఠం ఒకటుంది. ఒక్కవాక్యంలో దాని సారాంశం ఇది.

"ఉత్తమ రవాణా మార్గాలు మనుష్యులను పరస్పరం సన్నిహితం చేస్తాయి; వారిని ఒక్కచోట కలిపి ఉంచగలిగినది ఉత్తమ నాగరకత."

# 3

# మధ్యయుగాల - ఐకమత్యం

చరిత్ర దృష్ట్యా వెయ్యి సంవత్సరాలంటే చాలా దీర్ఘకాలం. కాని, స్థలాభావం వల్ల మనం సహస్రాబ్ది చరిత్రను సుమారు 15 పేజీలలో సంక్షిప్తంగా సమీక్షించ వలసి వస్తూంది. చరిత్ర మహారణ్యంలో ప్రపంచ సమైక్యానికి దారి చూపే కొండ గుర్తులేమైనా కనిపిస్తాయేమో వెతుక్కుంటూ పోదాం.

ఈ అధ్యాయంలో మన చరిత్ర సమీక్ష—క్రీస్తుశకం ఐదవ శతాబ్దంలో రోమన్ సామ్రాజ్య పతనారంభంనుంచి, క్రీస్తుశకం 1500 ప్రాంతంలో నవప్రపంచం వెలుగులోకి రావటం ప్రారంభించే వరకు-సాగుతుంది. ఆ వెయ్యి సంవత్సరాలలో యూరప్ ప్రజలు కొన్ని ముఖ్య జీవన విధానాలను సృష్టించారు. వాటి గుర్తులు ఈ నాటికీ మన జీవితం మీద కనిపిస్తున్నాయి. వాటిలో కొన్నింటిని పరిశీలించుదాం.

## చర్చి - సారథ్యం

రోమన్ సామ్రాజ్యం జారవిడిచిన కళ్ళాలను క్రైస్తవమతం స్వీకరించింది. అప్పటినుంచి అది దాదాపు క్రైస్తవ సామ్రాజ్యం అయింది.

మొత్తం మధ్యయుగాన చరిత్ర అంతటినీ కలిపి 'పవిత్ర రోమన్ సామ్రాజ్యం' అని పేర్కొనడం కూడా కద్దు. క్రైస్తవ వ్యవస్థ—కొన్ని తప్పులు, పొరపాట్లు చేసినప్పటికీ - ఆనాటి కల్లోల పరిస్థితులలో తప్పని సరిగా అవసరమైన కొన్ని పనులు చేపింది.

మనుష్యులందరికీ తండ్రి అయిన దేవుడు ఒకడు ఉన్నాడన్నది దాని మూలసిద్ధాంతం. మతగురువుల బోధలకు, రచయితల రచనలకు దేవుడే కేంద్ర వస్తువుగా ఉండేవాడు. ఉత్సవాలన్నీ దేవుడికి సంబంధించినవిగా ఉండేవి. కట్టడాలలో కుడా దైవవిశ్వాసం ప్రధానంగా వ్యక్తమయ్యేది. చదవడం రాని పల్లె ప్రజలు, రైతులు అందమైన గాజుకిటికీలపై కళాకారులు చిత్రించిన దేవతల బొమ్మలు, మహా భక్తుల బొమ్మలు చూసి ఆనందంతో పరవశులై పోయేవారు. మధ్య యుగంనాటి అద్భుత కళాఖండాలన్నీ ఒకే ఒక విశ్వాసాన్ని వ్యక్తం చేసేవి. ఆ విశ్వాసమే యూరప్ అంతటా వ్యాప్తమయింది.

రోమనులనాటి మత వ్యవస్థతో పోల్చుకుంటే ఈ 'ఏకేశ్వర వాదం' (దేవుడు ఒక్కడేనన్న నమ్మకం) గొప్ప అభివృద్ధి అనే చెప్పవచ్చు. ఎందుకంటే, రోమనులు పరస్పర విరుద్ధ విశ్వాసాలు గల మతాలను పెక్కింటిని ప్రోత్సహించారు. ఆ చికాకును క్రైస్తవమతం తొలగించింది ఏకేశ్వర విశ్వాసం వల్ల ప్రపంచానికి చాలామేలు చేకూరింది. స్వర్గంలో ఒక్కడే దేవుడున్నాడనీ. ఆయనే సమస్త మానవులకు తండ్రి అనీ చెప్పడం ద్వారా క్రైస్తవమతం సర్వ మానవ సౌభ్రాత్రమును ప్రతిపాదించింది.

పాలస్తీనానుంచి బైబిలు కధ వచ్చింది. బైబిలులోని పాతనిబంధనలు (Old Testament)లో ఒక నూతన సందేశం బీజప్రాయంగా ఇమిడి ఉంది-అదే ప్రేమ సందేశం. మనుష్యులంతా పరస్పర శ్రేయఃకాంక్షతో మెలగాలని దాని తాత్పర్యం. ఇరుగు పొరుగు మతాలలో యూదుమతం

ప్రబలమవుతూ వచ్చింది. భౌతికమైన ఆడంబరాల కంటే, ఆధ్యాత్మిక అభి వృద్ధి విశిష్ట జీవనానికి ప్రధానమని యూదుమతం ఘోషించింది "అన్న దమ్ములంతా ఐకమత్యంతో కలిసి నివసించడంలో ఎంత ఆనందం ఉన్నది!" అని బైబిల్‌లోని 'సామ్'లో ఉంది

(Paslam 133)

"మనుషులు తమ కత్తులను, ఈటెలను కొడవళ్ళుగాను, నాగళ్ళు గాను ఉపయోగించే రోజు వస్తుంది. అప్పుడు ఇక ఒక జాతి మరొక జాతిపై కత్తి దూయదు" అని కొందరు ప్రవక్తలు ఎలుగెత్తి చాటారు. యూదులు యూరప్ అంతటా విచ్చలవిడిగా సంచరిస్తూ ఈ సందేశాన్ని ప్రచారం చేయడం ప్రారంభించారు. పాలకులు ఎన్ని శిక్షలు విధించినా, ఎన్ని హింసలు పెట్టినా, వారు ఖాతరు చేసేవారు కారు.

అయినప్పటికీ, అటువంటి కాలంలో కూడా ఏసుక్రీస్తు జీవితం, ఆయన బోధలు ప్రజల ఆలోచనలను విశేషంగా ప్రభావితం చేస్తూనే ఉన్నాయి, నాటి రాజులు, నిరంకుశ ప్రభువులు అధికారులు దయా దాక్షిణ్యాలు లేకుండా అతి క్రూరంగా ప్రవర్తిస్తున్నప్పటికీ, కొత్త నిబంధనల లోని—"నిన్ను వలె నీతోటివాని ప్రేమింపుము," "ఇతరులు నీ పట్ల ఏ విధముగ ప్రవర్తింపవలెనని నీవు కోరెదవో అదే విధముగ నీవు ఇతరుల పట్ల ప్రవర్తింపుము." అనే సూక్తులు తమోమయ, బాధాకలిత ప్రపంచంలో ఆశాదీపికల వలె ప్రకాశిస్తూ ఉండేవి.

సెయింట్ ఆగస్టైన్, సెయింట్ థామస్ అక్వినస్, తదితర మహనీయుల రచనలు నాటినుంచి నేటివరకు కోట్లాది ప్రజలను ఉత్తేజపరచాయి. వారిని ప్రవక్తలుగా చర్చిగుర్తించింది. యుద్ధం అనేది లేకుండా, భగవంతుని బిడ్డలందరూ సఖ్యంతో, శాంతిగా జీవించే స్వర్గధామంగా ఈ భూమిని సంస్కరించాలని ఈ ప్రవక్తలు ప్రబోధించారు.



అప్పటినుంచి ఇప్పటికి మరొక వెయ్యి సంవత్సరాలు చెల్లి పోయాయి. ఆ మహనీయుల ప్రబోధాలను ఒక తరం నుంచి మరొక తరానికి భద్రంగా సంక్రమింపజేస్తూ వచ్చింది జెరూసలెం పుణ్యక్షేత్రం. 1964 లో పోప్‌పాల్ ఈ క్షేత్రాన్ని సందర్శించినప్పుడు ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి ఊథాంట్‌కు కేబుల్ ద్వారా ఈ క్రింది సందేశాన్ని పంపారు;

"న్యాయ్యం, సత్యం, స్వాతంత్ర్యం, సౌభ్రాత్రం-వీటితో కూడిన శాంతిని మానవ కోటికి ప్రసాదించడానికి సాధ్యమైన కృషియావత్తూ చేయ వలసిందని ప్రపంచ ప్రజానీకానికి బాధ్యులయిన వారందరికీ మేము మరొక సారి విజ్ఞప్తి చేస్తున్నాము."

## మధ్యయుగం నాటి మేధావులు

మధ్యయుగంలోని ఇతర మేధావులను మహాభక్తులుగా, ప్రవక్తలుగా గుర్తించకపోయినా రాజకీయాలపై వారి అభిప్రాయాలు ఈనాటికీ గౌరవింపబడుతున్నాయి. అటువంటి మేధావులలో ఇటాలియన్ కవి దాంతే ఒకడు, ఆయన 14 వ శతాబ్దారంభంలో ఫ్లారెన్స్ నగరంలో ఉండేవాడు. ప్రపంచం కొన్ని శత్రుజాతుల మధ్య విభక్తమై ఉన్నదని భావించడం తప్పు అని ఆయన వ్రాశాడు. 'రాజ్యం' అనే పుస్తకంలో ఆయన వ్రాసిన రెండు వాక్యాలు చద్దాం.

"అన్ని జాతులకు సమష్టిగా కాక, ఒక జాతికి ప్రత్యేకంగా ఏదో గమ్యం ఉన్నదని భావించడం భ్రమ."

"మానవజాతి యావత్తూ చేయవలసిన కృషి ఒకటి ఉంది. అది-ప్రత్యేకంగా మానవునికి గానీ, కుటుంబానికి గానీ, గ్రామానికి గానీ, నగరానికి గానీ, రాజ్యానికి గానీ, సాధ్యమైనది కాదు."

ఓకాం అనే ఆంగ్ల పండితుడు దాదాపు ఇటువంటి భావాన్నే మరింత స్పష్టంగా, నిశ్చయంగా చెప్పాడు.

'ప్రపంచంలో ఒకరి కొకరు ఎంత దూరంగా, ఉన్నప్పటికీ, మానవులందరూ ఒకే సమాజంగా, బృందంగా, మండలిగా, నగరంగా, కళాశాలగా, జాతిగా, రాజ్యంగా రూపొందవచ్చును.'

కాని, దురదృష్టవశాత్తూ, ఇంతమంది కాంక్షించిన లక్ష్యం సిద్ధించకుండా ఎప్పటికప్పుడు ఏదో ఒక కీడు, అరిష్టం సంభవిస్తూనే ఉంది. మధ్య

యుగమంతా కల్లోలానికి, రక్తపాతానికి నిలయమయింది. దాడులతో, యుద్ధాలతో, తిరుగుబాటులతో యూరప్ దేశాలు చితికి చిత్తయి పోయాయి. మనుషులు ఎంత బుద్ధి హీనులుగా. కుత్సితులుగా ప్రవర్తిస్తారో, యుద్ధాలు చేస్తారో అంతస్పష్టంగా ఎప్పుడూ ప్రపంచానికి తెలియలేదు. అయినా, ఎవ్వరూ ఏమీ చేయలేకపోయారు వ్యక్తిగత ప్రతిష్ఠకోసం, అధికారం కోసం పాలకులు యుద్ధాలు సాగిస్తుంటే చదరంగంలో బంటుల్లాగా సామాన్య ప్రజలు బలియై పోయేవారు.

ఆ వెయ్యి సంవత్సరాల రక్త పాతాన్ని ఇప్పుడు ఒక్కసారి వెనక్కు తిరిగి చూస్తే-కళలలో, విజ్ఞానంలో, సామాన్య ప్రజల సంక్షేమంలో మానవుడు సాధించిన అద్భుత ఫలితాలను యుద్ధాలు సర్వనాశనం చేస్తాయని గ్రహించగలం. శాంతి స్థాపనకు మార్గం ఏదైనా కనుగొని ఉంటే, శత్రుత్వాలను రూపుమాపి, స్నేహాన్ని నెలకొల్పి ఉంటే ప్రజల జీవితం ఎంత సుఖప్రదంగా. సంపన్నంగా ఉండేది! ఆ వెయ్యి సంవత్సరాలలో అధిక భాగం 'చీకటి యుగమ'ని చరిత్రకారులు చెప్పిన మాట అక్షరాలా నిజం.

## తొలి విశ్వ విద్యాలయాలు

స్నేహ శూన్యమైననాటి కల్లోల పరిస్థితులలో కూడా-శత్రురాజులు దయతలచి వదిలి పెట్టడం వల్ల, చెడి బ్రతికిన చక్రవర్తుల చలవవల్ల-కొన్ని వ్యవస్థలు మాత్రం ఎడారిలో ఒయాసిస్సుల (నీటిపట్టులు)వలె క్రమక్రమాభివృద్ధి చెందుతూ వచ్చాయి. అవి 'విశ్వవిద్యాలయాలు'.

విశ్వ విద్యాలయాలన్నీ లాటిన్ నే బోధన భాషగా ఉపయోగిస్తూ ఉండేవి. అయితే కాలక్రామాన ఈ పద్ధతి మారి, స్థానికప్రజలు మాట్లాడే 'జాతీయ' భాషలకు విశ్వవిద్యాలయాలలో తావు ఏర్పడింది. కాని, ఎన్ని శతాబ్దాలు గడిచినా, పండితులకు, విజ్ఞానులకు లాటిన్ భాషపట్ల అభిమానం పెరుగుతూనే వచ్చింది.



ఆ నాటి విశ్వవిద్యాలయాలు అంతర్జాతీయ సంఘాలవలె ఉండేవి. పండితులు ఒక విశ్వవిద్యాలయం నుంచి మరొక విశ్వవిద్యాలయానికి మారుతూ ఉండేవారు. ఇలా ఒక పట్టణం నుంచి మరొక పట్టణానికి ప్రయాణాలు చేస్తూ, మధ్య మధ్య కొన్ని మఠాలలో బసచేస్తూ పోయేవారు. ప్రపంచంలోని రక్తపాతాలకు, శత్రుత్వాలకు, రోగదారిద్ర్యాలకు దూరంగా సన్యాసులు ఈ మఠాలలో ప్రశాంతంగా-నిరాడంబర భద్ర జీవితాన్ని సాగిస్తూ ఉండేవారు. ఆ మఠాలలో రోగులకు సేవ చేసేవారు; బడలిన యాత్రికులకు ఆశ్రయమిచ్చేవారు. రోగగ్రస్తులను దేవుని అతిథులుగా వారు భావించేవారు.

ఆ విధంగా, ఆక్స్‌ఫర్డ్ (ఇంగ్లండ్), వాలెన్షియా (స్పెయిన్), పారిస్ (ఫ్రాన్స్), పడువా (ఇటలీ) మొదలయిన పెక్కు నగరాలలో పండితులు

'విశ్వ' సమాజాల నిర్మాణం సాగిస్తూ వచ్చారు-అవే విశ్వవిద్యాలయాలై నాయి. వీటిలో పండితులు ఒకటే భాష మాట్లాడేవారు, ఒకే గ్రంథాలు పఠించేవారు, తాము 'ఒకే ప్రపంచానికి' చెందిన పౌరులుగా భావించుకునే వారు-మఠాల మాదిరిగానే వీరి 'ప్రపంచానికి' కూడా చర్చి కేంద్రస్థానం.

మేధావులు క్రమంగా-పాతబడిపోయిన 'రోమనుల శాంతి'ని గురించి ఆలోచించడం మానివేసి-కొత్తగా వెలసిన 'క్రైస్తవ ప్రభుత్వ' వ్యవస్థని గురించి ఆలోచించటం ప్రారంభించారు. ఒక చరిత్ర కారుడు ఇట్లా వ్రాశాడు: "వసుధైక సామ్రాజ్యస్థాపన, విశ్వశాంతి, సర్వమానవ సౌభ్రా త్రం-ఇవే మధ్యయుగంనాటి మేధావులందరికి భావనా వస్తువులయినాయి"

## పర్వ దినాలలో యుద్ధ విరమణ

"భగవంతుని పేరిట యుద్ధ విరమణ"ను ప్రకటించడానికి గానూ చర్చి అప్పుడప్పుడు ఒక మంతలిని సమావేశ పరస్తూ ఉండేది. చర్చికి ఎంత పలుకుబడి, ప్రభావం ఉన్నదో అటువంటి సమావేశాలలో తెలిసేది. కొన్ని పవిత్ర దినాలలో యుద్ధాలన్నీ నిలిపివేయాలని చర్చి శాసించేది. దీనిని ఉల్లంఘించిన రాజులు గానీ, సేనానులు గానీ, సాధారణ సైనికులుగానీ, చర్చి ఆశీస్సులకు అర్హులు కారని హెచ్చరించేవారు.

పర్వదినాలలో యుద్ధ విరమణ చేసే ఈ సంప్రదాయాన్ని తర్వాత కాలంలోని రాజకీయ వేత్తలు. న్యాయవాదులు కూడా పాటించారు. 20 వ శతాబ్దంలో ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాలలో కూడా క్రిస్మస్ పండుగనాడు, ఉభయ పక్షాలు పోరు సలిపేవి. అంటే మధ్యయుగ సంప్ర దాయం నేటికీ అంతరించ లేదన్న మాట.

## వాణిజ్య సంఘాలు

వర్తకులు కూడా పరస్పరం మరింతగా సహకరించుకుంటూ ఉండే వారు. దానికి ఫలితంగా ఒక సమష్టి యూరప్ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందుతూ వచ్చింది.

రోమనుల రహదారులనే ఉపయోగించుకుంటూ, వర్తకులు యూరప్ అంతటా సంతలు, విపణులు నెలకొల్పారు. తమ పోటీదారులతో పేచీలు లేకుండా చూసుకోవటం అవసరమనీ, దానివల్ల చాలా లాభాలుంటాయనీ వర్తకులు గుర్తించి, తమలో తమకు సఖ్యం కోసం వాణిజ్య సంఘాలను నెలకొల్పుకోవడం మొదలు పెట్టారు. ఉత్తరాన బాల్టిక్ సముద్రం చుట్టూ ఉన్న పురాతన నగరాలకు, దక్షిణాన ఆడ్రియాటిక్ సముద్రం చుట్టూ ఉన్న నగరాలకు మధ్య ఈ వాణిజ్య-సంఘాలు సన్నిహిత సంబంధాలను కల్పించాయి.

వర్తకులు గుర్రాలమీద సరకులు వేసుకుని బృందాలుగా యూరప్‌లో ఒక చోటినుంచి మరొక చోటికి తరలిపోతూ ఉండేవారు. కొందరు వర్తకులు తూర్పు దేశాలకు కూడా వెళ్ళి వర్తకం చేస్తూ ఉండేవారు. అక్కడి నుంచి తిరిగి వచ్చేటప్పుడు అరేబియా నుంచి, భారతదేశం నుంచి, ఇంకా దూరదేశాల నుంచి నాజూకైన పట్టువస్త్రాలు, మసాలా దినుసులు తీసుకు వస్తూ ఉండేవారు. వారు తూర్పు, పశ్చిమ దేశాల మధ్య రాకపోకలు సాగిస్తూ, అక్కడి వస్తువులు ఇక్కడికి, ఇక్కడి వస్తువులు అక్కడికి చేరవేస్తూ, మానవజాతికి సౌభాగ్యాన్ని పెంపొందిస్తూ వచ్చారు. అప్పటికి ఇంకా యూరప్ తనకు తాను ప్రత్యేక ప్రపంచంగానే ఉంటినప్పటికీ యూరప్ ఆసియాల మధ్య రాకపోకలు ఎప్పటికప్పుడు వృద్ధి అవుతూనే ఉన్నాయి.

అందుచేత, ఫ్లారెన్సులోగానీ, లండన్‌లో గానీ, బ్రసెల్స్‌లోగానీ ధనికు లందరి ఇళ్ళలోనూ ఒకే రకమైన అద్దకం బట్టలు, తివాసీలు, పండ్లు, సారాయాలు కనిపించేవి. కాని సామాన్య ప్రజలకు మాత్రం అంతర్జాతీయ వాణిజ్యంవల్ల కలిగే లాభాలు అందుబాటులోకి రాలేదు. అవి అందుబాటులోకి రావడానికి పెక్కు శతాబ్దాలు పట్టింది.

నిజం చెప్పాలంటే ఇటీవల కాలంలోనే-అంటే 20వ శతాబ్దం లోనే-సామాన్య ప్రజలు నాగరికతవల్ల ఒనగూడే లాభాలలో పాలు పంచుకో గలుగుతున్నారు. అయినా ఇప్పటికీ, ప్రపంచం రెండుగా విభక్తమై ఉంది. ఒకటి 'కల' వారి ప్రపంచం; రెండవది 'లేని' వారి ప్రపంచం. ఆఫ్రికా, ఆసియా, దక్షిణ అమెరికాలను 'లేని' వారి ప్రపంచంగా చెప్ప వచ్చు. మొత్తం ప్రపంచ జనాభాలో 'లేని' వారే ఎక్కువ. ఈ అసమా నత్వం, దారిద్ర్యం చిరకాలంగా ప్రపంచాన్ని వేధిస్తున్న సమస్యలు వీటిని గురించి ముందు పేజీలలో చర్చించుదాం.

## మత సంఘర్షణలు

మళ్ళీ మత పరిస్థితి విషయానికి వద్దాం. మధ్య యుగంనాటి అతి క్లిష్ట సమస్యకు చర్చి పరిష్కారం కనుగొనలేకపోయింది. ప్రతి కాలానికి



ఏదో ఒక ప్రత్యేక సమస్య ఉంటూంది—గతంలోనూ అంతే భవిష్యత్తు లోనూ అంతే ఈ సమస్యలకు పరిష్కారాలు అన్వేషించడంలోనే నాగరి కతలు పురోగమిస్తాయి. పరిష్కారం సాధించలేకపోతే నాగరికతలు పూర్తిగానో, అధిక భాగమో-అంతరించిపోతాయి

సరిహద్దులకు అవతల ఉన్న ప్రపంచపు వత్తిడి క్రైస్తవ సామ్రా జ్యంపై ఎక్కువయింది. శత్రువులు తరాలు తరాలుగా మధ్యధరా

ప్రాంతంలోనికి చొచ్చుకు రావడం ప్రారంభించారు. వీరిలో ఎక్కువమంది ఆసియా మైనర్‌లోని ఎడారులలో నివసించే దేశద్రిమ్మరి జాతులవారు. వీరందరిలోకి ఎక్కువ క్రమశిక్షణ, ఐకమత్యం గలవారు అరబ్బులు. క్రీస్తు శకం 632 లో-వారి మహాప్రవక్త, ఇస్లాంమత స్థాపకుడు మహమ్మద్ మృతిచెందిన నాటికి-వారు ఒక పెద్ద సామ్రాజ్యాన్ని స్థాపించుకో గలిగారు. అప్పటినుంచి వారు ముస్లిములని పిలవబడుతున్నారు. ఈనాడు వారి ఇస్లాంమతం ప్రపంచంలోని గొప్ప మతాలలో ఒకటయింది. అయితే దాని సామ్రాజ్యం మాత్రం కూలిపోయింది.




సుమారు మూడు శతాబ్దాలు యూరప్‌లోని క్రైస్తవ నాయకులు తమ పుణ్యక్షేత్రమైన పాలస్తీనా నుంచి ముస్లిములను పారద్రోలడానికి యుద్ధాలు చేశారు. ఈ యుద్ధాలకే 'క్రూసేడ్'లని పేరు. వీటిలో పాల్గొన్న క్రైస్తవ సైనికుల కథ మానవ చరిత్రలోని అతి విషాదకరమైన ఘట్టాలలో ఒకటి. చివరికి ఈ యుద్ధాలలో క్రైస్తవులూ గెలవలేదు, ముస్లిములూ గెలవలేదు.

క్రైస్తవులు, ముస్లిములు నిరర్థకంగా యుద్ధాలుచేసి చేసి, చివరికి ఏదో విధంగా రాజీపడక తప్పదని గ్రహించారు. తాను జీవించడం,



ఎదుటివానిని జీవించనివ్వడం-ఇంతకంటే మార్గం లేదని తెలుసుకున్నారు. కాని ఈ గుణపాఠం నేర్చుకోడానికి కొన్ని వందల సంవత్సరాల కాలం పట్టింది. ఈ లోగా ఎంతో రక్తపాతం, విధ్వంసకాండ జరిగాయి.

అయితే, ఇతర రంగాలలో ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచాలు ఒక దాని పురోభివృద్ధికి మరొకటి ఎంతో దోహదం చేసుకుంటూ వచ్చాయి. ఈ నాడు 'పాశ్చాత్య నాగరకత' అని వ్యవహరింపబడుతున్న నాగరకత ఎక్కువగా ప్రాచ్య దేశాలనుంచి సంక్రమించినదే. ఈ పాశ్చాత్య నాగర కతకు అరబ్బులు ప్రసాదించిన అమూల్యమైన కానుకలను కొన్నింటిని జ్ఞాపకం చేసుకోవడం అవసరం.

గణిత శాస్త్రంలో, ఖగోళ శాస్త్రంలో, వైద్య శాస్త్రంలో అర బ్బులు క్రైస్తవులకంటె ఎంతో ముందుకు పోయారు. అయినా, చాలా మంది యూరప్ నాయకులు వారిని ఆటవికజాతివారుగాను, మత విశ్వాసం లేనివారుగాను జమకట్టి నిరసిస్తూ ఉండేవారు. నిజమేమిటో ఇప్పుడు మనకు బాగా తెలుసు. ఈ నాడు పెక్కుమంది క్రైస్తవ పండితులు ముస్లిం విశ్వ విద్యాలయాలకు వెళ్ళడానికి ఎంతో ఉత్సాహపడుతున్నారు.

క్రైస్తవ సంస్కృతితో అరబ్ విజ్ఞానం మిళితం కాకుండా ఉంటే ఆ తర్వాత శతాబ్దాలలో పాశ్చాత్య నాగరకత అంతగా విస్తృతి పొంది



ఉండేవి కావు. ఇప్పుడు మనం అంక గణితంలో ఉపయోగిస్తున్నవి అర బిక్ అంకెలే ('విజ్ఞానమేళనం' అనే విషయం చాలా ముఖ్యమైనది. అందుచేత ఏడవ అధ్యాయం పూర్తిగా దానికి కేటాయించువాం.)

గ్రీకు, రోమన్ సంస్కృతులలోని అత్యుత్తమ అంశాలన్నింటినీ గ్రహించవలసిందని ముస్లిం నాయకులు ఆజ్ఞాపించారు. గ్రీకు తత్త్వ శాస్త్రం, గ్రీకు విజ్ఞానశాస్త్రం మాత్రమే కాక, వారి కవిత్వాన్ని, నాటకాలను కూడా జాగ్రత్తగా అరబిక్ భాషలోనికి అనువదించాలని శాసించారు

ఆ విధంగా, క్రైస్తవ, ముస్లిం సంస్కృతులలోని ఉత్తమాంశాలు సమ్మిశ్రితం కావడం ప్రారంభించాయి. చివరికి ఈ మేళనం మానవ జాతి సౌభాగ్యానికే దోహదం చేసింది. ఈ రెండు జీవన విధానాల మధ్య

జరిగిన ఘోర సంగ్రామాలను మనం ఈ నాడు మరచిపోయాము. కాని ఆ రెండింటిలోని మంచికి మనం వారసులమైనాము.

## మధ్యయుగం మనకు నేర్పిన పాఠం

ఈ వెయ్యి సంవత్సరాలలోని పురోగమనాన్ని, తిరోగమనాన్ని, ఐక్యమత్యాన్ని, కల్లోలాన్ని, సహకారాన్ని, సంఘర్షణను ఒక్కటిగా గుది గుచ్చి, దాని సారాంశం ఇది అని చెప్పటం కష్టం.

భూమిమీద తాను చేసే పనులన్నింటికీ మనిషి భగవంతునివద్ద సంజాయిషీ చెప్పుకోవాలని, క్రైస్తవ మతం చెబుతూ వచ్చింది. దీని వల్ల మనిషి తనను తాను 'ఒక వ్యక్తి'గా భావించుకొనడం ప్రారంభించాడు. తాను స్వతంత్ర జీవి అనే భావం ఏర్పడింది. దానితో వ్యక్తి 'స్వాతంత్ర్యం' పెరుగుతూ వచ్చింది.

వాణిజ్యం అభివృద్ధి కావడంవల్ల, వ్యవసాయంలో ఆధునిక పద్ధతులు అమలులోకి రావడంవల్ల ఎక్కువ భూమి సాగు క్రిందకు వచ్చి, 'ఆహారం' ఉత్పత్తి పెరిగింది.

రాజ్యాల గొడవలు, మతసంఘర్షణలు యుద్ధాలు ఎడతెరిపి లేకుండా జరుగుతున్నప్పటికీ, విస్తృతమైన 'సమాజం', విశ్వమానవ సౌభ్రాత్రం అనే భావాలు అంతరించలేదు.

తమ పరిసరాలను, తమ దేశానికి అవతల ఏమున్నదో తెలుసుకోవాలనే జిజ్ఞాస మరింత ఎక్కువయింది వ్యక్తులలో-ముఖ్యంగా వర్తకులలో, పండితులలో-కలిగింది. వాటి తెలుసుకున్నది. మధ్య యుగం చరిత్ర నుంచి మనం తెలుసుకోదగినది ఇది.

అసంఖ్యాకమై, వైవిధ్య స్వభావమే ప్రపంచం.

# 4

# "జాతీయ" జీవన విధానం

యూరప్ కథ ప్రారంభమైన తర్వాత రెండవసారి జీవన వ్యవస్థ ఛిన్నాభిన్న మయింది.

"రోమనుల శాంతి" వెయ్యేళ్ళపాటు-క్రీస్తు పూర్వం 500 నుంచి క్రీస్తు శకం 500 వరకు-యూరప్‌నంతటినీ ఒక్కటిగా కలిపి ఉంచింది. ఆ తర్వాత మరొక వెయ్యి సంవత్సరాలు మధ్యయుగంనాటి 'క్రైస్తవ సమాజం' యూరప్‌లో వివిధ దేశాల మధ్య సహకారానికి ప్రాతిపదిక అయింది.

మొదటి మూడు అధ్యాయాలలో కథ క్రీస్తు శకం 1500 వరకు నడిచింది. ఈ సంవత్సరాల లెక్క సుమారుగా చెప్పినదే కానీ, ఖచ్చిత మైనది కాదు. మానవాభ్యుదయంలోని 'తీరు తెన్నుల'ను స్థూలంగా గమ నించడం మాత్రమే మనం చేస్తున్న పని. చాలా ఎక్కువ కాలాన్ని దృష్టి లోకి తీసుకుంటేనే తీరుతెన్నులు గోచరిస్తాయి.

ఈ అధ్యాయంలో కూడా కథా స్థలం యూరపే. ఆసియా, ఆఫ్రికాలను గురించి అప్పటికింకా బాగా తెలియదు. అమెరికా ఒక కలగానే ఉంది. వచ్చే అధ్యాయంలో మనం 'అన్వేషణ యుగం' లో ప్రవేశిస్తాము.

సుమారు 1500 వ సంవత్సరం నాటికి యూరప్ 'పునర్జన్మ' ఎత్తింది. అది ఒక్కసారిగా జరిగింది కాదు; యూరప్ అంతటా ఒకే విధంగా జరిగింది కూడా కాదు. ఈ పునరుజ్జీవనాన్నే చరిత్రలో 'రెనెసాన్స్' (ఫ్రెంచి పదం) అని పేర్కొన్నారు. రెనెసాన్స్ కాలంలో యూరప్ అంతటా అన్ని రంగాలలోనూ విశేషమైన చైతన్యం, కృషి, సాధన కాన వచ్చాయి. ముఖ్యంగా చిత్రకళలో, శిల్పకళలో, కవిత్వంలో, నాటక రచనలో అద్భుతమైన కృతులు వెలువడినాయి.

యూరప్ ప్రజల రాజకీయ వ్యవస్థపై ఈ పునరుజ్జీవన ప్రభావం ఏ విధంగా ఉన్నదో ఈ అధ్యాయంలో మనం ప్రధానంగా పరిశీలిద్దాం. 'జాతీయత' అనే మరొక క్లిష్టమైన విషయం కూడా ఇందులో చర్చకు వస్తుంది. అయితే, ప్రపంచ చరిత్రలో జాతీయతకు అర్థమేమిటో తెలుసుకుంటేనే గానీ, ఆ తర్వాత అంతర్జాతీయతకు అర్థం తెలుసుకోలేము.

## అతుకుల బొంతగా మారిన యూరప్

అప్పటికి యూరప్‌లో చిన్న చిన్న రాజ్యాలు బోలెడు పుట్టుకొచ్చాయి. వాటిని రాజులు, రాకుమారులూ పరిపాలిస్తూ వుండేవారు. ఇవికాక దాదాపు పూర్వపు గ్రీకు సమాజాల వలెనే పెక్కు నగరరాజ్యాలు వెలిశాయి ఇటలీలో వెనిస్, జర్మనీలో కొలోన్ ఇలా నగర రాజ్యాలుగా మారాయి. అవి యూరప్‌లో చాలా అనుకూలమైన స్థానంలో ఉండటం వల్ల, వ్యాపారరీత్యా సంపన్నమైనవి కావడంవల్ల బాగా బలాన్ని పుంజుకున్నాయి. ఇరుగుపొరుగు పెద్ద రాజ్యాలు ఏవైనా దాడిచేస్తే ఎదుర్కొనేందుకు అవి బోలెడు డబ్బుపోసి కిరాయి సైన్యాలను రప్పించేవి.

ఈ చిన్నచిన్న రాజ్యాలతో యూరప్ అతుకుల బొంతలాగా తయారయింది. ఈ అతుకులలో అన్ని రకాల రూపాలు, పరిమాణాలు ఉన్నాయి. అటువంటి పరిస్థితులలో జాతీయతా యుగం ప్రారంభమయింది, అది ఇప్పటికీ అంతరించలేదు.

వాటి సరిహద్దులకు ఒకతీరు తెన్ను ఉండేవి కాదు. అందుచేత కొద్ది సంవత్సరాలకే ఆ రాజ్యాల స్వరూపాలు మారిపోయాయంటే అందులో ఆశ్చర్య పడవలసిన దేమీ లేదు.

సరిహద్దులు మారడం అనేది ఇప్పటికీ జరుగుతూనే ఉంది; ఉదాహరణకు పోలెండ్, జెకోస్లవాకియావంటి దేశాలు 20వ శతాబ్దంలో పెక్కుసార్లు సరిహద్దులు మార్చుకున్నాయి. ఇవి చిన్నచిన్న మార్పులు కూడా కాదు; చాలా పెద్ద మార్పులు. జాతీయ సరిహద్దులు 'ఎక్కడ' గీయాలి అనేది వర్తమాన ప్రపంచంలో పెద్ద సమస్య అయిపోయింది.

పూర్వం ఇద్దరు రాజులు వియ్యమందితే వారి రాజ్యాలు రెండూ కలిసిపోయేవి. ఇప్పుడు అటువంటివి జరిగే అవకాశం లేదు. ఎందుకంటే రాజులు రాణులు ఇప్పుడు అట్టేమంది లేరు. ఎక్కువ దేశాలు ఇప్పుడు ప్రజాప్రభుత్వాలుగానే ఉన్నాయి. ఒక పొరుగుదేశంపై ఇంకొక పొరుగు దేశం బలప్రయోగం చేసి దానిని తనలో కలుపుకోవడం కూడా జరుగుతూ ఉండేది. పాశ్చాత్యుల 'స్క్వేర్ డాన్స్'లో మాటి మాటికీ జంటలు మారుతూ, స్త్రీ తడవకొక పురుషునితో చేతులు కలిపి నృత్యం చేస్తున్నట్లుగా ఈ బలహీన రాజ్యాలు తడవకొక రాజు చేతుల్లోకి పోతూఉండేవి వాటి సరిహద్దులు అంత అనిశ్చితంగా ఉండేవి.

అయితే కొన్ని దేశాలు మాత్రం శతాబ్దాల తరబడి చెక్కు చెదరకుండా ఉన్నాయి. వీటిలో ఫ్రాన్స్, స్పెయిన్ దేశాలను ముఖ్యంగా చెప్పుకోవచ్చును. ఫ్రాన్స్ ఒక ముఖ్యమైన రాజధాని నగరం చుట్టూ నిర్మితమైన రాజ్యం. స్పెయిన్‌కు మూడ్వైపుల సముద్రం, ఒకవైపు కొండలు అడ్డంగా



ఉన్నాయి ఫ్రాన్స్, స్పెయిన్‌లాగా స్వతంత్రంగా ఉండగలిగిన "జాతీయ దేశాలు"గా పేరు పొందాయి. వాటి ప్రజలు ఒకజాతిగా ఐక్యమై ఉండేవారు. వారిని పరిపాలించడం ఎలాగో తెలిసిన వారిని రాజకీయ వేత్తలని అంటూ ఉండేవారు.

ప్రపంచ చరిత్రలో 'జాతీయత'కు మొట్టమొదటి ఉదాహరణంగా చెప్పదగిన దేశం 'ఇంగ్లండ్.' ఎందుకంటే బ్రిటిష్ దీవులు మిగతా యూరప్ నుంచి తెగిపోయినట్లుగా, దానిచుట్టూ సముద్రం ఉండేది. ఇంగ్లీషు వారు తమ దీవినంతటినీ ఒక్క పరిపాలన క్రిందకు తీసుకు రాగలిగారు. అందుచేత ఇంగ్లండ్ మొట్ట మొదటి బలిష్ఠమైన జాతీయ దేశమయింది. లండన్ దాని రాజధానిగా ఉండేది. మొదటి ఎలిజబెత్ రాణివంటి సమర్థు

అయిన పరిపాలకులు దానికి లభించారు. అందుకే ఇంగ్లీషు సామ్రాజ్యనౌక బహుశతాబ్దాల ప్రళయ ప్రభంజనాలను తట్టుకో గలిగింది.

## "జాతీయత" అంటే ఏమిటి?

జాతీయతకు సరియైన నిర్వచనం చెప్పడం సులభం కాదు, ఒకే చరిత్రకు, ఒకే సంప్రదాయానికి తరతరాలుగా వారసులైన ప్రజల సముదాయంలో కలిగే ఒక 'భావన' జాతీయత అని చెప్పవచ్చు కొన్ని సందర్భాలలో ఆ ప్రజలు-చరిత్రకు అందినంత పాతకాలంనుంచి-ఒకే సమాజంలో కలిసి పనిచేసినవారు కావచ్చు. కాబట్టి ఈ పుస్తకానికి అవసరమైనంత వరకు-'జాతీయత' అంటే ఒక విధమైన 'ఏకత్వ భావన' అని నిర్వచించవచ్చు.

ఒకానొక ప్రాంతపు ప్రజలు ఒకే భాష మాట్లాడుతూ. ఒకే వాణిజ్య విధానాన్ని అనుసరిస్తూ ఉన్నప్పుడు వారిమధ్య ఈ 'ఏకతా భావన' పెంపొందుతుంది. తామందరూ ఒకే పెద్దకుటుంబానికి చెందిన వారుగా భావించుకుంటారు. ఈ నిర్వచనానికి అనేక మినహాయింపులు ఉండనే ఉంటాయి అయితే ప్రస్తుతానికి 'జాతీయత'కు అంత మాత్రపు అర్థం' చెప్పుకుంటే చాలు.

ఈ విభిన్న జాతీయతలన్నీ సజీవంగా ఉండాలంటే, వీటినన్నింటినీ కలిపి ఒక్క ప్రపంచంలో ఇమడ్చడం ఎలాగనే సమస్యను మనం ముందు పేజీలలో చర్చించుదాం నాటి జాతీయ ప్రభుత్వాల మధ్య 'విదేశవ్యవహారాలు' ఎలా పెంపొందుతూ వచ్చాయో కొంత తెలుసుకుంటే గానీ, నేటి రాజకీయ వేత్తలు విదేశ వ్యవహారాలతో పడుతున్న కుస్తీపట్లు మనకు అర్థంకావు.

భూమి మీద మానవుని జీవితానికి రూపం దిద్దిన అతిముఖ్యమైన శక్తులలో 'జాతీయత' ఒకటి అనడంలో ఎంత మాత్రం సందేహం లేదు,

'జాతియత'తో సన్నిహిత సంబంధం కలిగిన మరొక మాట 'సార్వభౌమాధికారం' దీనిని గురించి కూడా మనం తరచుగా వింటూ ఉంటాము.

## సార్వభౌమాధికారానికి అర్థం

సార్వభౌమాధికారం అనగానే రాజులు, చక్రవర్తుల హయాం జ్ఞాపకం వస్తుంది. దేశానికి రాజే సర్వాధికారిగా ఉండేవాడు. (కొన్ని దేశాలలో ఇప్పటికీ అటువంటి రాజులు ఉన్నారు.) అతడే పరిపాలకుడు అంటే అతని అభీష్టాన్ని, అతడి శాసనాన్ని ప్రతివ్యక్తీ పాటించాలన్న మాట.

'జాతీయత' ఒక జాతిలోని ఏకతాభావన అని ఏవిధంగా చెప్పుకున్నామో. అలాగే 'సార్వభౌమాధికారం' జాతియొక్క శక్తి అని చెప్పుకోవచ్చు. అయితే, కాలక్రమాన ఆ పదానికి అర్థం మారుతూ వచ్చింది. సార్వభౌమాధికారం అంటే ఇప్పటి అర్థం-ఒక దేశపు ప్రభుత్వం యొక్క అధికారం అని మాత్రమే పాలకుడు 'ఒక్కడు' కావచ్చు. 'కొందరు' కావచ్చు. ఏమైనా-ఒక దేశపు ఆంతరంగిక వ్యవహారాలను నిర్వహించడానికి ఆ నిర్వహణలో ఇతర దేశాలు జోక్యం చేసుకోకుండా నిరోధించడానికి గల సర్వ సంపూర్ణ అధికారమే సార్వభౌమాధికారం.

అటువంటి అధికారంగల భూభాగాన్ని సార్వభౌమాధికారం (లేక సర్వసత్తాక ప్రతిపత్తి) గల దేశమని అంటూ ఉంటారు. దానినే 'స్వతంత్ర' దేశమని కూడా అంటారు. (కొత్తదేశాల స్వాతంత్ర్యం గురించి ఈ పుస్తకం మూడవ భాగంలో వివరంగా చర్చించుకుందాం)

ఒకదేశంలో పుట్టి, ఆ దేశంలోనే నివాసం ఏర్పరచుకునే వారిని ఆ దేశపు జాతీయులనీ, ప్రజలనీ అంటారు. కానీ, ఇప్పుడు 'పౌరులు' అనే మాటను తరచుగా వాడుతున్నారు. సార్వభౌమాధికారం గల వ్యక్తికి, లేదా అట్టి అధికారంగల ప్రభుత్వ వ్యవస్థకు విధేయులై ఉండడం పౌరుల ప్రథమ కర్తవ్యం. విదేశాలలో పుట్టిన వ్యక్తులు కూడా తమ దేశపు జాతీయులు

మారడానికి చాలా దేశాలు అంగీకరిస్తున్నాయి అయితే ప్రభుత్వం విధించే కొన్ని షరతులను వారు పాటించవలసి ఉంటుంది. ఇటువంటి వారులు 'జాతీయ' ముద్రపొందిన వారు అవుతారు.

## దౌత్య ఉద్యోగులు

సుమారు క్రీ. శ 1500 వ. సంవత్సరం నుంచి ఈ నాటి వరకు యూరప్‌లోని దేశాలు స్వతంత్ర్య దేశాలుగా సార్వభౌమాధికారంగల దేశాలుగా స్థిరపడినాయి. ఈ దేశాల ప్రజలందరూ తమ సార్వభౌమునికి, లేదా తమ ప్రభుత్వానికి పూర్తిగా విధేయులై ఉండేవారు. ఇతర దేశాలకి వారు తలవంచేవారు కారు,

కొందరు రాజులు తాము 'దైవదత్తాధికారం'తో పరిపాలిస్తున్నా మని విశ్వసించేవారు. రాచరికం తమ జన్మ హక్కుగా భావించేవా



యూరప్‌లో ఇటువంటి 'దైవదత్తాధికారుల'ను చివరికి ప్రజలందరూ కలిసి బలవంతంగా గద్దెమీద నుంచి దించి వారి స్థానంలో ప్రజా ప్రతినిధులను ఎన్నుకొన్నారు. నేటి ప్రజాస్వామ్యానికి అదేనాంది అయితే పాత సంప్రదాయాలు ఒక పట్టాన చావవు. జపాన్‌లో ఈ నాటికీ కోట్లాది ప్రజలు తమ రాజు నేరుగా భగవంతుని వద్దనుంచి అధికారాలు మూట గట్టుకుని వచ్చినట్లు భావిస్తారు. రాజులకు దైవదత్తాధికారం ఉన్నదనే భావం ప్రజలలో పూర్తిగా అంతరించడానికి ఇంకా చాలా కాలం పడు తుంది

ఇక విదేశ వ్యవహారాలు-అంటే వివిధ దేశాల మధ్య సంబంధాలు ఎలా సాగేవో పరిశీలిద్దాం—

వర్తకులు, సైనికులు, అన్వేషకులు, కిరాయిలు ప్రపంచంలో నలు మూలలా నిత్యసంచారం చేస్తూ ఉండేవారు. ఆ విధంగా, దేశాలమధ్య రాక పోకలు పెరుగుతూ వచ్చాయి. ఇటువంటి వ్యవహారాలను చూసుకునేందుకు రాజులు ప్రత్యేకంగా కొందరిని నియమించేవారు. వారినే దౌత్య ఉద్యోగు లనేవారు.

గ్రీకుల కాలానికి పూర్వమే దౌత్య ఉద్యోగులు ఉండేవారు. పరిపాల కులు వారిని తమ దూతలుగా విదేశాలకు పంపించేవారు. ఈ దౌత్య ఉద్యో గులకు విదేశాలలోని రాజాస్థానాల మర్యాదలు, సంప్రదాయాలు బాగా తెలిసి ఉండేవి ప్రభుత్వాలకు సంబంధించిన అతిరహస్యమైన విషయాలను సైతం చెప్పదగినంతటి విశ్వాసపాత్రులుగా ఉండేవారు. రహస్యాలను వారు అతిభద్రంగా కాపాడేవారు.

దౌత్య వ్యవహారాలలో వీరికి ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చేవారు. యుద్ధం రాకుండా నివారించాలన్నా, శాంతియుత పరిష్కారాన్ని సాధించాలన్నా, అది సాధారణంగా 'సంప్రతించే' సామర్థ్యం పైనే ఆధారపడి ఉంటుంది. దౌత్య ఉద్యోగిని గురించి ముఖ్యంగా తెలుసుకోదగిన అంశం ఏమిటంటే,

అతడు రాజప్రతినిధి, లేదా ప్రభుత్వ ప్రతినిధేగానీ ప్రజాప్రతినిధి కాదు. ఒక రాజు ఆస్థానంలో మరొకరాజుకు 'వ్యక్తిగతంగా ప్రాతినిధ్యం' వహించేవాడు అతడు.

యూరప్‌లో పునరుజ్జీవనం జరిగి నప్పటినుంచి నేటివరకు విదేశ వ్యవహారాలను దౌత్య ఉద్యోగులే నిర్వహిస్తున్నారు. అయితే ఇటీవలి కాలంలో అంతర్జాతీయ సంబంధాలలో చాలా పెద్ద మార్పులు వచ్చాయి. వీటిని గురించి ముందు పేజీలలో చదువుదాం. కేవలం దౌత్య ఉద్యోగుల ద్వారా వ్యవహారాలు నడపడం ఈ మధ్య కొంత పాతబడిన పద్ధతిగా కని



పిస్తున్నది. వ్యక్తుల ద్వారాకాక, అంతర్జాతీయ సమావేశాలద్వారా, చర్చల ద్వారా ఇప్పుడు వ్యవహారాలు ఎక్కువగా నడుస్తున్నాయి దీనిని 'సమావేశ దౌత్య పద్ధతి' అంటున్నారు.

## వలసల కోసం వేట

ప్రతి సార్వభౌమదేశం తన అభిప్రాయమే ఒక శాసనంగా వ్యవహరిస్తూ, తన అధికారావరణాన్ని విస్తరించుకోడానికి సాధ్యమైనంత ఎక్కువ భూభాగాన్ని ఆక్రమించుకోవాలనే ఆశ ప్రతిదేశానికి పుట్టింది. పొరుగు దేశాన్ని ఆక్రమించడానికి అవకాశం లేకపోయేసరికి, దూరంగా ఎక్కడైనా భూభాగాలు, ఆక్రమించడానికి దొరకుతాయేమో ప్రయత్నించి చూద్దామని అన్వేషకులు, సాహసికులు బయలుదేరారు. దీనితో 'వలసల' వేలం వెర్రి ప్రారంభమయింది. కొత్త దీవులను, కొత్త దేశాలను కనిపెట్టడానికి సముద్రాల మీదికి ఎగబడ్డారు.

కొత్త ఖండాలు వెలుగులోకి రావడం గురించి వచ్చే అధ్యాయంలో తెలుసుకుందాం. ప్రస్తుతం పక్కపుటలో ఉన్న ఆఫ్రికా పటాన్ని చూద్దాం. 19 వ శతాబ్దాంతం నాటికి స్థూలంగా ఆఫ్రికా అలా ఉండేది అప్పటికి యూరప్‌లోని పెద్ద రాజ్యాలు అఫ్రికా ఖండాన్ని ఖండఖండాలుగా చేసి పంచుకోవడం దాదాపు పూర్తి అయింది. జాతీయ సార్వభౌమాధికారం మరొక ఖండానికి ఏ విధంగా వర్తిస్తుందో ఈ పటం కొంతవరకు తెలియజేస్తుంది.

ఈ పటానికి, 63 వ పేజీలోని యూరప్ పటానికి ముఖ్యమైనతేడా ఒకటుంది. యూరప్ సార్వభౌమాధికారంగల చిన్నచిన్న దేశాలుగా విభక్తమయిపోయింది. అవి 'తమను తామే' పరిపాలించుకుంటున్నాయి. కాని, 19 వ శతాబ్దంలో మొత్తం ఆఫ్రికా అంతా వివిధ వలస ప్రాంతాలుగా విభక్తమై, యూరప్ దేశాలచేత బలవంతంగా ఆక్రమించుకోబడింది. ఈ



విధంగా "[illegible] [illegible] త్త్వం" అనే ఈ నవ బృహత్ సమస్య ప్రారంభమయింది

వలసలనేవి అప్పటికి పూర్తిగా కొత్త ఏమి కావు. పూర్వపు గ్రీకులకు కూడా వలసలు ఉండేవి; రోమనులకూ ఉండేవి. 19 వ శతాబ్దంలో యూరప్ దేశాలవారు ప్రపంచం నలుమూలలా తమ వలసలను విస్తరింప చేసుకోవడం ప్రారంభించారు. ఈ శ్వేతజాతివారు-నల్ల జాతులవారిని, గోధుమవర్ణం వారిని, పసుపు పచ్చ వర్ణం వారిని లోబరచుకున్నారు. ఈ వలసలు యూరప్‌వారికి ఎంతో విలువైన 'పెరటి తోట'గా మారాయి.

అందుచేత, ఆసియా, ఆఫ్రికా ప్రజల 'ప్రాథమిక మానవస్వత్వా (హక్కు)ల'ను 'ప్రభుత్వ స్వత్వాల'తో సమన్వయపరచడం అనేది ప్రస్తుత శతాబ్దిపు అంతర్జాతీయ వ్యవహారాలలో అతిక్లిష్ట సమస్య అయింది. (ఆసియా. ఆఫ్రికాలలో ఇప్పటికీ కొన్ని వలసలు ఉన్నాయి) ఎందుకంటే ఆ వలసలు తమ ఆస్తులని వాటిని పాలిస్తున్న దేశాలు అంటున్నాయి.

మానవజాతి అదృష్టవశాత్తూ ఐక్య రాజ్యసమితి అవతరించింది. ఆశ్చర్యకరంగా, ఏ మాత్రం సంఘర్షణ లేకుండా, రక్తపాతం లేకుండా, ఈ వలసలపై ఆధిపత్యం చేతులు మారింది. వలసలు విముక్త మైనాయి. ఈ పుస్తకం మూడవ భాగంలో వలసల విముక్తి గురించి విశదంగా చదువుదాం.

## ఒక్క జాతిలో పెక్కు తెగలు, భాషలు

యూరప్‌లో. 'జాతీయత' ఎలా పెంపొందిందో ఇప్పుడు ఒక్కసారి వెనుకకు తిరిగి చూస్తే దేశం, జాతి-ఈ రెండింటి అర్థం అన్ని సందర్భాల లోనూ ఒక్కటిగా ఉండదని తెలుస్తుంది. ఉదాహరణకు అమెరికా, స్విట్జర్లండ్‌ను తీసుకుందాం. వాటిలో పెక్కు దేశాలు (రాష్ట్రాలు) ఒక్క 'సమాఖ్య'గా రూపొందాయి. ఆ 'సమాఖ్య' ఒక సంయుక్త జాతి అయింది. ఫ్రాన్స్. స్పెయిన్, ఇటలీవంటి దేశాలలో ఇలా లేదు. అవి ఒకే జాతి ప్రజలుగల దేశాలు.

అంటే, ఒక దేశంలో లేదా ఒక జాతిలో ప్రజలందరూ ఒకే తెగకు, భాషకు, మతానికి చెందిన వారై ఉండాలా? అటువంటి నిబంధన ఏమీలేదు. ఉదాహరణకు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వస్తుతః ప్రజలు వేర్వేరు భాషలకు చెందిన వారైనప్పటికీ వ్యవహార సౌలభ్యం కోసం అందరూ ఒక్కటే భాష (ఇంగ్లీషు)ను ఉపయోగిస్తారు, ప్రజలు వేర్వేరు తెగలకు చెందినవారై నప్పుడు,వారు మరింత శీఘ్రంగా ఒక్క జాతి కావడానికి ఉమ్మడి భాష చాలా సహాయకారి అవుతుంది.

కాని, అన్ని సందర్భాలలోనూ ఇలా జరగదు ఉదాహరణకు స్విట్జర్లండ్‌లో 22 రాష్ట్రాలున్నాయి. ఈ రాష్ట్రాలలో ప్రజలందరూ మాట్లాడేది ఒక్క భాష కాదు. కొందరు ఫ్రెంచి, కొందరు ఇటాలియన్, కొందరు జర్మన్ మాట్లాడతారు. స్విట్జర్లండ్‌ను ఆనుకుని ఉన్న మూడు ప్రధానదేశాలు ఫ్రాన్స్. ఇటలీ, జర్మనీ. వాటిప్రభావం స్విట్జర్లండ్‌పై అంతగా ఉంది. దానికి స్వంతభాష ఒకటి లేదు. అయినప్పటికీ ఆ దేశం ఒక జాతిగా పెంపొందింది.

## 'జాతీయత' పై మతప్రభావం

జాతీయతపై మతప్రభావం కూడా చాలా ఉంది-ముఖ్యంగా ఫ్రాన్స్ వంటి కాథలిక్ దేశాలలో. కాని, ఒకదేశ ప్రజలందరినీ బలవంతంగా ఒకే మతం క్రిందకు తీసుకురావాలని చేసిన ప్రయత్నాలు-చాలా సందర్భాలలో-విఫలమైనాయి. నిజానికి 15వ శతాబ్దం నుంచి 17వ శతాబ్దం వరకు యూరప్ చరిత్రలో అతి విషాదకరమైన సంఘటనలు మతయుద్ధాలే

ఈ సంఘర్షణలు ప్రధానంగా కాథలిక్కులకు, ప్రొటెస్టెంటులకు మధ్య జరిగినవి. ఈ వర్గాలలో కూడా మళ్ళీ ఉపవర్గాలు ఉండేవి. వాటి మధ్య కూడా ఘర్షణలు రేగుతూ ఉండేవి.

ఈ మత యుద్ధాలు యూరప్‌లోని పెక్కు వర్ధమాన నగరాలకు ఎన్నో కష్టనష్టాలు తెచ్చిపెట్టాయి. మత విరోధాలను పురస్కరించుకుని మనుష్యులను చిత్రహింస పెట్టేవారు; గుంజకి కట్టేసి నిలువునా తగల పెట్టేవారు; నడివీధుల్లో ఉరితీసేవారు; క్రౌర్యం ఒకరకాలుగా ప్రదర్శిత మయ్యేది. మతం పేరిట సాగిన ఈ తీవ్ర విరోధాలవల్ల యూరప్ నాగరకత పెక్కు సంవత్సరాలపాటు దయనీయ స్థితిలో ఉండిపోయింది.

ఈ మత యుద్ధాలు సాధారణంగా ఏదో ఒక దేశం నాయకత్వంలో జరుగుతూ ఉండేవి. చర్చి 'సంస్కరణ'కు పూనుకొన్న ప్రొటెస్టెంటులలో ముఖ్యులు జర్మనీకి చెందిన మార్టిన్ లూథర్, జెనీవాకు చెందిన

జాన్ కాల్విన్. ఈ 'సంస్కరణ'-ముఖ్యంగా ఇంగ్లండ్ వంటి దేశాలలో-జాతీయ భావాన్ని విశేషంగా పటిష్ఠం చేసింది. అయితే దీనివల్ల సామాన్య ప్రజలలో చాలా రక్తపాతం జరిగింది

క్రైస్తవ, ముస్లిం మతాల మధ్య యుద్ధాలు ఎంత నిరర్థకంగా జరిగాయో క్రిందటి అధ్యాయంలో మనం చదివాము. క్రైస్తవ మతం లోని కాథలిక్కులకు, ప్రొటెస్టెంటులకు మధ్య జరిగిన సంఘర్షణలు కూడా అంత నిరర్థకమైనవే. భూమి మీద ఎవరైనా బ్రతకాలంటే-'తాను జీవించడం, ఎదుటి వానిని జీవించనివ్వడం' – ఒక్కటే మార్గమని వీరు కూడా తెలుసుకున్నారు. ఈ సత్యాన్ని వీరూ చాలా ఆలస్యంగానే గుర్తించారు.

ఈ నాడు, ఒకే జాతిలోని కోట్లాది ప్రజలు వివిధ మతాలను అనుసరిస్తున్నారు. తమ నమ్మకాలు, పూజాపురస్కారాలు పొరుగువారి నమ్మకాలకు, పూజా పురస్కారాలకు పూర్తిగా విరుద్ధమైనవి. అయినప్పటికీ ఘర్షణ లేకుండా, ఒకరి విషయంలో మరొకరు జోక్యం చేసుకోకుండా జీవిస్తున్నారు. శాంతియుతంగా ఒకే దేశంలో కలిసి జీవించడం నేర్చుకున్నారు. ఒకే శాసనం, ఒకే ప్రభుత్వం వారిని ఒక్కటిగా బంధిస్తున్నాయి. మత విభేదాలను 'హింస' ద్వారా కాక 'చర్చల' ద్వారా తేల్చుకుంటున్నారు.

ఆ విధంగా, సహనభావం పెంపొందింది. సహనం అంటే అవతలి వ్యక్తి నమ్మకాలలోని చిత్తశుద్ధిని గౌరవించడం. వాస్తవమైన శాంతికి సహనమే ప్రాతిపదిక అనే సత్యాన్ని మానవుడు నేటికి గ్రహించాడు. హింసా ద్వేషాలకు నిలయమైన గత శతాబ్దాల చరిత్ర నేర్పిన గుణపాఠం ఇది

# దేశభక్తి

ఈ అధ్యాయం అర్థం కావడం కొంచెం కష్టం కావచ్చు. ఎందుకంటే, ప్రజలు తమ దేశాన్ని గురించి ఎలా 'భావించు' కొంటారో ఇందులో పరిశీలిస్తాము. కోట్లాది ప్రజల హృదయాలలో ఎటువంటి భావాలు, ఉద్రేకాలు పొంగుతూ ఉంటాయో తెలుసుకోనిదే మనం ఈనాటి అంతర్జాతీయ సమస్యలను అవగాహన చేసుకోలేము. తమ దేశంపట్ల ప్రజా హృదయంలో గల భావనను ఒక్క మాటలో 'దేశభక్తి' అని చెప్పవచ్చును.

"తప్పో ఒప్పో, నా దేశం కనుక నేను ప్రేమిస్తాను" అనేమాట చాలా మంది వినే ఉంటారు. ఈ కాలంలో వివేకవంతులైన ప్రజలెవరూ ఈ రకం దేశభక్తిని మెచ్చరు. 'నా దేశం తప్పుచేసినా నాకు ఇష్టమే' అనడం తీవ్రమైన జాతీయ దురభిమానం అవుతుంది అందరూ అటువంటి దేశభక్తితోనే వ్యవహరిస్తే మానవజాతి శీఘ్రంగా నాశనమవుతుంది.

అదృష్టవశాత్తూ, అన్ని దేశాలూ మరింత నాగరకం కావడంతో, దేశభక్తికి నిర్వచనం మారింది. "నా దేశం ఎప్పుడూ న్యాయంగానే వర్తించాలి" అని భావించడం సరియైన దేశభక్తిగా ఇప్పుడు గుర్తిస్తున్నారు. తమ ప్రజల సంక్షేమం కోసం కాలాన్ని, ధనాన్ని, ప్రజ్ఞను వెచ్చించడానికి, అవసరమైతే ప్రాణాలను త్యాగం చేయడానికి స్త్రీలు, పురుషులు సంసిద్ధులు కాగలిగినప్పుడు అటువంటి దేశభక్తి 'జాతీయత'కు పరాకాష్ఠ అవుతుంది.

'ఆధునిక' జాతీయ భావం ప్రకారం మొట్టమొదటి దేశభక్తురాలు ఫ్రాన్స్‌కు చెందిన జోన్ ఆఫ్ ఆర్క్. 1431 లో ఇంగ్లీషు సైనికులు ఆమెను సజీవంగా దహనం చేశారు. యూరప్‌లో 'జాతీయత' ప్రారంభమైన తొలిదినాలు అవి. నాటినుంచి లక్షలాది ప్రజలు తాము ప్రేమించిన దేశం కోసం ప్రాణాలు త్యాగం చేశారు.

'జాతీయత' నేటికీ ప్రపంచంలో ఒక ప్రబల శక్తిగా ఉన్నది. ఈ మహాశక్తిని యావత్తు మానవజాతి సేవకు ఉపయోగించుకొనడమే మన శతాబ్దంలో అతి ముఖ్యమైన సమస్య. ఇది సాధ్యమేనా? సాధ్యమో కాదో ఎవరికీ తెలియదు. కాని, దీనిని సాధించడానికి ఈ నాడు చేస్తున్న ప్రయత్నాలను, అనుసరిస్తున్న మార్గాలను ఈ పుస్తకంలోని మూడవ భాగంలో సమీక్షించినాము.

## 'జాతీయత' చేసిన మేలు

'జాతీయత' అంత శక్తివంతమైనది కావడానికి ఒక కారణం —ప్రభుత్వాల వల్ల ప్రజలకు ఎన్నో సౌకర్యాలు సమకూరడం. అటువంటి వాటిలో ముఖ్యమైన మూడింటిని చూద్దాం



ఒకటి: పోలీసు రక్షణ సౌకర్యం. ప్రభుత్వ శాసనాలననుసరించి నేరస్తులను గట్టిగా శిక్షించకపోతే సాధారణ పౌరులు స్వేచ్ఛగా తమ వ్యవహారాలను నిర్వర్తించుకోడానికి వీలుండదు. న్యాయస్థానాలు అమలు జరిపే శాసనాలే వ్యక్తి 'స్వాతంత్ర్యా'నికి ప్రాతిపదిక.

రెండు: ప్రభుత్వం అనేది ఒకటి ఉండటంవల్లనే, సమాజంలోని అన్ని వర్గాలవారు—రైతులు, వర్తకులు, ఉత్పత్తిదారులు పరస్పరం సంప్రతించుకుని, ఆర్థిక సమస్యల పరిష్కార పద్ధతులను నిర్ణయించుకోగలుగుతున్నారు. ఆహారం సరఫరా, గృహవసతి, ఉద్యోగ సౌకర్యం మొదలయినవన్నీ ప్రజలకు లభించడానికి వారి సమిష్టి ప్రభుత్వం ఎంతో తోడ్పడుతుంది. అన్నార్తులు, నిరాశ్రయులు, నిరుద్యోగులు ఎక్కువగా ఉన్నచోట విప్లవం తలయెత్తుతుంది. అందుచేత ప్రభుత్వం వ్యక్తి సంక్షేమానికి పాటుపడుతుంది.

మూడు: విదేశీ శత్రువులనుంచి దేశ ప్రజలను కాపాడలేకపోతే ప్రభుత్వం అంతరిస్తుంది. ఇతర దేశాల ప్రమాదంనుంచి రక్షించుకొంటూ, స్వదేశంలో శాంతిని కాపాడటంకోసం ప్రతి ప్రభుత్వం సైన్యాన్ని నిర్వహించవలసి ఉంది. కాని, మధ్యయుగంలో రాజులు, ప్రభువులు, ఇతర ఉన్నత వర్గీయులు తమకు సొంత సైన్యాలను ఉంచుకునేవారు. 'జాతీయత' అవతరించిన తర్వాత సర్వ సైన్యాన్ని ప్రభుత్వం తన అదుపులోకి తీసుకున్నది. ఆ విధంగా, జాతీయ రక్షణ ద్వారా, ప్రభుత్వం వ్యక్తి 'భద్రత'కు హామీ కల్పిస్తున్నది.

దీని సారాంశం ఏమిటంటే—స్వాతంత్ర్యం, ఆహారం, శాంతి—ఈ మూడూ జాతీయ వ్యవస్థ లక్ష్యాలైనాయి. జాతీయ ప్రభుత్వం ఇన్ని శతాబ్దాలుగా ఈ లక్ష్యాలతోనే కృషి చేస్తూ వచ్చింది. కాని, భవిష్యత్తులో కూడా ఇట్టి కృషి కొనసాగుతుందా? దానివల్ల ప్రయోజనం ఉంటుందా? విదేశాల ప్రమాదంనుంచి పౌరులను కాపాడడానికి జాతీయ సైన్యాలు భవి

ష్యత్తులో ఉపయోగపడతాయా? ఈ పుస్తకం చివరలో ఈ విషయాన్ని చర్చించుదాం.

## రాబందులు, సింహాలు

ప్రజల మనస్సులపై 'జాతీయత' ప్రభావం అంత బలంగా ఉండ డానికి మరొక కారణం ఆయా జాతులు ఉపయోగించే 'చిహ్నాలు'. (చిహ్నం అంటే ఒకానొక భావాన్ని లేదా అనుభూతిని వ్యక్తంచేసే వస్తురూపం.)




కొన్ని జాతులు తమ జాతీయతను వ్యక్తం చేయడానికి వివిధ జంతువుల, పక్షుల బొమ్మలను చిహ్నాలుగా ఉపయోగించుకొనేవి. ఇది చాలా ప్రాచీన ఆచారమైపోయింది. కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం ప్రజలు ఏదో ఒక పక్షి లేదా జంతువు దుష్టశక్తులను పారద్రోలి, శుభం చేకూర్చు తుందని నమ్ముతూ ఉండేవారు

చాలా జాతులు తమ జాతీయ చిహ్నంగా రాబందు బొమ్మను ఉప యోగించుకున్నాయి. కొన్ని చిహ్నాలలో ఆ రాబందుకు రెండు తలలు కనిపిస్తాయి. పూర్వపు రోమన్ సైన్యాల పతాకాలపై రాబందు ఉండేది

ఫ్రాన్స్‌లో, నెపోలియన్ కాలంలో రాబందు సామ్రాజ్య చిహ్నంగా ఉండేది. నాటి భవనాలపైన, ఉపకరణములపైన రాబందు బొమ్మ చెక్కి ఉండేది. ప్రభుత్వ పత్రాలపైన, ప్రకటనలపైన రాబందు బొమ్మను ముద్రించేవారు.

జర్మన్ సామ్రాజ్యం, రష్యాలో జార్ ప్రభుత్వం, అమెరికా సంయుక్త రాష్ట్రాలు కూడా రాబందును తమ చిహ్నంగా ఉపయోగించాయి.

అంకుల్‌శామ్ అంటే అమెరికాకు చిహ్నమని యీనాడు అందరికీ తెలుసు. అమెరికాలో ప్రతి రాష్ట్రానికి ఒకటి లేక అంతకంటే ఎక్కువ చిహ్నాలున్నాయి. టెక్సాస్ రాష్ట్రానికి నక్షత్రం, కాన్సాస్ రాష్ట్రానికి సూర్యకాంత పుష్పం, కనెక్టికట్‌కు జాజికాయ చిహ్నాలుగా ఉన్నాయి.

బ్రిటన్ (ఇంగ్లండ్, స్కాట్లండ్, వేల్స్, ఉత్తర ఐర్లండ్ కలిసినది) పెక్కు శతాబ్దాలు తన చిహ్నంగా సింహాన్ని ఉపయోగించింది. ఇంగ్లండ్‌కు ప్రత్యేకంగా ఇంకొక చిహ్నం ఉన్నది అది 'జాన్‌బుల్' చిహ్నం. అందులో బలాఢ్యుడైన ఒక పల్లెటూరి వృద్ధుని పక్కన ఒక బెబ్బులివంటి కుక్క ఉంటుంది.

నేటి సోవియట్ రష్యా చిహ్నం సుత్తి, కొడవలి. టర్కీ చిహ్నం నెలవంక, నక్షత్రం. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి ముందు ఇటలీకి నియంతగా ఉండినప్పుడు ముసోలినీ గొడ్డలికి కట్టబెట్టి ఉన్న కట్టెలమోపును తన చిహ్నంగా పెట్టుకున్నాడు. ఇది పూర్వ రోమనుల చిహ్నాలలో ఒకటి.

## జాతీయ పతాకాలు, గీతాలు

జాతీయ చిహ్నంతోపాటు ప్రతి జాతికి ఒక జాతీయ పతాకం. ఒక జాతీయ గీతం ఉంటుంది. జాతీయ సమాదేశాల సందర్భంలో అందరు కలిసి జాతీయ గీతం పాడాలి.

పెక్కు జాతీయ పతాకాలను మనం చూడగానే ఫలానా దేశానిదని గుర్తించగలం. ఉదాహరణకు అమెరికా పతాకంపై చారలు, నక్షత్రాలు

ఉంటాయి. బ్రిటిష్‌వారి 'యూనియన్ జాక్' అందరికీ తెలిసినదే. ఫ్రెంచి వారిది 'త్రివర్ణ' పతాకం. జపాన్ పతాకంపై 'ఉదయ భానుడు' ఉంటాడు. ఐక్యరాజ్యసమితి దినోత్సవ సందర్భంలో (అక్టోబరు 24) రకరకాల రంగు రంగుల జాతీయ పతాకాలను ఒక్కచోట ఒక్కసారిగా చూడటం ఎంత ఆశ్చర్యకరంగా, అద్భుతంగా ఉంటుంది! వంద పైగా ఉన్న జాతీయ గీతాలను ఒకదాని తర్వాత ఒకటి వరసగా ఆలపిస్తే, ఏది ఏ జాతిదో గుర్తించగలవారు ప్రపంచంలో ఒక్కరైనా ఉన్నారా?



తమ స్వంత 'జాతీయత'పట్ల ప్రజల భావాలు ఎంత లోతుగా వ్రేళ్ళు పాదుకున్నాయో, అవి ఎంత బలమైనవో ఈ జాతీయ చిహ్నాలు నిరూపిస్తాయి. ఒక జాతిని సమైక్యంగా ఉంచడంలో, ఆ జాతి ప్రత్యేకతను, అనితర స్వభావాన్ని స్పష్టీకరించడంలో చిహ్నాలు గురుతర పాత్ర వహించాయి.

ఐక్యరాజ్యసమితికి కూడా ఒక ప్రత్యేక పతాకం ఉన్నది. (పటంలో చూడండి) అయితే, వివిధ జాతీయ చిహ్నాలు ఆయా ప్రజలను ఏ విధ

ముగా ఉత్తేజపరచాయో, ఏ విధంగా సమైక్యం చేశాయో, ఆ విధంగా సమితి ప్రపంచ ప్రజలను ఉత్తేజపరచి, సమైక్యం సాధించగలుగుతున్నదా?

ఈ ప్రశ్నతో మన పుస్తకంలోని మొదటి భాగాన్ని ముగిస్తాం. ఈ ప్రశ్నకు సరియైన సమాధానాన్ని లాయడ్ స్టోన్ తన "శాంతిగీతం"లో సూచించాడు. ఆ గీతానికి అనువాదం ఇది:

"ఓ సమస్త మానవజాతి పితా! నా గీతాన్ని ఆలకించు. నా దేశానికి, ప్రపంచంలోని అన్ని దేశాలకు చల్లని శాంతిని కాంక్షించే గీతం ఇది. నా హృదయం స్పందిస్తున్న ఈ దేశమే నా నివాసం, నా ఆశ, నా స్వప్నం, నా ఆలయం

"కాని, నా హృదయం వలెనే ఎన్నో దేశాలలో ఎన్నో హృదయాలు ఆశలతో, స్వప్నాలతో స్పందిస్తున్నాయి.

"నా దేశంలో ఆకాశం సముద్రం కంటే నీలంగా, ఎంతో అందంగా ఉంటుంది. నా దేశంలో సూర్యకాంతి చెట్ల గుబురులలోనుంచి తొంగి తొంగి చూస్తుంటే ఎంత మనోజ్ఞంగా ఉంటుందని!

"కాని, ఇతర దేశాలలో కూడా సూర్యకాంతి ఉంది. అక్కడకూడా అది చెట్ల గుబురులలో నుంచి అందంగా తొంగి చూస్తుంది అక్కడకూడా ఆకాశం ఇంత నీలంగా ఉంటుంది

"ఓ సమస్త మానవజాతి పితా! విన్నావా నా గీతం? నా దేశానికి, ప్రపంచంలోని అన్ని దేశాలకు చల్లని శాంతిని కాంక్షించే గీతం ఇది.

# 5

# మార్గ దర్శకులు

భూమిగోళంలాగ గుండ్రంగా ఉందని ఈనాడు మనఅందరికీ తెలుసు. కాని, కొలంబస్ భూప్రదక్షిణ మహాయాత్రకు పూర్వం ఈ విషయం చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. భూమి గుండ్రంగా ఉన్నదంటే పెద్ద పెద్ద పండితులు కూడా ఆ రోజుల్లో నమ్మేవారు కారు. ఈ సత్యం వెల్లడి అయ్యే సరికి ప్రజలందరూ దిగ్భ్రమచెందారు. ముఖ్యంగా మత విశ్వాసం హెచ్చుగా ఉన్న వారికి అది విద్యుద్ఘాతంగా పనిచేసింది. అయితే, భూమి బల్లపరుపుగా లేదనీ, బంతిలాగా ఉండి రోదసిలో గిరగిర తిరుగుతున్నదనీ ప్రపంచంలో అందరికీ తెలియడానికి అనేక వందల సంవత్సరాలు పట్టింది.

అప్పట్లో ప్రజలు తమ మనస్సులను మార్చుకోడానికి ఇష్టపడలేదు. తరతరాలుగా, శతాబ్దాలుగా విశ్వసిస్తున్న విషయం తప్పని ఒప్పుకోవడం వారికి నామోషీ అనిపించింది. అనంతమైన విశ్వంలో ఈ భూమి ఒక చిన్న నలుసు వంటిదనీ, ఆ నలుసులో మనం జీవిస్తున్నామనీ అంగీకరించడం వారికి బాధాకరమయింది. ఈ నూతన సత్యాన్ని ఎవరైనా ధైర్యం చేసి

తోటివారికి బోధిస్తే, ఆనాటి పాలకులు వారిని నడివీధిలో నిలువునా తగల బెట్టేవారు. ఇంకా రకరకాల హింసలు పెట్టేవారు. ప్రతి కాలంలోనూ మార్గ దర్శకులైన మహనీయులు ఉంటూనే ఉన్నారు అయితే వారిసంఖ్య ఎప్పుడూ అల్పమే

విశ్వాన్ని గురించిన ఈ నూతన విజ్ఞానాన్ని బోధించిన తొలివ్యక్తు లలో పోలెండ్‌కు చెందిన ఖగోళ శాస్త్రజ్ఞుడు కోపెర్నికస్ ఒకడు ఇటాలి యన్ శాస్త్రజ్ఞుడు గెలిలియో కూడా అంతే. ఖగోళ శాస్త్రం అప్పటికి బాగా పాతదే. ఈ విజ్ఞానం ఎక్కువగా ప్రాచ్యదేశాలనుంచి వచ్చింది. ఎందు కంటే తూర్పు దేశాలలో నక్షత్రాలు అత్యంత ప్రకాశవంతంగా కనిపిస్తాయి.

భూమి బల్లపరుపుగా లేదనీ, అది కదలని బంతిలాగా ఉండగా దాని చుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడన్న మాట కూడా అబద్ధమనీ, 1530 సంవ త్సరం ప్రాంతంలో కోపెర్నికస్ సోదాహరణంగా బోధించటం ప్రారంభిం చాడు. భూమి చాలా చిన్న గ్రహమనీ, ఇటువంటివి ఎన్నో ఉన్నాయనీ, అవన్నీ సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయనీ, అసలు సూర్యుడే ఒక నక్ష త్రమనీ, అటువంటి నక్షత్రాలు అసంఖ్యాకంగా ఉన్నాయనీ. . ఇలా. ఇలా చాలా వివరాలు చెప్పి, మొత్తం మీద ఈ సృష్టిలో మానవుడు లెక్కకు రానంత అల్పుడనీ అతడు చెప్పాడు.

ఈ ఖగోళ పరిశోధనలవల్ల కలిగిన ఫలితాలు ఏమిటో చూద్దాం. యూరోపియన్లకు ఒక సందేహం వచ్చింది. భూమి గోళంలాగా ఉంది కనుక, దాని చుట్టూ ముక్కుకి సూటిగా ప్రయాణం చేస్తూ పోతే బయలు దేరిన చోటికే తిరిగి చేరుకోవటం తప్ప, ప్రమాణానికి అంతం ఏముంది? ఈ ప్రశ్న వేసుకుని, సమాధానాలను ఆలోచించడం మొదలుపెట్టారు. భూమి పరిమాణం ఎంత ఉంటుంది? ఈ భూగోళాన్ని ఒకసారి చుట్టిరావడానికి ఎంత కాలం పడుతుంది? అని రకరకాల ఊహాగానాలు చేశారు; అంచనాలు

వేశారు.ఏమైనప్పటికీ-తుఫానులకు చెక్కుచెదరని బలిష్ఠమైన ఓడ, శక్తిపట్టుదల గల నావికులు, సమృద్ధిగా ఆహారం ఉంటే భూప్రదక్షిణం చేయడం సాధ్యమేనని ఒక అభిప్రాయానికి వచ్చారు. చరిత్రలో మొట్టమొదటిసారిగా అప్పుడే మనుష్యులు సముద్రంమీదుగా భూ ప్రదక్షిణం చేయడానికి బయలుదేరారు.

## కొలంబస్ పశ్చిమ యాత్ర

1272 నాటికే మార్కోపోలో వంటి కొందరు యూరోపియనులు కాలి దారిన యూరప్‌నుంచి తూర్పున గల ఉత్తర చైనా (అప్పటి పేరు కాథే) వరకు వెళ్లి వచ్చారు. మార్కోపోలో ఇటలీ దేశస్థుడు. తూర్పు



దేశాలలో అతడు చూపినవి కథలు కథలుగా చెబుతుంటే యూరోపియనులు అత్యాశ్చర్యంతో వినేవారు. సువిశాలమైన కాథే దేశపు సౌభాగ్యాన్ని అతడు

ఎంతో గొప్పగా వర్ణించాడు "రహదార్ల పొడవునా బాటసారులకు అద్భుతమైన విశ్రాంతి గృహాలున్నాయి; అందమైన ద్రాక్ష తోటలు, సస్యక్షేత్రాలు ఉన్నాయి" అంటూ అతడు తన పుస్తకంలో వ్రాశాడు

'మార్కోపోలో యాత్రలు' అనే ఆ పుస్తకం విశేషమైన ప్రచారం పొందింది. బౌద్ధ సన్యాసుల మఠాలను గురించి, పట్టు, బంగారు జరీ వస్త్రాల నేత పనివారిని గురించి, సంపన్నమైన పెక్కు నగరాలను గురించి సుదీర్ఘమైన వర్ణనలు ఆ పుస్తకం నిండా ఉన్నాయి. తమ నాగరకతకంటే—పురాతనమైనది, విశాలమైనది, సంపన్నమైనది తాము కలలో కూడా ఊహించలేనిది—మరొక నాగరకత ఉన్నదని యూరోపియనులు తెలుసుకున్నారు.

చైనా దేశానికి తూర్పువైపు అంతా సువిశాలమైన సముద్రం ఉన్నది. అప్పటికి యూరోపియనులు ఎవరూ అటువైపు పోలేదు. కాని, బార్తలోమియూడయస్‌వంటి పోర్చుగీసు యాత్రికులు కొందరు 1487 నాటికి ఆఫ్రికా దక్షిణాగ్రాన్ని చేరుకున్నారు. 1498 లో వాస్కోడగామా ఆఫ్రికా చుట్టూ పూర్తిగా ప్రయాణం చేసి భారతదేశానికి చేరుకున్నాడు. తర్వాత కొద్ది సంవత్సరాలకు ఇతర యాత్రికులు కొందరు ఇంకా తూర్పుగా చైనా వరకు సముద్రయానం చేశారు.

అయితే, అప్పటికి ఎవ్వరూ యూరప్‌నుంచి పశ్చిమ దిశగా ప్రయాణం చేయడానికి గట్టిగా ప్రయత్నించినట్లులేదు. యూరప్‌నుంచి పశ్చిమంగా వెళ్లి కాథే (చైనా)ను చేరుకోవచ్చునా అని ఎవరూ ఆలోచించలేదు. అప్పటికి ఎన్నో సంవత్సరాల పూర్వం నార్వేవారు పశ్చిమానికి వెళ్లివచ్చినట్లు కట్టుకథలు ఉన్నాయి కానీ, వాటిని ఎవ్వరూ అంతగా నమ్మలేదు,

కొలంబస్‌కు పూర్వం యాత్రలు చేసి, కొత్త దేశాలను కనిపెట్టిన వారి సంగతి మొన్న మొన్నటి వరకూ ఎవరూ పట్టించుకోలేదు. వారికి చరిత్రలో సముచిత స్థానం లభించినది ఇటీవలనే. మధ్య అమెరికాలోనూ,

దక్షిణ అమెరికాలోనూ బహు పురాతన కాలంలో గొప్ప నాగరకతలు వర్ధి ల్లాయని కనుగొన్నది కూడా ఇటీవలే. పెరూ, యూకటన్, మెక్సికోలలో జరిగిన త్రవ్వకాలలో ఆ ప్రాచీన నాగరకతల శిథిలాలు బయల్పడినాయి. గతం మరింతగా వెలుగులోకి వస్తున్నకొద్దీ, పశ్చిమ జీవన విధానాలలోని 'వైరుధ్యం' మరింతగా వెల్లడి అవుతున్నది.

రినైసాన్స్ (సాంస్కృతిక పునరుజ్జీవన) కాలపు సముద్ర మార్గా న్వేషకుల కళ్ళతో చూస్తే, పూర్వార్ధగోళం దాదాపు వెనుకనున్న పటంలో మాదిరిగా కనిపిస్తుంది.

1492లో కొలంబస్ అమెరికాను కనిపెట్టాడు. అయితే, అతడు బయలుదేరింది అమెరికాను కనిపెట్టడానికి కాదు. అంత వరకూ ఎవరికీ తెలి యని ఖండం ఒకటి అక్కడ ఉంటుందని అతడు అనుమానించను కూడా లేదు. 'శాంటా మేరియా' అనే చిన్న ఓడలో యూరప్‌నుంచి పశ్చిమదిశగా బయలుదేరి, పెక్కు నెలలు అట్లాంటిక్ మహాసముద్రంలో నానా యాత నలు పడి ప్రయాణం చేశాడు. చివరికి కొన్ని దీవులు కనిపించే సరికి అవి ఇండియా దీవులో, లేకుంటే కాథేనో అయివుంటాయని అనుకున్నాడు. అం దుకని వాటికి పశ్చిమ ఇండియా దీవులు అని పేరు పెట్టాడు.

తాను కనిపెట్టిన విషయం ఎంత ముఖ్యమైనదో, ఎంత అద్భుతమై నదో చనిపోయేనాటికి కూడా కొలంబస్‌కు తెలియదు. ఆ తర్వాత కొంత కాలానికి అట్లాంటిక్ మహాసముద్రానికి అవలివైపున క్రొత్త ఖండం ఒకటి ఉన్నదన్న సంగతి యూరోపియనులు తెలుసుకున్నారు. కాని, వారు దానికి కొలంబస్ పేరు పెట్టలేదు. అమెరిగో వెస్పూసీ అనే ఇటాలియన్ నావికుని పేరుతో మొదటి సగం తీసి దానికి అమెరికా అని పేరు పెట్టారు. సాధా రణంగా ఘనత దక్కవలసిన వారికి దక్కదు. కొలంబస్‌కూ అంతే.

రినైసాన్స్ రోజులు మహోత్తేజకరంగా ఉండేవి. నూతన సత్యాలు, కొత్త దేశాలు వెలుగులోకి వస్తున్నకొద్దీ ప్రజలు సరికొత్త దృక్పథాలు అలవరచుకొనడం ప్రారంభించారు. ఇన్నాళ్లూ తమకు తెలియని కొత్త ప్రదేశాలు ఒక్కొక్కటి బయటపడుతుంటే ప్రజల పాత నమ్మకాలు సడలడం మొదలు పెట్టాయి. అయితే, ఇదంతా ఒక్కసారి జరిగింది కాదు. దీనికి చాలా వ్యవధి పట్టింది. ప్రజల దృష్టిలో భూమి వైశాల్యం పెరుగుతున్నకొద్దీ, వారి మనో వైశాల్యం కూడా పెరుగుతూ వచ్చింది. (ఈ పుస్తకం ఆఖరులో మనం రోదసీయాన యుగంలో ప్రవేశించినప్పుడు మళ్ళీ ఈ విషయం ఒక్కసారి జ్ఞాపకం చేసుకోండి.)

ఈ నవయుగం దిగ్భ్రమ చెందించే నూతన సత్యాలను ఎన్నింటినో నిరూపిస్తూ వచ్చింది. ఈ పుస్తకంలో అడుగడుగునా అవే కనిపిస్తాయి. మూడు ముఖ్యమైన సత్యాలను మనం గమనించడం అవసరం:

మొదటిది: మూఢ నమ్మకాలు సాధారణంగా తప్పులని తేలిపోతాయి. (నిరూపితమైన సత్యం ఆధారంగా లేని నమ్మకమే మూఢ నమ్మకం.) మధ్య యుగంలో మూఢ నమ్మకాలు చాలా ఎక్కువగా ఉండేవి కొందరు పోర్చుగీసు నావికులు ఆఫ్రికాతీరం వెంబడి దక్షిణానికి ప్రయాణం చేయాలని బయలుదేరగా, అటువైపు పోయినకొద్దీ సముద్ర జలం వేడెక్కుతూ ఉంటుందనీ, మరీ దూరం పోతే అక్కడ నీరు మరుగుతూ ఉంటుందనీ వారిని భయపెట్టారు. కాని, పోర్చుగీసు నావికులు వెనకడుగు వేయకుండా ప్రయాణం సాగించి, ఆ కట్టుకథ అబద్ధమని నిరూపించారు. అనేక ప్రమాదాలను గడిచి, హిందూ మహా సముద్రంమీదుగా తూర్పు దీవులకు ఒక కొత్త మార్గాన్ని కనిపెట్టారు.

భూమి బల్లపరుపుగా ఉన్నదని విశ్వసించేవారు కొలంబస్‌ను ఇలాగే భయపెట్టారు. అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా తిన్నగా పోతే, చివరికి



అతడి ఓడ భూమి అంచు మీదనుంచి క్రిందకు ఎక్కడికో పడి కొట్టడం ఖాయమని వారు చెప్పారు. కాని. కొలంబస్ ఆ అభిప్రాయాన్ని అంగీకరించలేదు. సాహసించి బయలుదేరాడు, కష్టాలను ఎదుర్కొన్నాడు; చివరికి ఒక నూతన ప్రపంచాన్ని కనుగొన్నాడు.

రెండవది నూతన పరిసరాలు, వాతావరణం ప్రజల మనస్సులను మారుస్తాయి. (ఇక్కడ వాతావరణం అంటే మనిషి చుట్టూ వుండే పరిస్థితులని అర్థం) ఆ రోజులు ఎన్నో చికాకులతో కూడినవి. అన్నీ సందిగ్ధమైన అభిప్రాయాలే. ఏది నమ్మాలో, ఏది నిజమో తెలియని అయోమయ పరిస్థితి ప్రజల మనస్సులలో ఏర్పడింది. క్రిందటి అధ్యాయంలో చెప్పిన విధంగా 'జాతీయత' పెంపొందుతూ వచ్చింది. దీనివల్ల ఒక దేశపు ప్రజలు,



మరొక వేపు ప్రజలు పెరుగుతూ వచ్చారు. అయితే, ఇంకా ప్రశస్తము కొత్త జాతులకు పరస్పరం సన్నిహితం చేస్తున్న ప్రాప్యం లాగా యూరప్, ఆసియాలోని కొద్ది భాగం మాత్రమే కాదు, 'తెలిసిన' ప్రపంచం వైశాల్యం పెరిగింది. కొందరు ఆఫ్రికా ఖండం దక్షిణాగ్రం వరకు ప్రయాణం చేశారు. తర్వాత తూర్పున భారతదేశాన్ని, చైనాను సందర్శించారు. అంతలో ఇటు పశ్చిమాన హఠాత్తుగా అమెరికా బయటపడింది. ఒక్క తరంలో ఇన్ని విశేషాలు వెల్లడి అయ్యేసరికి గుక్క తిప్పుకోలేనట్లుగా అయింది అప్పటి వారికి.

వీటి ఫలితాలన్నింటినీ ఒక వరుసలో పేర్చుకుని ఏది ఏమిటి అని తాపీగా గ్రహించడానికి చాలా కాలమే పట్టింది. సముద్ర మార్గాన్వేష

తులు, విజ్ఞాన శాస్త్రజ్ఞులు, తత్త్వవేత్తలు తాము కనిపెట్టిన వాటిని గురించే ఎక్కువగా పట్టించుకున్నారు గానీ, తమ కాలపు 'సమగ్ర స్వరూపాన్ని' దర్శించినవారు చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు.

కొత్తగా కనిపెట్టిన ప్రదేశాలు, పరిశోధించిన శాస్త్ర విషయాలు, తత్త్వసిద్ధాంతాలు, రాజకీయ సూత్రాలు—యివన్నీ ఆనాటి చరిత్రంలో ఎలా ఇమిడాయో మనం ఈ నాడు స్పష్టంగా చూడగలుగుతున్నాము. ఎందుకంటే మనకు 'వెనకచూపు' ఉన్నది కనుక, అయితే భావి చరిత్రకారులు మన తరం చరిత్రను చూసి ఏమంటారు? "వారు అణుశక్తిని గురించి పూర్తిగా తెలుసుకున్నారు. రోదసిలో సంగతులు తెలుసుకున్నారు. కాని, తమ సమాజాన్ని తాము చక్కదిద్దుకోవటం తెలుసుకున్నారా?" అని వ్రాస్తారేమో!

పూర్వం ఒక జ్యోతిష్కుడు అస్తమానం మేషాలు లెక్కబెడుతూ, ఆకాశంలో చంద్రుడికేసి తదేకంగా చూస్తూ ఉండేవాడట. ఒక రోజు అలా ఆకాశంవైపు చూస్తూ నడుస్తూ గుభేలున నూతిలో పడి మరణించాడట! మన విషయం కూడా ఆ కథలాగే ఉన్నదా? మన కాలమంతా చంద్రమండలాన్ని చేరుకోవడానికి పోటీ పడటంతోనే సరిపోతున్నది కానీ, భూమిని కలిసి బతకడం ఎలాగో నేర్చుకోడానికి తీరిక లేకుండా ఉంది.

భూమిపరిది ఏ పరిశోధన గానీ కేవలం ఒక్క దేశం సాధించినది కాదు. ఆ రోజుల్లో మనుషులు, జాతులు ఎలా కలిసి కృషి చేశాయో చూద్దాం. కొలంబస్ జినోవాకు చెందినవాడు. అతడు అట్లాంటిక్ మహాసముద్రంలో సాహస యాత్ర సాగించడానికి ఓడలు ఇచ్చినవాడు, ధనం సమకూర్చినవాడు స్పెయిన్‌రాజు. కాని, కొలంబస్ కనిపెట్టిన భూమిని ఆక్రమించుకుని, వృద్ధిలోకి తీసుకువచ్చినవారు ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు, పోర్చుగీసువారు, డచ్‌వారు, స్పెయిన్‌వారు.

కొత్త ప్రపంచంలో తమ జెండా పాతి, అక్కడ ఇళ్ళు, దుకాణాలు నెలకొల్పుకోవాలని యూరోపియన్ దేశాల ప్రతినిధులందరూ కుమ్ముకుంటూ, తోసుకుంటూ మహా సముద్రానికి అడ్డం పడ్డారు. వారిని పట్టపగ్గాలు లేకపోయాయి. 17వ శతాబ్దంలో ఇంగ్లండ్‌లో విప్లవం చెలరేగుతున్న రోజుల్లో 'పాత' ఇంగ్లండ్‌నుంచి 'కొత్త' ఇంగ్లండ్‌కు మూడేసి రోజులకు ఒక నౌక బయలుదేరుతూ ఉండేది. ఇలా అమెరికాకు ఎగబడిపోవడంతో, ఇంగ్లండ్‌లోని కొన్ని పట్టణాలు, గ్రామాలు సగానికి సగం ఖాళీ అయిపోయాయి. తర్వాత రెండు శతాబ్దాలలో మిగతా యూరప్‌దేశాలు కూడా ఇంగ్లండ్‌చూపిన దారిని అనుసరించాయి—అందరి దారి పశ్చిమానికే. ఈ సాహస తత్త్వాన్ని వాల్ట్ విట్‌మన్ తన పద్యంలో ఇలా వర్ణించాడు:

మార్గం తెలియదు, గమ్యం తెలియదు,
అయినా మనపయనం ముందుకే ముమ్ముందుకే.



వెనుక చూపు లేదు మనకు, పట్టు విడుపులేదు మనకు.
తీరాలుగడచి, కనుమలు దాటి,
నిట్టనిలువు కొండలెక్కి, మున్నెరుగని దారిత్రొక్కి
పదండి ముందుకు పదండి చొచ్చుకు,
జయిస్తూ. జయించిన దాని గుప్పిట బిగిస్తూ.
ధైర్యంగా, సాహసంగా ముందుకు మున్ముందుకు పొంగిపోదాం—
మార్గ దర్శకులారా! మహా సాహసులారా! ఓ మార్గ దర్శకులారా!

## మహా సముద్రం పై విజయం

ఈ రీతిగా జలమార్గాలు సంబంధ సాధనాలైనాయి. అయితే, పాశ్చాత్య నాగరకతలో ఇక మధ్యధరా సముద్రపు ప్రాధాన్యం తగ్గిపోయింది. దానిస్థానాన్ని అట్లాంటిక్ మహా సముద్రం ఆక్రమించింది. రోమనుల కాలంలోనూ, మధ్య యుగంలోనూ ముఖ్యమైనవిగా ఉండిన దేశాలు వెనకబడిపోయాయి. యూరప్ ఖండం అంచున గల పోర్చుగల్, స్పెయిన్, హాలెండ్, బ్రిటన్ వంటి దేశాలు ముందుకు వచ్చాయి.

అట్లాంటిక్ సముద్రం ఒడ్డున గల ఈ దేశాల వాణిజ్యం విశేషంగా పెరిగిపోయింది. వాటి నగరాలు మరింత విస్తృతమైనాయి; ప్రజలు మరింత ధనికులయ్యారు. సముద్రాల అవతల ఉన్న ఇతర దేశాల ప్రజలను కూడా పరిపాలిస్తున్నాయి కనుక; అవి 'వలస సామ్రాజ్య దేశాలు'' అయినాయి. అగ్రరాజ్యాల అవతరణకు అదే నాంది. 'అధికార విస్తరణ రాజకీయాలు' అప్పుడే ఆరంభమయినాయి.

నవప్రపంచంలో ఎన్నో ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. వాటిని అంత వరకు ఎవ్వరూ త్రవ్వి వెలికి తీయలేదు. బంగారం, వెండి సమృద్ధిగా ఉన్నాయి. ఇవి కాక కలప, పంచదార, పొగాకు, కొన్ని రకాల అరుదైన

పండ్లు, రమ్ అనే సారా విరివిగా లభిస్తున్నాయి. అన్వేషకులు ఒకరి తర్వాత ఒకరు వరసగా కొత్త ప్రదేశాలు కనిపెట్టడంతో నవప్రపంచం అసలు స్వరూపం బయటపడుతూ వచ్చింది మొదట్లో పశ్చిమ ఇండియాదీవులు మాత్రమే వారికి తెలుసు. తర్వాత వాటికి కొంచెం ఆవల ఒక బ్రహ్మాండమైన భూభాగం ఉందనీ, అది అటు ఉత్తరధ్రువం మొదలు, దక్షిణధ్రువం వరకు వ్యాపించి ఉందనీ తెలుసుకున్నారు.

అమెరికా దక్షిణపు అగ్రాన్ని చుట్టి పసిఫిక్ మహాసముద్రంలో ప్రవేశించిన మొట్టమొదటి నావికుడు మాజిలన్. మాజిలన్ జలసంధికి అతడి వల్లనే ఆ పేరు వచ్చింది, సముద్ర మార్గాన భూప్రదక్షిణం చేయవచ్చునని అతడే నిరూపించాడు. అయితే పశ్చిమాభిముఖంగా పసిఫిక్ మహా సముద్రం మీదుగా చైనాకు, మిగతా ఆసియాకు మార్గాలెవరూ అప్పటికీ కనిపెట్టలేదు. చైనా చేరడానికి అప్పటికి తెలిసిన మార్గం పూర్వాభిముఖంగా బయలుదేరి, మధ్య ప్రాచ్యదేశాలమీదుగా, భారతదేశం మీదుగా వెళ్ళడమే.

కొత్త ప్రపంచాన్ని దొరికినంత మటుకు ఆక్రమించుకోవాలనే తహతహ ప్రారంభమయింది. మళ్ళీ ఒక్కసారి పటం కేసి చూడండి—యూరప్ దేశాలు కొత్త ప్రపంచాన్ని ఎలా పంచుకోవటం మొదలు పెట్టాయో తెలుస్తుంది. అయితే. అదృష్టవశాత్తూ ఈ నూతన ప్రపంచం 'వలస' ప్రాంతంగా ఎక్కువ కాలం ఉండిపోలేదు. 19 వ శతాబ్దం సగం గడిచే సరికి అమెరికా ఖండంలో అధికభాగం యూరప్ పాలననుంచి విముక్తమయింది. ఆ తర్వాత సుమారు పాతిక స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినాయి. ఆఫ్రికా కథకు, అమెరికా కథకు ఎంత తేడా! కొద్ది సంవత్సరాలక్రితం వరకు ఆఫ్రికా పరిస్థితి ఎంత దయనీయంగా ఉన్నదో జ్ఞాపకం చేసుకోండి.

అమెరికాలో—ముఖ్యంగా ఉత్తర అమెరికాలో—జాతులన్నీ కలగాపులగ మయిపోవడం మొదలు పెట్టాయి. ఒక్క యూరోపియనులే కాదు.

ఆసియా వారు, ఆఫ్రికావారుకూడా అమెరికాచేరుకున్నారనినా నమ్మకముకున్నారు. అయితే, వీరందరూ కోరి అక్కడకు చేరినవారు కారు ఆఫ్రికానుంచి లక్షలాది మనుషులను బలవంతంగా బానిసలుగా ఓడలకెక్కించి అమెరికాకు రవాణా చేశారు, ఆ బానిసల సంతతి అప్పటినుంచి శ్వేతజాతి వారితో సమానమైన ప్రతిపత్తి కోసం పోరాడుతూ వచ్చారు. వారూ అమెరికను లయ్యారు అమెరికన్ జాతిలో వారూ భాగస్థులయ్యారు. ఏమైనప్పటికీ, మొత్తంమీద, అన్ని భాషల ప్రజలు, అన్ని రంగుల ప్రజలు ఒకే ప్రభుత్వం క్రింద, ఒకే జాతిగా జీవించగలిగిన పరిస్థితులుంటే-సాధ్యమేనని అమెరికా నిరూపించింది.

## పారిశ్రామిక విప్లవం

యూరప్ దేశాల నుంచి అమెరికాకు అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా సెక్కు నౌకా మార్గాలు ఏర్పడినాయి. వాటిమీద [illegible] విశేషంగా పెరిగాయి యూరప్ నుంచి మనుషులను, తయారైన వస్తువులను అమెరికాకు చేరవేసేవారు, తిరిగి వచ్చేటప్పుడు ఆహారపదార్థాలు, ముడి పదార్థాలు తీసుకు వచ్చేవారు. మొదటి అధ్యాయంలో ప్రస్తావించిన 'కృషి విభజన'కు ఇది మరొక ఉదాహరణం

ఈ వస్తువినిమయంవల్ల విపణి విస్తరణవల్ల అటు అమెరికా, ఇటు యూరప్ ఎంతగా ప్రయోజనం పొందేవో చూడండి. అమెరికాలోని ప్రెయిరీ మైదానాలలో పుష్కలంగా లభించే మొక్కజొన్న, పండ్లు, ప్రత్తి ఇంకా కలప, తగరం, రాగి మొదలయినవి యూరప్‌కు రవాణా చేసేవారు వాటివల్ల యూరోపియన్ ప్రజల జీవన ప్రమాణం పెరిగింది, ఇటు యూరప్ దేశాలనుంచి శస్త్రాలు, పనిముట్లు, వంతెనల నిర్మాణానికి అవసరమైన సామగ్రి, వ్యవసాయపు పరికరాలు పడవలు అమెరికాకు రవాణా చేసేవారు వీటివల్లే అమెరికా ఎన్నో సౌకర్యాలు పొందింది

ఈ విధంగా వ్యాపారం పెరగడంతో, అమెరికా అవసరాలకోసం యూరోపియనులు హెచ్చుగా వస్తువులు ఉత్పత్తి చేయవలసి వచ్చింది. అందుకోసం మరిన్ని కర్మాగారాలు నిర్మించుకోవలసి వచ్చింది. అటు అమెరికా విస్తృతమవుతూ, వృద్ధి పొందడంతో దాని అవసరాలూ పెరిగాయి. ఆ విధంగా, అట్లాంటిక్ మహా సముద్రపు అవతలి ఒడ్డువారు, ఇవతలి ఒడ్డువారు తాము ఒకే నాణానికి బొమ్మ బొరుసులాంటి వారమని గుర్తించారు. ఉభయ ఖండాలమధ్య సముద్రం చాలా వెడల్పుగా ఉంది; పైగా కెరటాల ఉధృతం కూడా చాలా ఎక్కువ. అయినప్పటికీ అది రెండు ఖండాలను విడదీయడానికి బదులు 'సమైక్యం' చేసింది.



రైలు మార్గాలు విస్తరిస్తున్నకొద్దీ ఆవిరి ఇంజన్లకు, ఉక్కు పట్టాలకు గిరాకీ పెరిగింది. 19వ శతాబ్దం సగం గడిచే నాటికి ఉత్తర అమెరికా ఇవతలి తీరం నుంచి అవతలి తీరం వరకు రైలుమార్గం నిర్మించబడింది. క్రమ

ముగా రైలు మార్గాలు అమెరికా అంతటా అల్లుకోవడం ప్రారంభించాయి. నదులమీదుగా, పర్వత శ్రేణులమీదుగా రైలు మార్గాలు నిర్మించారు. ప్రయాణాలకు, రవాణాలకు అవి ప్రధాన సాధనాలైనాయి. వాటివల్ల కొత్త కొత్త పట్టణాలు వెలిశాయి; పరిశ్రమలు ప్రారంభమైనాయి.

యూరప్‌లోని పాత రోమన్ రహదారులు వీటితో పోల్చుకుంటే ఎందుకూ పనికిరావు. ఆ రహదారులపై ఇంత భారీయెత్తున వ్యాపారం ఎన్నడూ జరగలేదు. యూరప్‌లో అవతరించిన "పారిశ్రామిక విప్లవం" అతి శీఘ్రంగా నవ ప్రపంచానికి వ్యాపించింది. వ్యాపారులు శాస్త్రజ్ఞులతో చేతులు కలిపి మూల మూలలకు సాలెగూళ్ళలాగా రైలుమార్గాలను అల్లారు. (ఈ విప్లవంలో శాస్త్రజ్ఞుల పాత్రను గురించి ఏడవ అధ్యాయంలో విశదంగా తెలుసుకుందాం.)

ఈ విధంగా 17 వ శతాబ్దం నుంచి 19 వ శతాబ్దం వరకు 'అట్లాంటిక్' నాగరకత అభివృద్ధి చెందింది. అయినా, అప్పటికీ అది ప్రధానంగా యూరోపియన్ నాగరకతగానే ఉండిపోయింది. నవ ప్రపంచంలో అంతకు పూర్వం ఉండిన నాగరకతలు యూరోపియనుల ప్రవేశం తర్వాత క్రమంగా అంతరించి పోయాయి.

## ఆసియా కథ

పసిఫిక్ మహా సముద్ర ప్రాంతంలోని ఆసియా దేశాల పరిస్థితి ఎలా వుందో చూద్దాం. వీటి కథ పూర్తిగా ఇంకొక విధంగా ఉంది. జపాన్, చైనా, బర్మా, భారత దేశం, తూర్పు ఇండియా దీవులు శ్వేతజాతి జనాభా తరలి రావడానికి అనువుగా లేవు. ఆక్రమణ దాహం అధికంగా గల యూరోపియనులు ఎప్పుడు వస్తారా అని కాచుకు కూర్చున్న ఖాళీ జాగాలేవీ ఇక్కడ లేవు.

శ్వేతజాతివారికి పరిస్థితులు అనుకూలంగా ఉన్న సమయంలో కూడా వారందరూ మూక ఉమ్మడి వచ్చి, నివాసాలు ఏర్పరచుకుని, స్థిరపడడానికి తూర్పు దేశాలలో ఆట్టే తావు లేకపోయింది. ఆఫ్రికాలోనూ, తూర్పు దేశాలలోనూ యూరోపియనులు ఎక్కువగా సముద్రతీరంవద్దగల వ్యాపార కేంద్రాలలోనే స్థిరపడ్డారు యూరోపియన్ వలసదారులు (వ్యాపారులు, సైనికులు, అధికారులు) ఆ దేశాలలో అత్యల్ప సంఖ్యాకులుగానే ఉండేవారు.

ఇప్పటికీ మానవ జాతిలో సగానికిపైగా ప్రజలు పూర్వార్ధగోళంలోనే నివసిస్తున్నారు. ప్రస్తుత ప్రపంచ జనాభా 300 కోట్లు అని అంచనా వేశారు. ఈ జనాభా అంతకంతకు పెరుగుతున్నది. ప్రాచ్య ప్రపంచ జనాభాలో అత్యధిక సంఖ్యాకుల జీవన ప్రమాణం ఎన్నో శతాబ్దాలుగా చాలా తక్కువ స్థాయిలో ఉంది. ఆఫ్రికాలో అధికభాగం ఇప్పటికీ అటువంటి స్థితిలోనే ఉంది. ఈ ముఖ్యమైన విషయాన్ని మరొక అధ్యాయంలో చర్చించుదాం. ఆసియా, ఆఫ్రికాలలో 'వలసల విముక్తి' ఈ తరం ముఖ్యమైన సమస్యలలో ఒకటయింది కొలంబస్ నూతన దేశాలను కనుగొన్న తర్వాత కలిగిన సంచలనం కంటే శీఘ్రమైన పరిణామాన్ని ఈ తరం ప్రజలు చూస్తున్నారు.

## సాహస వర్తకులు

వర్తకులు-ప్రప్రథమంగా-ప్రపంచాన్ని అంతటినీ 'ఒకే విశాల విపణి'గా భావించడం ప్రారభించారు. ఈ నూతన దృక్పధానికి అర్థం ఏమిటి? వర్తకులు, ఉత్పత్తిదారులు తమ సరకులను తమ ఊరిలోనో, పొరుగూరిలోనో అమ్మడానికి బదులు వాటిని ఓడల కెక్కించి విదేశాలకు రవాణా చేయడం మొదలు పెట్టారు. గిరాకీని బట్టి ఒక్కొక్కప్పుడు, సరకులను వేసుకుని ప్రపంచపు అంచుల దాకా పోయేవారు. అలాగే తమకు కావలసిన

ముడి పదార్థాలను (బొగ్గు, ఇనుము, ఉన్ని మొదలయినవి) తమ ఇరుగు పొరుగువారి వద్ద కొనడానికి బదులు, అవి చౌకగా, సమృద్ధిగా లభించే విదేశాలనుంచి కొనుక్కొని తెచ్చుకునే వారు.

అయితే, యీ ప్రపంచ విపణి విస్తృతం కావడానికి కొన్ని శతాబ్దాల కాలం పట్టింది. ఇప్పటికైనా ఈ విస్తృతి పూర్తి అయిందని చెప్పడానికి వీల్లేదు. (1964 లో ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో జరిగిన ప్రపంచ వాణిజ్య, అభివృద్ధి మహాసభ అంతర్జాతీయ వాణిజ్యంలో ఒక "నూతన విధానాన్ని" సృష్టించడానికి బృహత్ప్రథకాలు తయారు చేసింది. ఆ మహా సభలో 120 దేశాలు పాల్గొన్నాయి. అయితే, మనం ఇక్కడ చెప్పుకుంటు న్నది పూర్వపు పద్ధతి గురించి) ఈ వాణిజ్యంలో కొన్ని దేశాలు నాయ కత్వం వహించడం ప్రారంభించాయి. వాటి ఓడలు, వాటి బ్యాంకులు, వాటి వర్తకుల వల్లనే ప్రపంచ విపణి నిర్మాణం జరిగింది. మిగతా దేశాలన్నీ వాటి అడుగు జాడల్లో నడిచాయి.

ప్రపంచ వాణిజ్యంలో బ్రిటన్ అగ్రస్థానం వహించింది. బ్రిటన్‌లో ఈ వాణిజ్యాన్ని వృత్తిగా పెట్టుకుని ధనార్జన చేస్తున్న వర్తకుల సంఖ్య అంతకంతకు పెరుగుతూ వచ్చింది. అందుచేతనే, బ్రిటన్ చిన్న ద్వీపమై నప్పటికీ, దాని ఆహారోత్పత్తి అత్యల్పమైనప్పటికీ ఈ నాడు ఐదున్నర కోట్ల జనాభాను పోషించ గలుగుతున్నది

బ్రిటన్, ఫ్రాన్స్, హాలెండ్ వంటి ప్రముఖ వాణిజ్య దేశాలు సము ద్రాలు దాటి సువిశాలమైన వాణిజ్య సామ్రాజ్యాలను స్థాపించు కున్నాయి. ఆ విధంగా వాటి జాతీయత 'ఎగుమతి' సరుకు అయింది. ఈ సామ్రా జ్యాల మధ్య పోటీ అనివార్య మయింది. ఆ పోటీ ఈనాటి వరకు ప్రపంచ శాంతికి ప్రమాద హేతువుగానే ఉంది. వలస దేశాలన్నీ 'స్వతంత్రం' కావ డం ఒక్కటే దీనికి పరిష్కార మార్గం. ఆ ఉద్యమమే ఇప్పుడు శీఘ్ర గతిని సాగుతున్నది.

భూమి మీద, సముద్రం మీద, కొన్ని వేలమైళ్ళ పర్యంతం భారీ ఎత్తున వాణిజ్యం సాగించాలంటే, జాతీయం గానూ, అంతర్జాతీయంగానూ అందరి కృషిని సమీకరించి, సమన్వయించడం అవసరమని వర్తకులు గుర్తించారు. అప్పటినుంచి సముద్రాంతర వాణిజ్యం ఎక్కువగా "సాహస వర్తకుల" సంస్థల ద్వారా జరుగుతూ వచ్చింది.

కాలం గడిచిన కొద్దీ ఈ సంస్థలు సంపన్నంగా, శక్తిమంతము లుగా రూపొందాయి. తాము ఏ దేశాలతో ప్రధానంగా వర్తకం చేస్తాయో ఆ దేశాల పేర్లను అవి తమ సంస్థలకు పెట్టుకునేవి. వాటిలో కొన్ని సంస్థలు ఇప్పటికీ ఉన్నాయి. తూర్పు ఇండియా కంపెనీ 1575 ప్రాంతంలో తూర్పు ఇండియా దీవులతో వ్యాపారం ప్రారంభించింది. హడ్సన్‌బే



కంపెనీ దాదాపు మూడు వందల సంవత్సరాలుగా ఉత్తర అమెరికా, యూరప్‌ల మధ్య ఉన్ని (ఫర్) వ్యాపారం చేస్తున్నది.

మనం లోగడ చెప్పుకున్నట్లు, ఈ సంస్థల మధ్య పోటీ తీవ్రంగా ఉండేది. ఈ పోటీవల్ల వివిధ దేశాలలో వాటి మధ్య యుద్ధాలుకూడా తరచుగా జరుగుతూ ఉండేవి. అయితే, ఆ యుద్ధాల సంగతి ఇప్పుడు మనకు అనవసరం. ఈ సంస్థలను గురించి ప్రత్యేకంగా చెప్పుకోవడం దేనికంటే, ఆర్థిక జీవన వికాసం మనుష్యుల సహకారం మీదనే ఆధారపడి ఉంటుందన డానికి అవి నిదర్శనా లైనాయి. సముద్రాల మీద వాణిజ్యం అనగానే తుఫానుల ప్రమాదాలుంటాయి; సముద్రపు దొంగల బెడదఉంటుంది; పోటీ దారులతో ఘర్షణలుంటాయి. వీటినన్నింటినీ సమిష్టిగా ఎదుర్కొనడం కోసం ఆ సంస్థలు తమ అర్థబలాన్ని, అంగబలాన్ని, ప్రతిభను సమష్టిగా వాడుకునేవి.

## విజ్ఞాన వ్యాప్తికి-ముఖ్య సాధనం

ఈ అధ్యాయాన్ని ముంగిచే ముందు, ఒక్కసారి వెను దిరిగి, కాగితాన్ని కనిపెట్టడం గురించి తెలుసు కుందాం.

ఓడల మీద, ఆ తర్వాత రైళ్ళమీద, మోటారు కార్లమీద ప్రజల ప్రయాణాలు, సరుకుల రవాణాలు అంత కంతకు ఎక్కువవు తున్నాయి. కాని, మనుషుల ప్రయాణాల కంటే వారి 'భావాలు' ప్రయాణం చేయడం ఇంకా ముఖ్యం కదా! రినైసాన్స్ (సాంస్కృతిక పునరుజ్జీవ) కాలంనుంచీ విజ్ఞానుల భావాలు ఎన్నో ప్రజలకు వెలుగును చూపించాయి. సరిహద్దులను, సముద్రాలను అధిగమించి ప్రపంచంలో మూలమూలకు అవి వ్యాపించాయి. భూగోళ శాస్త్రం, విజ్ఞాన శాస్త్రం, మతం, రాజకీయాలు మొదలయిన పెక్కు విషయాలకు సంబంధించిన విజ్ఞానం అంత శీఘ్రంగా వ్యాప్తిచెంద

దానికి కారణం రెండు అద్భుత సాధనాలు. ఒకటి కాగితం, రెండవది ముద్రణ యంత్రం.



[illegible] చైనాలో వెయ్యి సంవత్సరాల క్రిందటే కనిపెట్టారు. [illegible] దానిని తయారు చేసే పద్ధతి ఎన్నో శతాబ్దాల తర్వాతగాని [illegible] తెలియలేదు. జంతువుల తోళ్ళతో చేసే పూర్వకాలపు [illegible] తయారుచేసే [illegible] మాదిరిగానూ [illegible] చాలా [illegible] కాగితపు [illegible] తయారు చేసే పద్ధతి కనిపెట్టారు.

తర్వాత 1445 ప్రాంతంలో, జోహాన్ గుటెన్ బర్గ్ అనే అతడు ముద్రణ యంత్రాన్ని కనిపెట్టాడు. ఏ అక్షరానికి ఆ అక్షరం విడిగా ఉండేటట్లు, ఆ అక్షరాలను కావలసిన విధంగా పేజీలో [illegible] నేటట్లు అతడు తయారు చేశాడు. ఆ అక్షరాలు కొయ్యతోగానీ, లోహంతోగానీ చేసినవై ఉండేవి. అక్షరాల కూర్పును కాగితాలపై త్వరత్వరగా ముద్రించే పద్ధతి కూడా అతడు కనిపెట్టాడు.

## అదృశ్య హస్తాలు

ఇప్పటినుంచి-యూరప్‌లోనూ, తర్వాత ఇతరదేశాలన్నింటిలోనూ- ముద్రిత గ్రంథాలు విశేషంగా ప్రచారంలోకి వచ్చాయి. ధైర్య సాహసాలు గలవారు కొత్త దేశాలను వెలుగులోకి తీసుకు వస్తుంటే, మేధావులు కొత్త భావాలను వెలుగులోకి తీసుకు వచ్చారు.

సముద్ర మార్గాన్వేషకులకు ప్రపంచ పటాలు, వివరాల పట్టికలు మొదలయినవి అవసరమైనాయి. వాటిని ఇస్లాము నావికుల నుంచి యూరోపియనులు సంపాదించుకున్నారు. చైనీయులు దిక్సూచిని కనిపెట్టారు. అది కూడా వాడుకలోకి వచ్చింది. దిక్సూచి లేకుండా కొలంబస్ కొత్త ప్రపంచాన్ని కనిపెట్ట గలిగి ఉండేవాడు కాదు.



తూర్పు దేశాలు, పశ్చిమదేశాలు చేతులు కలిపాయి. ఒకరు ఒక కొత్త విషయాన్ని కనిపెట్టారంటే, అందుకు ఎన్నో దేశాల వారి సాహాయ్యం అదృశ్యంగా ఉంటూనే ఉంది. నూతన విజ్ఞానపు వేళ్ళు చాలా లోతుగా పాతుకున్నాయి. దాని శాఖలు ప్రపంచమంతటా వ్యాపించాయి. ఆధునిక ప్రపంచం అవతరణకు నాంది 'ముద్రణ' ఒకే విషయం పట్ల ఆసక్తి గల ప్రజలందరి మధ్య సంబంధం కల్పించగల సాధనం ముద్రిత గ్రంథం అయింది.

మనుష్యులు. మనుష్యుల భావాలు ప్రపంచమంతా పర్యటించడానికి అవకాశం కల్పించిన సముద్ర మార్గాన్వేషకులను, సాహస పర్తకులను తలుచుకుంటే మనకు తెలిసే సత్యం ఇది:

మనుష్యులు తమ ప్రతిభను, కృషిని సమీకరించుకుంటే ప్రపంచాన్ని అత్యుత్తమంగా, సకల సఖారామంగా తీర్చి దిద్దుకో గలరు.

# 6

# స్వాప్నికులు

ప్రతి ఘనకార్యం మొట్టమొదట ఎవరో ఒక వ్యక్తి మెదడులో పుట్టిన ఊహే

నౌకను నిర్మించడంగానీ, గ్రంథం రచించడంగానీ, కొత్త విమానం ఆకాశ విహారం చేయడంగానీ-తొలిదశలో మానవుని మనస్సులో ఊహా చిత్రాలు.

కొత్త కొత్త విషయాలు, వస్తువులు కనిపెట్టాలనే ఆరాటం తొలి నాగరికతల కాలంలో లేదు. రినైసాన్స్ కాలం నుంచి ఈ ఆరాటం పెరుగుతూ వచ్చింది. 'పురోభివృద్ధి' సాధించాలన్న పట్టుదల ప్రజలను అన్వేషణలకు, పరిశోధనలకు పురికొల్పింది. పురోభివృద్ధి అంటే పరిసరాలను మరింత సుఖప్రదాయకంగా మార్చుకోవడం. ఇందుకోసం జరిగిన కృషిని గురించి క్రిందటి అధ్యాయంలో చెప్పుకున్నాము.

బౌద్ధమతం, మహమ్మదీయమతం, యూదుమతం, క్రైస్తవమతం, ఇతర గొప్ప మతాలన్నీ కూడా పురోభివృద్ధి పట్ల మానవునికిగల విశ్వా

స్వాన్ని బలపరిచాయి. భావిదృష్టిగల మహనీయులు ప్రతి శతాబ్దంలోనూ ఉంటూనే ఉన్నారు. వారు దూరాలోచనతో నిర్ణయాలు చేసేవారు. వారిని స్వాప్నికులని అనేవారు. కాని, వారి స్వప్నాలు అనేకం ఫలించాయి.

ప్రతిశతాబ్దంలోనూ మత ప్రవక్తలున్నారు. తమకాల పరిస్థితులు ఎంత బాధాకరంగా, నిరుత్సాహ పూరితంగా ఉన్నప్పటికి వారు దృఢ విశ్వాసంతో, ఆశాభావంతో భవిష్యత్తును సందర్శించేవారు. శుష్కమైన ప్రజల మనస్సులలో ఆశలను చిగురింప చేసేవారు మరింత ఉదాత్తమయిన, ప్రశాంత ప్రపంచానికి వారుదారి చూపేవారు.

## భూలోక స్వర్గం 'ఉటోపియా'

అతి నికృష్టమైన పరిస్థితులలో జీవిస్తూ, అతి సుందరమైన ప్రపంచాన్ని గురించి కలలుకంటూ ఉండేవారి భావాలను 'ఉటోపియన్' భావాలని అంటూ ఉంటారు. ఇంగ్లండ్‌లో సర్ థామస్ మోర్ అనే రచయిత 1516లో 'ఉటోపియా' అనే గ్రంథాన్ని రచించాడు. 'ఉటోపియా' అనేది అతడు ఊహించిన సుందర ప్రపంచం. అది లోపరహితమైన లోకం, 'ఉటోపియన్' భావాలు అనే మాట ఈ ఊహాలోకాన్ని బట్టి వచ్చినదే.

సుదూర భవిష్యత్తులో ఎప్పుడో అటువంటి పరిపూర్ణ సమాజం అవతరిస్తుందనే ఆశాభావంతో థామస్‌మోర్ ఆ ఊహాస్వర్గం-'ఉటోపియా'-ను చిత్రించాడు. నాలుగు శతాబ్దాల క్రితం అతడు ఊహించిన దానిలో చాలా భాగం నిజమయింది, అయితే అతడు చెప్పిన పద్ధతిలో కాకపోవచ్చు తత్త్వవేత్తలు కలలు గన్న ఇతర 'ఉటోపియాలు' మాత్రం కొన్ని సందర్భాలలో కలలుగానే ఉండి పోయాయి.

ఇంతకంటే మంచి ప్రపంచాన్ని రూపొందించుకోవాలన్న కలలు, ఊహలు లేకుంటే మనిషి కూడా మరో జంతువే అవుతాడు. ఊహ లేకుండా

పురోభివృద్ధిలేదు. కొత్త ప్రదేశాలు, కొత్త వస్తువులు. కొత్త విషయాలు కనిపెట్టడం నాగరకత ఉన్నతికి ఎంతో దోహదం చేస్తూ వచ్చింది. అయితే, ప్రజలు ఒకరిపట్ల మరొకరు ఏవిధంగా ప్రవర్తిస్తున్నారన్నది కూడా నాగరకతకు చాలా ముఖ్యం.

యుద్ధాన్ని నివారించడానికి, జాతుల మధ్య శాశ్వత శాంతిని స్థాపించడానికి అత్యుత్తమ రాజకీయ వ్యవస్థను రూపొందించాలని ఎన్నో దేశాలలో, ఎన్నో కాలాలలో ఎందరో ఊహాశాలురు ప్రయత్నించారు. వారి భావాలను, వారి పథకాలను పరిశీలింపునాము.

స్థలా భావంవల్ల మనం కొన్ని ముఖ్యమైన పథకాలను-అవికూడా సంక్షిప్తం గానే-సమీక్షింపువాం. వాటిలో కొన్ని నిజంగా ఎంతో "ఆధునికంగా" కనిపిస్తాయి. ఐక్యరాజ్య సమితి అవతరణకు ఎంతో పూర్వమే అటువంటి పథకాలు ఉన్నాయంటే ఆశ్చర్యంగా ఉంటుంది. వాటిలో కొన్నింటిని ఈ కాలపు వ్యవస్థలతో పోల్చి చూడడం ప్రయోజనకరంగా ఉంటుంది.

## శాంతి పథకాల తోరణం

(పథకాన్ని రచించిన వ్యక్తి పేరుతోపాటు అతడు దానిని రచించిన సంవత్సరం కూడా బ్రాకెట్లో పేర్కొన్నాము.)

పియర్‌డు బోయిస్ (1307) రెండు శతబ్దాల పాటు హోరాహోరీగా, నిర్విరామంగా "పవిత్ర యుద్ధాల"తో యూరప్ ప్రజలు విసుగెత్తిపోయిన తరుణంలో పియర్‌డు బోయిస్ ఈ క్రూరచేష్టలను అంతం చేయడానికి ఎవరో ఒకరు పూనుకోవలసిన అగత్యం ఉందని భావించాడు 'యూరప్ శాంతి'అనే ఒక పథకాన్ని అతడు రచించాడు వివిధ జాతుల మండలి (Council of Nativas) ఒకటి ఏర్పాటు కావడం అవసరమనీ, యుద్ధం ప్రారంభించడానికి ముందు శాంతి కావాలా? యుద్ధం కావాలా? అనే విషయాన్ని వోటింగుద్వారా తేల్చాలనీ అతడు తనపథకంలో

సూచించాడు. వివాదాలలో మధ్య వర్తిత్వానికి ఒక శాశ్వత న్యాయస్థానం అవసరమని కూడా అతడు పేర్కొన్నాడు. (మధ్య యుగంలో యూరప్ రాజుల మధ్య వచ్చే వివాదాలకు మధ్య వర్తిగా, లేదా న్యాయమూర్తిగా పోప్ వ్యవహరిస్తూ ఉండేవాడు కాని, అంతకంటే న్యాయమూర్తుల మండలిని ఒకదానిని నియమించడం మంచిదని డు బోయిస్ భావించాడు) ఈ పథకానికి 20 వ శతాబ్దపు ధోరణి కొంత ఉంది. ఎందుకంటే, నిరర్థకమైన యుద్ధాలను కట్టిపెట్టడం వల్ల పొదుపు అయ్యే ధనాన్ని మరిన్ని పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు స్థాపించడానికి ఖర్చు పెట్టాలని డు బోయిస్ సూచించాడు.

డాంటే అలిఘేరి (1309) డాంటే 'రాజ్యం' అనే ఒక పుస్తకాన్ని రచించాడు. భావ స్వాతంత్ర్యాన్ని గురించి అందులో గొప్పగా వ్రాశాడు అయితే, అతడి భావాలు ఆ కాలపు కొన్ని మతబోధలకు విరుద్ధంగా ఉన్నాయని ఆ పుస్తకాన్ని బహిరంగంగా తగలబెట్టారు. ఆ తర్వాత రెండువందల సంవ



త్సరాలకు గానీ దానిని ప్రచురించడానికి వీలులేక పోయింది. అందులో వెలి బుచ్చిన భావాలు అంత ముందు చూపు గలవి. ప్రజలపై అధికారం చెలా యించడానికి ఒదులు, వారికి సేవ చేయవలసిందని అతడు రాజులకు, చక్ర వర్తులకు సలహా ఇచ్చాడు. ఒకే న్యాయానికి కట్టుబడి జీవించవలసిందని అతడు అన్ని జాతులకు విజ్ఞప్తి చేశాడు. ఈ ప్రపంచ న్యాయశాసనమే జాతుల మధ్య యుద్ధాన్ని నివారించగలదని ఆయన చెప్పాడు. "దేశాల మధ్య న్యాయరీం ప్రవర్తిల్లాలి-యుద్ధం కాదు" అని ఆయన వాదం. అతడి తర్వాత ఐదువందల సంవత్సరాలకు ఇటలీ ఏకీకరణకు కృషిచేసిన గ్విసెప్పీ మాజినీ డాంటే పథకంలోని ప్రధానమైన భావాన్ని క్లుప్తంగా ఇలా చెప్పాడు: "మానవజాతి అంతా ఒకటై తీరాలి .. అట్టి ఏక సమాజానికి ఒక కేంద్ర ప్రభుత్వ వ్యవస్థ, ఒక న్యాయశాసనం ఉండాలి."

ఇరాస్మస్ (1517): మధ్యవర్తిత్వం ద్వారా, శాంతియుత పద్ధతుల ద్వారా వివాదాలను పరిష్కరించుకోవచ్చునని విశ్వసించిన వారిలో ప్రముఖ డచ్ మేధావి ఇరాస్మస్ ఒకడు. యూరప్‌లో ముస్లిములపై క్రైస్తవులు కత్తి కట్టడం, ఆతర్వాత ప్రొటెస్టెంటులపై కాథలిక్కులు కత్తి కట్టడం. ఆపైన ప్రొటెస్టెంటులే ఒకరినొకరు నరుక్కోవడం, చంపుకోవడం ఇరాస్మస్ తన కాలంలో కళ్ళారా చూశాడు. బుద్ధిహీనమైన ఈ కసాయితనం అతడి మనస్సును ఎంతగానో క్షోభ పెట్టింది. చివరికి అతడు "లాభదాయకమైన యుద్ధంకంటే నష్టకరమైన శాంతే మేలు" అనే నిర్ణయానికి వచ్చాడు. ('యుద్ధంలో విజయం సాధించడంకంటే, శాంతి కోసం ఓటమిని అంగీకరించడమే గొప్ప' అని అతడి భావం.) 'శాంతి విజ్ఞాపన' అనే పుస్తకంలో ఇరాస్మస్ రాజులకు, మతగురువులకు, ప్రభువులకు, ఇతర పరిపాలకులకు శాంతిని స్థాపించవలసిందిగా విజ్ఞప్తి చేశాడు. పోప్‌లు, బిషప్పులు, ఇతర మేధావులు ఒక 'న్యాయనిర్ణేతల మండలి'ని రూపొందించాలని అతడు సూచించాడు. ఆ మండలి రాజులమధ్య ఏర్పడే

వివాదాలను పరిష్కరించాలనీ, అప్పుడు ఒక యుద్ధం మరొక యుద్ధానికి దారి తీయడం అనేది ఇక జరగదనీ అతడు చెప్పాడు.

సల్లీ (1595): ఫ్రెంచి రాజకీయవేత్త డక్ డీ సల్లీ రూపొందించిన బృహత్ పథకం మరింత క్లిష్టమైనది. ఆ పథకాన్ని తానే తయారు చేసినట్లు అతడు చెప్పుకోలేదు; కొన్ని సంవత్సరాలక్రితం తాను ఫ్రెంచి రాజు నాల్గవ హెన్రీ నుంచి ఆ భావాన్ని గ్రహించినట్టు చెప్పాడు. ఆ పథకం సారాంశం ఏమిటంటే-మొత్తం యూరప్‌ను 15 దేశాలుగా విభజించాలి. వాటి పరిమాణం దాదాపు సమానంగా ఉండాలి. ఈ దేశాలన్నీ ఒక 'యూరప్ సమాఖ్య'గా రూపొందాలి. ఏ ఒక్క అగ్రరాజ్యం యూరప్‌ను కబళించకుండా చేయడం ఇందులోని ప్రధాన ఆశయం. యూరప్‌కు తూర్పుగా ఉన్న రష్యాను, టర్కీని ఇందులో కలప కూడదు. ఈ సమాఖ్యకు 15 సభ్యదేశాల ప్రతినిధులతో కూడిన శిష్టసభ (సెనేట్) ఒకటి ఉంటుంది. మూడు సంవత్సరాల కొకసారి దానికి నూతన ప్రతినిధులను ఎన్నుకుంటారు. ఈ సమాఖ్య ఒక పార్లమెంటులాగా సమావేశమై, సభ్య దేశాల మధ్య పౌర సంబంధమైన, మతసంబంధమైన వివాదాలను పరిశీలించి పరిష్కరిస్తుంది. ఈ సమాఖ్య అదుపులో కొంత సైన్యం ఉంటుంది. ఇందులో సభ్యదేశాలన్నింటి సైనికులు సమానంగా ఉంటారు. యూరప్ లోని వివిధ ప్రాంతాలలో ఉండి, ప్రాంతీయ సమస్యలను పరిశీలించడానికి ఆరు చిన్న సంఘాలు ఉంటాయి. సల్లీ కాలానికి తర్వాత వచ్చిన "బలాబలాల సమతూకం" (Balance of Power) పద్ధతికంటే, ఈ "బృహత్ పథకం" యూరప్‌కు ఎంతో మేలు చేసి ఉండేది. బలాబలాల సమతూకం వల్ల శాంతి నెలకొంటుందనే భ్రమ యూరోపియన్ రాజకీయవేత్తలకు మూడు శతాబ్దాలపాటు మోసగించింది. చివరకు రెండు ప్రపంచ యుద్ధాలు సంభవించడంతో ఆ భ్రమ విచ్చిపోయింది. సల్లీ రూపొందించిన పథక స్వరూపం ఈ పక్క పటంలో మాదిరిగా ఉండేది.




ఎమెరిక్ క్రూస్ (1623) ఇతడు ఫ్రాన్స్ దేశీయుడు. తన పూర్వులకంటె ఎంతో విశాల దృక్పథంతో ఆలోచించాడు. అతడి ఆలోచన యూరప్‌కు మాత్రమే పరిమితం కాలేదు. భారతదేశాన్ని, చైనాను కూడా చేర్చి, ఒక ప్రపంచ సమితికి పథకం రూపొందించాడు. (ఇది జరిగి మూడువందల సంవత్సరాలు దాటింది) యుద్ధాలు సంభవించడానికి గల ఆర్థిక కారణాలను గురించి తత్కాలానుగుణమైన భావాలెన్నో అతనికి ఉన్నాయి. అవి ఈనాడు మనం వార్తాపత్రికలలో చదివే వార్తలలాగా ఉండేవి. "స్వేచ్ఛా వ్యాపారాన్ని" ప్రోత్సహించడం అతని ప్రపంచసమితి లక్ష్యం. అంటే, ఒక దేశపు సరకులపై మరొకదేశం దిగుమతి సుంకాలు విధించకుండా, అన్ని దేశాలు అంగీకారానికి రావడం శాంతి సాధనకు వాణిజ్య సహకారం అతి ముఖ్యమని అతడు విశ్వసించాడు. ఆహారం, స్నేహం లేకపోవడమే పెక్కు అంతర్జాతీయ వివాదాలకు మూలకారణమని క్రూస్ స్పష్టంగా గుర్తించాడు. అతడు సూచించిన ప్రపంచ సమితికి ఒక

శాశ్వతమండలి ఉంటుంది. అది ఒక తటస్థనగరంలో సమావేశమవుతూ ఉంటుంది. రెండు ఇతర దేశాల మధ్య సంభవించే వివాదాలలో ఏ పక్షాన్నీ సమర్థించ ఎవా సౌనందహించేది తటస్థ నగరం. ఇటువంటి నగరంగా వెనిస్‌ను అతడు సూచించాడు. మండలి వోటింగు పెట్టి అధిక సంఖ్యాక పక్ష్యాల అభిప్రాయం ప్రకారం వివాదాలను పరిష్కరిస్తుంది. చర్చలు విఫలమైతే, సంఘర్షణ సంభవిస్తే దానిని అణచివేయడానికి, క్రమస్థితిని కాపాడడానికి "ప్రపంచ పోలీసు దళం" ఒకటి ఉంటుంది

హ్యూగో గ్రోషియస్ (1625): రినైసాన్స్ తర్వాత వెలువడిన గ్రంథాలలో విశేష సంచలనం కలిగించిన వాటిలో గ్రోషియస్ రచించిన "శాంతి, యుద్ధాల న్యాయ సూత్రలు" అనే పుస్తకం ఒకటి, ఇతడు హాలెండ్ న్యాయవాది, రాజకీయ వేత్త ముప్ఫయి సంవత్సరాల యుద్ధం వల్ల ఏర్పడిన బీభత్సభయానక పరిస్థితులను చూసి, అతడి మనస్సు క్షోభ పడింది. "యుద్ధాన్ని రూపుమాపి, న్యాయాన్ని ప్రతిష్ఠించడం" తన జీవిత ధ్యేయంగా పెట్టుకున్నాడు యూరప్ ఖండాన్ని అంతటినీ కల్లోలితం చేసిన దారుణ యుద్ధాల వల్ల అతడు స్వయంగా ఎన్నో బాధలు పడ్డాడు. అనేకసార్లు శత్రువులు అతడిని స్వదేశం నుంచి తరిమి వేశారు. ఒకసారి ఒక పెద్ద పెట్టెలో కూర్చుని రహస్యంగా జైలులో నుంచి బయటపడ్డాడు. కాబట్టి..అతడు ఏది చెప్పినా స్వానుభవాన్ని పురస్కరించుకునే చెప్పాడు. మానవజాతికి శాంతిని ప్రసాదించాలంటే, వివిధజాతుల మధ్య వివాదాలను న్యాయంగా, పక్షపాత రహితంగా పరిష్కరించడానికి పూర్వపు గ్రీకు, రోమన్ మేధావులు, మధ్య యుగంనాటి క్రైస్తవ తత్త్వవేత్తలు ఎటువంటి సూచనలు చేశారో, వాటినన్నింటినీ సంఘటిత పరచడానికి గ్రోషియస్ ప్రయత్నించాడు. అంతర్జాతీయ సమస్యలు ఉత్పన్నమైనప్పుడల్లా వివిధ దేశాల న్యాయ స్థానాలలో ఇప్పటికీ గ్రోషియస్ చెప్పిన సూత్రాలను ఉద



హరిస్తూ .ంటారు. మధ్య వర్తిత్వం ద్వారా దేశాల మధ్య వివాదాలను పరిష్కరించడానికి గ్రోషియస్ కొన్ని సూత్రాలు రూపొందించాడు. "మధ్య వర్తిత్వం" అనే మాటను ఈ అధ్యాయంలో చాలాసార్లు ఉపయోగించాము. ఇది చాలా ముఖ్యమైన పదం (19 వ శతాబ్దంలో 'మధ్యవర్తిత్వం' నిర్వహించిన పాత్ర ఎటువంటిదో 8 వ అధ్యాయంలో వివరంగా తెలుసుకుందాం. గ్రోషియస్ ఊహించిన 'ప్రపంచ న్యాయస్థానం' 20 వ శతాబ్దంలో ఎలా వాస్తవరూపం దాల్చిందో 9 వ అధ్యాయంలో చూద్దాం )

విలియం పెన్ (1693) ఇతడు పాత, కొత్త ప్రపంచాల మధ్య వారధి వంటి వాడు. ఇంగ్లండ్‌లో పుట్టి పెరిగినవాడు, పెన్సిల్వేనియాను కనిపెట్టినవాడు. ఇతడు సమకాలంలోను భవిష్యత్తులోను "యూరప్ శాంతి" అనే గ్రంథాన్ని అట్లాంటిక్ సముద్రానికి అవతలి దేశాలు, ఇవతలి దేశాలు కూడా చదివాయి దానికి విశేషమైన ప్రచారం లభించింది యూరప్ అంతటికీ ఒక సమష్టి పార్లమెంటులో స్థాపించాలని అతడు ప్రతిపాదించాడు.

యూరప్‌లోని ముఖ్యమైన దేశాల ప్రతినిధులు ఆ పార్లమెంటులో ఉంటారు. ఏ దేశానికి ఎంతమంది ప్రతినిధులు ఉంటాలన్నది తన దృష్టిలో ఆయా దేశాల "ప్రాముఖ్యా"న్ని బట్టి నిర్ణయించాడు. ఆ దేశాల పేర్లను, వాటి ప్రతినిధుల సంఖ్యను అతడు ఇలా సూచించాడు.




| | |
|---|---|
| ఆస్ట్రియా సామ్రాజ్యం | — 12 మంది ప్రతి నిధులు |
| ఫ్రాన్స్ | — 10 మంది ప్రతి నిధులు |
| స్పెయిన్ | — 10 మంది ప్రతి నిధులు |
| ఇటలీ | — 8 మంది ప్రతి నిధులు |
| ఇంగ్లండ్ | — [illegible] మంది ప్రతి నిధులు |
| టర్కీవారు | — 10 మంది ప్రతి నిధులు |
| మాస్కోవారు | — 10 మంది ప్రతి నిధులు |

చివరి రెండు దేశాల సంగతి అతడు ఖచ్చితంగా చెప్పలేదు. (మాస్కోవారు అంటే రష్యనులని అతడి ఉద్దేశం.) వాటికి కూడా సభ్యత్వం ఉండాలని చెప్పాడు. కాని, అవి యూరప్‌కు చెందినవని అతడు భావించలేదు. "రాజులకు, ప్రజలకు" మధ్య స్నేహమే ఏ శాంతి పథకాని కైనా గట్టి పునాది కాగలదని అతడు చెప్పాడు. అటువంటి పథకంవల్ల లభించే ప్రయోజనాలను - అందులో సభ్యత్వంగల దేశాలన్నీ - పంచుకుం టాయి.' ఈ ప్రయోజనాలలో కొన్ని ఇవి అని అతడు సూచించాడు.

(1) మానవ రక్తపాతాన్ని; క్రైస్తవ రక్తపాతాన్ని అరికట్టడం;
(2) యుద్ధంవల్ల సంభవించే ఆస్తి నష్టాన్ని అరికట్టడం;
(3) యుద్ధాన్ని నివారించడంవల్ల మిగిలెడు ధనం పొదుపుకావడం;
(4) యూరప్ అంతటా ప్రయాణాలకు స్వేచ్ఛ లభించడం.

సభ్యదేశాలన్నీ తమ సైనిక శక్తిని ఏకం చేయడానికి వాగ్దానం చేయాలి. కయ్యానికి కాలు దువ్వే దేశమేదైనా ఉంటే దాని వివాదాలను యూరప్ పార్లమెంటుకు నివేదించాలని దానిని బలవంతం చేయాలి. నాలు గింట మూడువంతుల వోట్ల అధిక సంఖ్యా బలంతో పార్లమెంటు ఏ నిర్ణ యాన్ని సమర్థిస్తే, ఆ నిర్ణయాన్ని పాటించి తీరాలి. ఈ పార్లమెంటులోని ప్రతినిధులందరూ లాటిన్, ఫ్రెంచి భాషలను అంతర్జాతీయ భాషలుగా ఉపయోగించాలి.

అబేడి సెయింట్-పియర్ (1716): దేశాల మధ్య సంధి ఒడం బడికలు నిష్ప్రయోజకములు కావడం చూసి సెయింట్ పియర్ "శాశ్వత శాంతికి పథకం" అనే పుస్తకాన్ని వ్రాశాడు. ఆ పథకం చాలా వివరంగా ఉంది. దాని ప్రతులను ఆ కాలపు రాజకీయ నాయకులందరికీ పంపాడు. 1713 లో, హాలెండ్‌లోని ఉట్రెచ్‌లో జరిగిన శాంతి మహాసభకు హాజ రైన రాజకీయవేత్త లందరిచేత దానిని క్షుణ్ణంగా చదివించడానికి అతడు

ముఖ్యంగా ప్రయత్నించాడు యూరప్‌లో వరసవెంబడి పెక్కు యుద్ధాలు జరిగి, ఎంతో కల్లోలం, విధ్వంసనకాండ చెలరేగిన తర్వాత ఆ మహా సభ జరిగింది. పరిపాలకుల మధ్య స్నేహం ఉన్నప్పుడే ప్రపంచంలో శాంతి ఉంటుందని అతడు భావించాడు. అందుచేత, ప్రజల సంఘం కాక, 'రాజుల సంఘం' ముఖ్యమని అతడు ప్రతిపాదించాడు. "ప్రజలమైన మనము" అనే మాట ఆ రోజుల్లో వినిపించేది కాదు. అప్పటికి ఆ భావం పుట్టలేదు. తాము ఎటువంటి ప్రపంచాన్ని కోరుతున్నారో చెప్పే యోగ్యత ఆ రోజుల్లో సామాన్య ప్రజలకు లేదు. మనం ఈనాడు చెప్పుకుంటున్న "ప్రతినిధుల ప్రభుత్వం" అప్పటికి అవతరించలేదు. దురాక్రమణదారుల దాడులనుంచి సరిహద్దులకు భద్రత కల్పించడమే సెయింట్‌పియరీ సూచించిన 'రాజుల సంఘం' యొక్క ప్రధాన ప్రయోజనం. ఇతడి పథకంలో కూడా ఒక శిష్టసభ (సెనేట్) ఉన్నది. ఒక 'శాంతి నగరం" దానికి కేంద్రస్థానంగా ఉంటుంది. దాని సమావేశాలు ఎక్కువగా అక్కడే జరుగుతాయి. ఈ శిష్టసభలో 24 దేశాలకు చెందిన 24 మంది ప్రతినిధులు ఉంటారు. ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క వోటు ఉంటుంది. ఈ శిష్ట సభకు ఒక అధ్యక్షుడు ఉంటాడు. అతడి పేరు "శాంతి రాజు". ఇతడు కాక, ఈ రాజుల సంఘపు సైన్యాలన్నింటికీ ఒక సేనాధిపతి ఉంటాడు. ఇక, అధిక సంఖ్యాకుల వోట్ల ప్రకారం (నాలుగింట మూడు వోట్లు) వివాదాలను పరిష్కరించే న్యాయమూర్తులు కొందరు ఉంటారు. వీరి నిర్ణయాలను దేశాలు తప్పనిసరిగా పాటించేటట్లు చేసే పని సైన్యానిది. దేశాలు ఈ సైన్యం మాట వినకపోతే యుద్ధం చేయవలసి వస్తుంది. ఆ యుద్ధానికి అయిన ఖర్చు అంతా ఆ దేశాలు చెల్లించవలసి ఉంటుంది. వ్యక్తులు ఎవరైనా శాంతిని భగ్నం చేస్తే వారికి మరణశిక్ష గానీ, యావజ్జీవ కారాగార శిక్ష గానీ విధించబడుతుంది.

జీన్ జాక్విస్ రూసో (1761): ఫ్రెంచి విప్లవ కాలపు ప్రముఖ మేధావి రూసో రచించిన పథకం పేరు "శాశ్వత శాంతి" పథకం. అది ఎక్కువగా సెయింట్ పియరీ పథకానికి నకలు అని చెప్పవచ్చు. రూసో తన పథకాన్ని ఐదు అధ్యాయాలలో వివరించాడు. ఆ పుస్తకాన్ని ఒక సంధి రూపంలో రచించాడు.

పథకంలోని ప్రధానాంశాలు ఇవి.

(1) శాశ్వతమైన యూరప్ సమిష్టి పార్లమెంటు స్థాపన ;

(2) సభ్యదేశాలు కోటాల పద్ధతిపై ధనం చెల్లించడం ;

(3) సంధి కుదుర్చుకునే సమయంలోనే అన్ని సరిహద్దులను నిర్ణయించడం, వాటికే స్థిరంగా కట్టుబడి ఉండటం ;

(4) సంధి షరతులను ఉల్లంఘించిన దేశంపై మిగతా దేశాలన్నీ సమైక్యంగా చర్య తీసుకోవడం ;

(5) యూరప్‌లో ఎటువంటి మార్పులు చేయాలన్నా, అందుకు సమిష్టిపార్లమెంటులో మూడింట రెండు వంతుల వోట్లు సంపాదించుకోవాలన్న షరతు పెట్టడం.

జెరెమిా బెన్‌థామ్ (1793). ఇంగ్లండ్ దేశానికి చెందిన ఈ మేధావి అనేక విషయాలపై అనేక పుస్తకాలు రచించాడు. వాటిలో కొన్ని ఈ నాటికీ ముద్రితం కాలేదు. "విశ్వశాంతికి పథకం" అనే పుస్తకంలో అతడు ప్రపంచం గురించి తన అభిప్రాయాలను వెల్లడించాడు. అఖిలజాతి మహాసభను ఒకదానిని స్థాపించాలని అతడు ప్రతిపాదించాడు. ఆ మహాసభలో అంతర్జాతీయ సమస్యలను మాత్రమే చర్చిస్తారు. ఎందుకంటే అన్ని దేశాలు శాంతికోసమే కృషి చేస్తున్నాయి కనుక. 'సమాచార స్వాతంత్ర్యం' అతి ముఖ్యమని అతడు పదే పదే నొక్కి చెప్పాడు. సుహృద్భావంగల



వ్యక్తులు వాస్తవ పరిస్థితులను దర్శించినప్పుడే వారు సమంజసమైన ఒప్పందాలు కుదుర్చుకోగలుగుతారనీ, ఒకరి దృక్పథాన్ని మరొకరు సరిగా, సంపూర్తిగా అర్థం చేసుకొనకపోవడమే దేశాల మధ్య సంఘర్షణకు ప్రధాన కారణమనీ బెన్‌థామ్ చెప్పాడు. వివాదాలు సంభవించినప్పుడు వాటిని ఒక అంతర్జాతీయ న్యాయస్థానం ద్వారా పరిష్కరించాలి. ఈ న్యాయస్థానంలో అనుభవజ్ఞులైన న్యాయమూర్తులను నియమించాలి. వారు ఉభయ పక్షాల వాదాలను సావధానంగా విని తీర్పు చెబుతారు ఆ తీర్పును శిరసావహించడానికి అన్ని దేశాలు ముందుగానే ప్రమాణం చేయాలి.

ఇమాన్యుయల్ కాంట్ (1795)· ఇతడు జర్మన్ తత్త్వవేత్త. "బలా బలాల సమతౌల్యం" పద్ధతి వల్ల అగ్ర రాజ్యాల మధ్య శాంతి నెలకొనదని అతడు ప్రకటించాడు. ఆ తర్వాత. స్వతంత్ర దేశాల సమాఖ్యకు ఒక పథకాన్ని రూపొందించాడు. "శాశ్వత శాంతికి" అనేది ఇతడి పుస్త

కం వేసు కొద్ది వారాల వ్యవధిలో ఆ పుస్తకం 1500 ప్రతులు అమ్ముడై పోయింది ఆ రోజుల్లో అది చాలా ఎక్కువ. అప్పటినుంచి అది అనేక భాషలలోకి తర్జుమా అయింది. ఇప్పటికి ఎన్నో ముద్రణలు వెలువడినాయి. తాను కోరుతున్నదేమిటో కాంట్‌కు స్పష్టంగా తెలుసును. రహస్య సంధు లకు అతడు వ్యతిరేకి. ('సంధి' అనే పదాన్ని ఇప్పటికే చాలాసార్లు ఉప యోగించాము దేశాలమధ్య కుదిరే న్యాయసమ్మతమైన ఒప్పందాలను సంధులని వ్యవహరిస్తారు) సమాఖ్యలో సభ్యత్వంగల ఏ దేశానికీ స్వంత సైన్యం ఉండడానికి వీల్లేదనీ, అన్నింటి సేనలు కలిసి ఒకే సేనగా రూపొం దాలనీ. అది సమాఖ్య పర్యవేక్షణ క్రింద ఉండాలనీ కాంట్ ప్రతిపాదిం చాడు ఒక దేశం మరొక దేశపు ప్రభుత్వ వ్యవహారాలలో జోక్యం చేసు కోడానికి వీలు లేదు. అన్ని ప్రభుత్వాలు ఒక అంతర్జాతీయ శాసనానికి కట్టు బడి ఉండాలి ప్రపంచంలోని స్త్రీ పురుషులందరి హక్కులను ప్రభుత్వాలు గుర్తించాలి—ఎందుకంటే వారు ప్రపంచ పౌరులు కనుక.

## ఐదు శతాబ్దాల కలలు, ఊహలు

1307 లో పియిరీడు బోయిస్‌తో మొదలుపెట్టి, 1795 లో ఇమాన్యు యల్ కాంట్ వరకు—దాదాపు ఐదు శతాబ్దాల కథను మనం ఈ అధ్యా యంలో చెప్పుకున్నాము. ఈ సుదీర్ఘ కాలంలో ఈ మేధావులు—యుద్ధ భయం లేకుండా శాంతిని సుస్థిరం చేయడానికి కృషి చెయగల నాగరికతను సృష్టించడానికి ఆలోచనలు సాగించారు. పథకాలు వేశారు.

వారి పథకాలలో చాలా కొద్దివాటిని మాత్రమే మనం చెప్పు కున్నాము. వీరందరూ వేర్వేరు దేశాలకు చెందినవారు. ఇంకా పెక్కు దేశా లలో ఇలాగే ఆలోచించినవారు, పథకాలు వేసినవారు చాలామంది ఉన్నారు. కాని, వారు చెప్పిన విషయాలు దాదాపు మనం పైన చూసిన విషయాల మాదిరిగానే ఉంటాయి. తమ శ్రమకు ఫలితాన్ని కళ్ళారా చూడకుండానే



మరణించిన ప్రవక్తలున్నారు. వారి పథకాలు, వారి కలలు కేవలం కాగితాల మీదనే ఉండిపోయాయి. అవి వారి కాలపు పరిస్థితులకు, విజ్ఞానానికి పరిమితమైపోయాయి. కాని, మనం వచ్చే రెండు అధ్యాయాలలో ప్రస్తుత శతాబ్దానికి వచ్చేసరికి, గత శతాబ్దాల కలలు క్రమ క్రమంగా ఎలా వాస్తవ రూపానికి వచ్చాయో చూడగలుగుతాము.

ఈ స్వాప్నికులు తమ కలలను తోటివారికి చెప్పకుండా ఉన్నట్లయితే, వారి భావాలు వారిలోనే అణగిపోయేవి; ఈ పుస్తకంలో మూడవ భాగం వ్రాయవలసిన అవసరం ఉండకపోయేది.

వంద సంత్సరాల క్రితం మరొక మేధావి విక్టర్ హ్యూగో చెప్పిన ఒక వాక్యంతో ఈ అధ్యాయాన్ని ముగించుదాం—"నవ్య భావోదయం కంటే శక్తివంతమైనది ప్రపంచంలో వేరొకటి లేదు!"

# 7

## శాస్త్రజ్ఞులు

జెట్ విమానాలు, టెలివిజన్ సెట్లు, మిన్నంటే మేడలూ గల నేటి నాగరకతకూ, చిన్న చిన్న కొయ్య ఓడలు, ఇంటిలో నేసిన ముతక వస్త్రాలు, వెలుగులోకి రాని ఖండాలు గల కొలంబస్ కాలపు నిత్యజీవన పరిస్థితులకు మధ్య ఎంత తేడా ఉన్నదో ఊహించడం కూడా కష్టం.

నాటికీ నేటికీ మధ్య సామాన్య ప్రజలు పెక్కుసార్లు తమ దృక్పథాలను, తమ అలవాట్లను మార్చుకోవలసి వచ్చింది. ఈ మార్పులకు ప్రధాన కారణం 'విజ్ఞాన శాస్త్రం'. ఈ అధ్యాయంలో మన సమీక్ష 'వైజ్ఞానిక విప్లవం' (చరిత్రకారులు పెట్టిన పేరు)తో ప్రారంభమవుతుంది. ఈ వైజ్ఞానిక విప్లవమే దరిమిలా 'పారిశ్రామిక విప్లవా'నికి దారి తీసింది.

అయితే, అసలు విజ్ఞాన శాస్త్రం అంటే ఏమిటో తేల్చుకుందాము.

మన చుట్టూగల భౌతిక ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానాన్ని ఒక క్రమంలో కూర్చిన శాస్త్రం విజ్ఞాన శాస్త్రం. దీనినే రసాయన శాస్త్రం.

భౌతిక శాస్త్రం, భూగర్భ విజ్ఞాన శాస్త్రం, జీవ శాస్త్రం మొదలయిన ప్రత్యేక శాస్త్రాలుగా విభజించవచ్చును.

## సత్యమేవ జయతే

అయినప్పటికీ, విజ్ఞాన శాస్త్రం అంటే కేవలం విశ్వాన్ని గురించిన విజ్ఞాన విషయాల పట్టిక మాత్రమే కాదు. అది ఒక మనో దృక్పథం—ఆ యా విషయాలను దర్శించే విధానం. అది ఒక సత్యాన్వేషణ. శాస్త్రీయ దృక్పథం అంటే – విజ్ఞానాన్ని విజ్ఞానంకోసమే ఆరాధించడం. దాని ఫలితాలను మానవ సంక్షేమంకోసం వినియోగించాలని ఆకాంక్షించడం. 'విశ్వ శ్రేయ సాధనే విజ్ఞానం' అనే భావన అది.

అభిప్రాయాలు ఏర్పరచుకోవడంలో 'వేగిరపాటు' (ఒక విషయాన్ని పరిశీలించకుండానే దానిపై ఒక అభిప్రాయానికి రావడం), 'అసహనం' (అవతలి వ్యక్తి అభిప్రాయాలను అర్థం చేసుకోడానికి నిరాకరించడం) శాస్త్రీయ పద్ధతిక వ్యతిరేకమైనవి. ఈ వేగిరపాటు, అసహనం పెక్కు సంఘర్షణలకు, యుద్ధాలకు దారి తీశాయి శ్రద్ధగా పరిశీలించి, పరిశోధించి 'నిజాల'ను నిలకడమీద తేల్చుకోవడం శాస్త్రీయ పద్ధతి. పరిశోధనా ఫలితాలను తార్కిక వాదంతో, ప్రయోగంతో పరీక్షించి చూస్తుంది అది. "అన్నింటినీ తడిమి చూడు ; ఏది నిజమో దాన్ని గట్టిగా పట్టుకో" అని ఒక సూక్తి ఉంది.

అయితే, ఇంత శ్రమతో కూడిన పద్ధతి అందరికీ నచ్చదు. ఇంతకంటే పెద్దలు చెప్పిన దానికి తల ఊపడం, ఏటి వాలులో యీదడం, నలుగురు నడిచిన దారిలో నడవడం చాలా తేలిక అని భావిస్తారు. గత శతాబ్దాలలో విజ్ఞాన విషయాలు కనిపెట్టిన మేధావులందరూ సాంప్రదాయిక భావాలకు ఎదురు తిరిగి ఎన్నో కష్టాలకు లోనయ్యారు. కొందరు ప్రాణాలు



కోల్పోయారు. మరి కొందరు స్వేచ్ఛను కోల్పోయారు. ప్రజల మనస్సులను మార్చాలని ప్రయత్నించడం కోరి విరోధాన్ని తెచ్చిపెట్టుకున్నట్లే అవుతుంది—ఒక్కొక్కప్పుడు మరీ అపాయకరమవుతుంది. కాని, నిజం నిలకడమీద తేలుతుంది. ఆ నిజాన్ని అణగద్రొక్కాలని ప్రయత్నించేవారు వెల్లికిలా పడతారు.

## విశ్వశ్రేయసాధనే విజ్ఞానం

ఆదికాలం నుంచి మనిషి తన పరిసరాలను గురించి కొత్త కొత్త సత్యాలను ఎన్నింటినో తెలుసుకుంటూ వస్తున్నాడు. శతాబ్దాల గమనంలో అంతకంతకు శాస్త్ర విజ్ఞానం విస్తృతమయింది. కాని, గడచిన 20 సంవత్సరాలలో మనిషి పరిసరాలలో వచ్చినన్ని మార్పులు చరిత్రలో ఎన్నడూ రాలేదు.

ఈ అధ్యాయంలో మనం రెండు దృక్పథాలనుంచి యీ పరిణామా లను పరిశీలించాలి. మొదటిది విదేశాలకు, వివిధ కాలాలకు చెందిన శాస్త్రజ్ఞులు ఒకరి విజ్ఞానాన్ని మరొకరు ఏ విధంగా అందిపుచ్చుకున్నారన్న విషయం. రెండవది, వారు సృష్టించిన వస్తువులవల్ల, కనుగొన్న విషయాల వల్ల నేటి ప్రజల జీవన ప్రమాణం ఏ విధంగా పెరిగిందన్న విషయం. ముందు అధ్యాయాలలో మనం భవిష్యత్తును గురించి ప్రశ్నించుకోవలసింది —"యీ వైజ్ఞానికి సహకారంవల్ల లభించిన, లభించగల అసంఖ్యాక ప్రయోజనాలను ప్రపంచ ప్రజలు యావన్మందికీ పంచిపెట్టడం ఎలా ?" అనేది.

ముఖ్యంగా గమనించదగిన మొదటి విషయం ఏమిటంటే—విజ్ఞాన శాస్త్రానికి జాతి, మతం, భాష,వర్ణం, తెగ మొదలయిన భేదాలతో నిమిత్తం లేదు. అది వీటికి అతీతమైనది. శాస్త్ర విజ్ఞానమంతా తన సొత్తు అని ఏ ఒక్కదేశమూ చెప్పజాలదు. అలాగే, విజ్ఞాన శాస్త్ర విషయాలను కను గొనడంలో తాము 'నాయకత్వం' వహిస్తున్నామని ఏ ప్రత్యేక వర్గంవారు నిశ్చితంగా చెప్పకోలేరు. అయితే, కొద్దికాలంపాటు ఒకరు మిగతావారి కంటే ముందు ఉండవచ్చు. ఇతర శాస్త్రజ్ఞులు కూడా వీరిని అందుకున్నా, లేక వీరిని దాటి ముందుకు పోయినా, వీరి నాయకత్వం అక్కడితో సరి. కాబట్టి, శాస్త్ర విజ్ఞానం అన్ని దేశాలదీ, అన్ని కాలాలదీ కలగా పులగం అయిపోతూ వుంటుంది. అది విశ్వజీవనమైనది ; మానవ జాతి అంతటికీ చెందిన సంపద.

శాస్త్ర విజ్ఞానం—ఏ యే దేశాల కృషి ఫలితమైనా—ప్రధానంగా యూరప్‌ద్వారా నేటి ప్రజలకు చేరిందని భావించడం కూడా తప్పే. నిజానికి చాలా శతాబ్దాలకు పూర్వం, శాస్త్ర విజ్ఞానం భారతదేశం నుంచి, చైనా నుంచి యూరప్‌కు చేరింది. ఇంకా పూర్వం బాబిలోన్‌నుంచి—మధ్యప్రాచ్యం

లోగల అరబ్బులద్వారా — వచ్చింది. మధ్య యుగంలో ముస్లిం దేశాలలో శాస్త్ర పరిశోధనలు కొనసాగాయి; కల్లోల నిలయమైన యూరప్‌లో మాత్రం వాటిని పట్టించుకున్నవారెవరూ లేకపోయారు.

అయితే, 15 వ శతాబ్దంలో రినైసాన్స్‌తో పాటు వైజ్ఞానిక విప్లవం ప్రారంభమయింది. మనం యిప్పుడు 'ఆధునిక విజ్ఞాన శాస్త్రం' అంటున్న దానికి అదే ప్రారంభం. రినైసాన్స్ కాలంలో—ముఖ్యంగా ఖగోళశాస్త్రం, భౌతిక శాస్త్రం, వైద్య శాస్త్రం విశేషంగా పురోగమించాయి. వీటిలో ఎన్నెన్నో కొత్త విషయాలు కనిపెట్టడం, కొత్త వస్తువులు సృష్టించడం జరిగింది. వీటిని గురించి ముందు పేజీలలో వివరంగా చెప్పుకుందాం. ఈ లోగా—అసలు శాస్త్ర విజ్ఞానం ఇతర దేశాలనుంచి యూరప్‌కు ఎలా చేరిందో తెలుసుకుందాం.

## భారతదేశం నుంచి అంక గణితం

ప్రాచీన భారతదేశం నుంచి (లేక భారతదేశం ద్వారా) శాస్త్రీయ పద్ధతి పాశ్చాత్య దేశాలకు వచ్చింది శాస్త్రీయ పద్ధతి అంటే ఇది: పరిశీలించడం, ప్రయోగం చేయడం, తర్వాత కొన్ని నిర్ణయాలకు రావడం, ఫలితాన్ని ఊహించడం, మళ్ళీ ప్రయోగం చేసి ఊహించిన ఫలితం సరియైనది అవునో కాదో తేల్చుకోవడం.

ఉదాహరణకు, క్రీస్తుశకం ఆరవ శతాబ్దంలో వైదిక వాఙ్మయం కాలమానానికి సంబంధించిన ఖచ్చితమైన లెక్కలు యిచ్చింది; భూమి తన ఇరుసుపై ఏ విధంగా పరిభ్రమిస్తున్నదో వర్ణించింది; సూర్య గ్రహణానికి సరియైన వివరణం యిచ్చింది.

సంస్కృతంలో రచించిన బౌద్ధ రచనలు పెక్కు వ్యాధులను వర్ణిస్తూ, వాటి చికిత్సా విధానాలను వివరించాయి. జీవకుడనే గొప్ప వైద్య



శాస్త్రజ్ఞుని కథ శాస్త్రీయ పద్ధతికి చక్కని ఉదాహరణంగా ఉంటుంది. ఒక రాజుగారు ఏదో నొప్పితో తీవ్రంగా బాధ పడుతున్నాడు. ఎందరో వైద్యులు వచ్చి పరీక్షించారు గానీ, ఆ నొప్పికి కారణం ఏమిటో వారికి అంతుపట్ట లేదు. అదే మాదిరి నొప్పితో బాధపడి మరొక వ్యక్తి మరణించాడు. వెం టనే జీవకుడు ఆ మృతదేహాన్ని కోసి, లోపల వెతికి చూశాడు. ప్రేగులలో కొన్ని పురుగులు కనిపించాయి. వ్యక్తి బాధకు, మరణానికి అవే కారణ మని తెలుసుకుని, వాటిని చంపగల మందుకోసం ప్రయోగాలు చేశాడు. చివరికి వెల్లుల్లి రసం వాటిని చంపగలదని తెలుసుకున్నాడు. వెంటనే రాజు గారికి వెల్లుల్లి రసం యిచ్చాడు. రాజుగారి రోగం కుదిరింది. ఇది చాలా సులభమైన చికిత్సే. కాని, ఆ చికిత్సా విధానాన్ని కనుగొనడానికి శాస్త్రీయ పద్ధతి అవసరమయింది.

వైద్య శాస్త్రానికి రసాయన శాస్త్ర విజ్ఞానం అవసరం. 12 వ శతాబ్దం నాటికే భారతదేశం రసాయన శాస్త్రంలో ఎంతో అభివృద్ధిసాధించింది. ఈ విజ్ఞానంలో అప్పటికి యూరప్ చాలా వెనకబడి ఉంది. వృక్ష శాస్త్రం, వ్యవసాయ శాస్త్రం కూడా భారతదేశంలో అభివృద్ధి చెందాయి. భూసారం, మొక్కలు, వాటిలో రకాలు, తరగతులు, వాటిని పెంచవలసిన పద్ధతులు— ఇవన్నీ 'ఉపవన వినోద' అనే గ్రంథంలో ఉన్నాయి.

హిందువులు దశాంశపద్ధతిని, 'సున్న'యొక్క ఉపయోగాన్ని కనుగొని,అంక గణితంలో ఒక శకాన్ని సృష్టించారు. అంకెల గణింపును ఎంతో సులభం చేసిన యీ పద్ధతి భౌతిక శాస్త్రాలలో విప్లవాన్ని కొని తెచ్చింది. ఆధునిక అర్థ శాస్త్రానికి కూడా అదే ప్రాతిపదిక అయింది. 12 వ శతాబ్దంలో యూరప్ ఈ భారతీయ పద్ధతిని అరబ్బులద్వారా అందిపుచ్చుకుంది. అంతవరకు యూరప్‌లో ప్రజలు పూర్వపు రోమన్ అంకెలనే వాడుతూ ఉండేవారు. ఒకదాని పక్కన ఒకటి పొడుగ్గా అంకెలు వేసుకుంటూ పోయే రోమన్ పద్ధతి చాలా చికాకుగా వుండేది. భారతీయ దశాంశ పద్ధతివల్ల లెక్కలు, పద్దులు చాలా సులభమైపోయాయి. ఈ లెక్కలు, పద్దులపైనే వాణిజ్యం ఆధారపడి ఉంది. ఈ విధంగా శుద్ధ శాస్త్ర విషయం నిత్య జీవితంలో ఉపయోగానికి వచ్చింది.

## చైనా నుంచి కాగితం

క్రీస్తు శకం ఒకటవ శతాబ్దంలోనే చైనాలో కాగితాన్ని కనిపెట్టారు. సంగ్ సామ్రాజ్యపు ఆరంభ కాలంలో కాగితాన్ని వెదురు నారతో గానీ, మల్బరీచెట్టు నారతో గానీ తయారు చేసేవారు. కాగితం తయారీకి యితర ముడి పదార్థాలను కనుగొనడంతో ఉత్పత్తి పెరిగింది : కర్మాగారాలు నెలకొల్పారు. కాగితం సంగతి యూరప్‌వారికి తెలియడానికి ఎన్నో శతాబ్దాల క్రిందటి విషయం ఇది



ముద్రణ విధానం కూడా చైనావారే ముందుగా కనుగొన్నారు. క్రీస్తుశకం ఎనిమిదవ శతాబ్దంలో చైనాలో ముద్రణ ప్రారంభమయింది. ముద్రణ సౌకర్యం వల్ల బౌద్ధ రచనలు, నిఘంటువులు ఎక్కువగా ప్రచారంలోకి వచ్చాయి. వూహై సామ్రాజ్య కాలంలో కన్ఫ్యూషియస్ మత గ్రంథాలను ప్రభుత్వాధికారులే ముద్రించేవారు. సంగ్ సామ్రాజ్య కాలం నాటికి ప్రభుత్వంతో పాటు వ్యక్తులు కూడా ముద్రణ ప్రారంభించారు. చైనా అంతటా పుస్తకాల వ్యాపారం బాగా పెరిగింది.

గట్టి మట్టి జిగురు కలిపి తయారు చేసిన అచ్చు అక్షరాలను—కరిగించిన మైనం సహాయంతో- ఒక ఇనుప రేకుమీద పేర్చి బిగించే పద్ధతిని పిషెంగ్ అనే అతడు కనిపెట్టాడు. ఆ విధంగా కూర్చిన అక్షరాలపైన కాగితాలు పెట్టి నొక్కేవారు. తర్వాత కొన్నాళ్ళకు, మట్టికి బదులు లోహ

మూతో అచ్చు అక్షరాలను తయారుచేసే పద్ధతి కొరియా వంటి దూర ప్రాంతాలలో సైతం వాడుకలోకి వచ్చింది.

సంగ్ సామ్రాజ్య కాలంలోనూ, ఆ తర్వాతకూడా చైనాలో పెక్కుమంది ఖగోళ శాస్త్రజ్ఞులు, గణిత శాస్త్రజ్ఞులు, దేశ పటాలు తయారు చేసే వారు ఉండేవారు. సుమారుగా క్రీస్తుశకం 1,000 వ సంవత్సరంలో సుసంగ్ అనే అతడు ఖగోళ పరిశోధనలకోసం కొన్ని పరికరాలను కనిపెట్టాడు. వాటిని గురించి వివరించే ఒక పట్టికను తయారు చేశాడు. కొన్ని మండలాల సైన్యంలో వాటి ఉపయోగం వివరిస్తూ ఒక గ్రంథం రచించాడు. రాత్రిపూట ఆకాశంలో నక్షత్రాల గమనం ఏ విధంగా ఉంటుందో వివరించే ఖగోళం నమూనాను అతడు తయారు చేశాడు. ఆ ఖగోళ పరిభ్రమణాన్ని నిర్వహించే మోటారు యంత్రంగా తాను తయారు చేసిన ఒక నీటి గడియారాన్ని ఉపయోగించాడు.

యాత్రికులకు దారి తెలిపేటందుకు అయస్కాంతాన్ని వాడుకలోకి తీసుకు వచ్చినవారు కూడా చైనీయులే. అయస్కాంతాలు ఇనప వస్తువులను ఆకర్షిస్తాయని, అయస్కాంతపు ముల్లు ఉత్తర దక్షిణాలను చూపుతుందనీ క్రీస్తుపూర్వమే తెలిసినప్పటికీ. దానిని యాత్రా సౌకర్యంకోసం ఉపయోగించడం నాల్గవ శతాబ్దంలోనే ప్రారంభమయింది.

తుపాకి మందును మొట్టమొదటగా కనుగొన్నది కూడా చైనావారే. సూరేకారం, గంధకం, బొగ్గుపొడి కలిపి వారు తుపాకి మందును 11 వ శతాబ్దంలోనే తయారు చేశారు. వుచింగ్‌త్సుంగ్‌యావో కాలంలో దానికి సైనిక ప్రాముఖ్యం ఏర్పడింది. ఆ తర్వాత కొన్ని శతాబ్దాలకు పాశ్చాత్యులతో యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు మాత్రమే చైనావారు తుపాకి మందును విరివిగా ఉపయోగించారు అంతకు ముందు వారు దానిని అంతగా ఉపయోగించలేదు.

## అరబ్బులు అందించిన విజ్ఞానం

ఈ ప్రాచీన శాస్త్ర విజ్ఞానం ఎక్కువగా అరబ్బుల (ముస్లిములు) ద్వారా యూరప్‌కు చేరింది. గ్రీస్‌లో యూక్లిడ్ రచించిన రేఖా గణితాన్ని, యీజిప్టులో టాలెమీ రచించిన ఖగోళ శాస్త్రాన్ని 9 వ శతాబ్దంలో అరబ్బులు తమ భాషలోకి అనువదించుకున్నారు. 10 వ శతాబ్దం నాటికి కైరోలోని ముస్లిం ఖగోళ శాస్త్రజ్ఞులు—గ్రీకు గణిత శాస్త్రాన్ని ఆధారంగా పెట్టుకుని—సూర్య గ్రహణాన్ని గురించి, చంద్ర గ్రహణాన్ని గురించి ఇంకా పరిశోధనలు సాగిస్తూనే ఉన్నారు.

ఆ రోజుల్లో అరేబియన్ శాస్త్ర విజ్ఞానం బహుముఖాలుగా ఎంత విస్తృతమయిందో చూడండి: అల్-కిండీ తత్త్వశాస్త్రం, భౌతిక శాస్త్రం బోధించేవాడు. పర్షియన్ వైద్యుడు అబూ-బేకర్-అల్-రజీ పొంగు, మసూచి వ్యాధులను గురించి ఒక గ్రంధం రచించాడు. ఈజిప్టులో ప్రముఖ అరబ్ భౌతిక శాస్త్రవేత్త ఇబ్న్ అల్-హైతాం దృక్శాస్త్రంలో పరిశోధనలు సాగించాడు అతడి రచనలు లాటిన్‌లోకి అనువదింపబడినాయి. చాలా కాలం తర్వాత అవి ఇంగ్లండ్‌లో రోగర్‌బేకర్‌ను విశేషంగా ఆకర్షించాయి. అలాగే అవి ఇతర యూరప్ శాస్త్రజ్ఞులను కూడా ఆకర్షించాయి. అల్-హాజెన్ గణితంలో పరిశోధనలు సాగించాడు ఇబ్నుసినా వైద్య శాస్త్రాన్ని సంగ్రహంగా రచించాడు. అది యూరప్ విశ్వ విద్యాలయాలలో ముఖ్యమైన పాఠ్య గ్రంధం అయింది.

ఇదంతా వెయ్యి సంవత్సరాల క్రిందటి సంగతి. రోమ్ సామ్రాజ్యం అంతరించిన తర్వాత, కాన్‌స్టాంటి నోపిల్‌లో బైజాంటిన్ సామ్రాజ్యం గ్రీకుల వ్రాతప్రతులను చీకటియుగం పొడుగునా భద్రంగా జాగ్రత్త పెట్టింది. యూరప్‌లో రినైసాన్స్ అవతరించేనాటికి అరబ్ శాస్త్రవిజ్ఞానం

గ్రీకు. రోమన్ విజ్ఞానంతో పూర్తిగా కలగాపులగమై పోయింది. ఫ్రాన్స్ లోనూ, ఇంగ్లండ్‌లోనూ చార్లెమేన్, ఆల్ఫ్రెడ్ రాజు పండితులను విరివిగా ప్రోత్సహించారు. వారి చలవ వల్లనే పెక్కు పాఠశాలలు నెలకొన్నాయి ఆవే తొలి విశ్వవిద్యాలయాలైనాయి. ఇటలీలోని పెద్ద నగరాలలో పండితులు వైద్య శాస్త్రం, న్యాయశాస్త్రం, తత్త్వశాస్త్రం పఠిస్తూ ఉండేవారు. అయితే, ఈ నాటి శాస్త్రవిజ్ఞానానికి నిజమైన పునాదులు స్పెయిన్ 10, 11 శతాబ్దాలలో అరబ్బుల హయాంలో వేసింది.

## శాస్త్రవిజ్ఞానాన్ని పదిలపరచిన స్పెయిన్

క్రైస్తవుల హయాంలో ఉన్న యూరప్ అంతా చీకటి యుగంలో యుద్ధాలతో సతమతమవుతూ ఉంటే, శాస్త్రవిజ్ఞానాన్ని భద్రంచేసి, ఆ తర్వాత కాలంలో దానిని 'పాశ్చాత్య నాగరకత'కు అప్పగించినది అరబ్బుల హయాంలో ఉండిన స్పెయిన్, యూరప్‌ను తిరిగి జాగృతం చేసినది అరబ్బులే వారు అందజేసిన శాస్త్రాలలో కొన్ని వారు స్వయంగా రచించినవి, మరికొన్ని వారు వ్యాఖ్యానాలు వ్రాసినవి, మిగిలినవి వారు అనువదించినవి. వారి రచనలు కొన్ని ప్రాచ్య గ్రంథాలకు అరబిక్ భాషలోకి పిమ్మట లాటిన్ లోనికి అనువదించినవి.

అమీర్ అల్-ఆండలస్ తన సంస్థానంలో సాహిత్యాన్ని, శాస్త్రవిజ్ఞానాన్ని, కళలను పెంపొందించడానికి ఎంతగానో కృషి చేశాడు. విజ్ఞాన శాస్త్రాలను అరబిక్ భాషలోనికి అనువదించిన ప్రముఖ యూదు పండితుడు హస్దే-ఇబ్న్-షప్రుత్ అతడికి మంత్రిగా, ఆస్థాన వైద్యుడుగా ఉండేవాడు. కార్డోవా సంస్థానాన్ని పరిపాలించిన మరొక అమీర్ ఒక బ్రహ్మాండమైన గ్రంథాలయాన్ని నెలకొల్పాడు అందులో దాదాపు ఐదు లక్షల గ్రంథాలు ఉండేవి. విజ్ఞాన గ్రంథాలను దొరికినన్ని పట్టుకురావలసిం

దని అతడు తన దూతలను బాగ్దాద్, డమాస్కస్, కెయిరో నగరాలకు, మధ్య ప్రాచ్యంలోని ఇతర నగరాలకు పంపించాడు. శాస్త్ర విజ్ఞానంపట్ల, సంస్కృతిపట్ల అతడికి గల గాఢమైన అభిమానం స్పెయిన్‌లోని సారగోసా, టొలెడో, కార్డోవా, సెవిల్, తదితర సంస్థానాలను పరిపాలించే అరబ్ ప్రభువులకు పరిపాటి అయింది.

ఆ విధంగా-పశ్చిమ రాజ్యాలలో క్షీణించి, అంతరించిపోతున్న శాస్త్ర విజ్ఞానాన్ని ప్రాచ్యదేశాలవారు కాపాడారు. దానిని పునరుద్ధరించారు. ఇలాంటిది మరొకసారి జరగదని మాత్రం ఎవరైనా జోస్యం చెప్పగలరా?

## ముగ్గురు మహా మేధావులు

మధ్య యుగంలో విజ్ఞానశాస్త్రం యూరప్‌లో ఇంకా నేలమట్టాన్ని అంటిపట్టుకునే ఉంది. అరిస్టాటిల్ వంటి పూర్వమేధావులు చెప్పినవాటినే "ప్రమాణం"గా తీసుకుని, వాటినే అంటిపట్టుకుని ఉండిపోయారుగానీ సొంత తెలివితేటలు ఉపయోగించి ఆలోచించి, పరిశోధించి కొత్త విషయాలు తెలుసుకున్నవారు కారు, తెలుసుకుందామనుకున్నవారూ లేరు. ఈ ప్రాచీన సంప్రదాయాల సంకెళ్ళను ఛేదించడానికి, ప్రజల మౌఢ్యాన్ని వదిలించడానికి ఎందరో మహామేధావులు కృషిచేయవలసి వచ్చింది.

అటువంటి పరిస్థితులలో, మూడు దేశాలకు చెందిన ముగ్గురు మహానీయులవల్ల 'వైజ్ఞానిక విప్లవం' ప్రారంభమయింది. వారు - పోలెండ్‌కు చెందిన కోపెర్నికస్, ఇటలీకి చెందిన గెలీలియో, ఇంగ్లండ్‌కు చెందిన న్యూటన్. నిజానికి ఈ ముగ్గురూ కూడా-వారి విద్యా విజ్ఞానాల విషయంలో గానీ, పుట్టి పెరిగిన పద్ధతులలో గానీ-'అంతర్జాతీయత' గలవారు. అసాధారణ ప్రజ్ఞావంతులైన ఈ ముగ్గురు విప్లవకారుల వెనుక ఇంకా




ఎందరో శాస్త్రవేత్తలు విజ్ఞానశాస్త్ర పరిశోధనోద్యమాన్ని బలపరచిన వారూ ఉన్నారు. మధ్యయుగం నుంచి పారిశ్రామిక విప్లవం వరకు మూడు శతాబ్దాలపాటు శాస్త్రపురోభివృద్ధి నిరాఘాటంగా యుక్తవేగంతో సాగిపోవడానికి వీరందరూ కృషిచేశారు.

అప్పటికి ముద్రణ వ్యాప్తి చెందడంవల్ల, రాకపోకల సౌకర్యాలు, సంబంధాలు బాగా అభివృద్ధి చెందడంవల్ల వైజ్ఞానిక ఉద్యమం ప్రపంచ వ్యాప్తమయింది. ఇక్కడ 'సాంకేతిక శాస్త్రం' ప్రసక్తి వస్తుంది. ఇది విజ్ఞాన శాస్త్రాన్ని నిత్యజీవితంలో ఉపయోగానికి తీసుకు వస్తుంది. వైజ్ఞానిక ఉద్యమంతోపాటు సాంకేతిక శాస్త్రజ్ఞుల ప్రాముఖ్యం పెరుగుతూ వచ్చింది. వారు శాస్త్రపరికరాలను, యంత్రాలను కనిపెట్టేవారు. అవి లేకుంటే శాస్త్రపరిశోధనలే జరిగి ఉండేవి కావు. ఒక విధంగా చూస్తే అది విజ్ఞానశాస్త్రానికి పెంపుడు తల్లి.

## చరిత్ర మలుపులో కోపెర్నికస్

కోపెర్నికస్ పోలెండ్‌లో పుట్టాడు. రష్యా, జర్మనీలు కలిసేచోట పోలెండ్ ఉంది. అతడి విద్యాభ్యాసం ఎక్కువగా ఇటలీలో జరిగింది. ఇన్ని దేశాల ప్రభావంగల నిజమైన యూరోప్ పౌరుడు అతడు. పాత ప్రపంచానికీ కొత్త ప్రపంచానికి మధ్య చరిత్ర మలుపు తిరిగేచోట, సాక్షిగా నిలబడిన వ్యక్తి అతడు.

కోపెర్నికస్ కాలంలోనూ, అతడి తర్వాత చాలాకాలం వరకు కూడా అధికార వర్గాలు విశ్వమంతటికీ భూమి మధ్యగా ఉందని భావించే వారు. అదే నిజమని నిర్ధారణ చేశారు. సూర్యుడు, ఇతర గ్రహాలన్నీ



భూమి చుట్టూ తిరుగుతున్నాయనేది అంతకుముందు కొన్నివేల సంవత్స రాలుగా పాతుకపోయిన నమ్మకం. దానిని శంకించవలసిన అవసరం ఎవ రికీ కనిపించలేదు. ప్రాచీన గ్రీకు ఖగోళ శాస్త్రజ్ఞుడు టాలెమీ ప్రతిపా దించిన సిద్ధాంతం కూడా భూమి చుట్టూ ఇతర గ్రహాలన్నీ తిరుగుతున్నా యనే. ఆ సిద్ధాంతాన్నే చర్చి, ప్రభుత్వం, మేధావి వర్గం ఆమోదించాయి. ఈ సిద్ధాంతం తప్పు అని వాదించినవారు అంతకుముందు చాలామంది ఉన్నప్పటికీ, వానిని శాస్త్రీయ పద్ధతిలో సవాలుచేసిన మొదటి వ్యక్తి కోపెర్నికస్. తన నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ అతడు వ్రాసిన గ్రంథం చరిత్రలో అతి ముఖ్యమైనవాటిలో ఒకటి అయింది.

సౌరకుటుంబమధ్యంలో సూర్యుడు స్థిరంగా ఉన్నాడనీ, భూమి, ఇతరగ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయనీ-శాస్త్రీయ పద్ధతిని ఉప యోగించి—నిరూపించడానికి కోపెర్నికస్ ప్రయత్నించాడు. భూమి తన చుట్టూ తాను తిరగడానికి ఒక రోజు పడుతుందనీ, సూర్యుని చుట్టూ ప్రదక్షిణం చేయడానికి ఒక సంవత్సరం పడుతుందనీ అతడు వివరించాడు. ఇతర నక్షత్రాలను గురించిన రహస్యాలను కూడా అతడు స్పష్టం చేశాడు.

ఈనాడు ఇది మనకు చాలా తేలిక విషయంగా కనిపిస్తున్నది. కాని, కోపెర్నికస్ తన గ్రంథాన్ని ప్రచురించినప్పుడు, ఈ విషయాలు ఎంత సంచలనాన్ని కలిగించాయో చెప్పలేము. అప్పటికీ అతడు-మత గురువులు, సంప్రదాయ పరాయణులు తన మీద కత్తిదూయకుండా ఉండేటట్లు-చాలా ఉపాయంగానే తన శాస్త్రీ సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. అయినా, అతడు మరణించిన తర్వాత ఒకటిన్నర శతాబ్దాలకు గానీ జాతీయ నాయకులు, మత నాయకులు అతడి సిద్ధాంతాన్ని ఆమోదించలేదు. (కోపెర్నికస్ 1543 లో మరణించాడు.)

# సందేహమే సత్యాన్వేషణకు మూలం

కోపెర్నికస్ తన పరిశోధనలన్నీ టెలిస్కోప్ లేకుండానే చేశాడు. అతడి తర్వాత దాదాపు వంద సంవత్సరాలకు అతడి సిద్ధాంతం నిజమని గెలీలియో ధ్రువపరచాడు. అప్పటికి టెలిస్కోప్ అందుబాటులోకి వచ్చింది. మొదటగా గెలీలియో ఒక హాలెండ్ వ్యక్తినుంచి తన టెలిస్కోప్ సంపాదించుకున్నాడు. అటువంటి 'ఆధునిక' పరికరంతో అతడు 'నూతన యాంత్రిక శాస్త్రం' అనబడే దాన్ని సృష్టించ గలిగాడు. 16, 17 శతాబ్దాల నాటి శాస్త్రపరికరాలు-ఇప్పటి ప్రమాణాల దృష్ట్యా-అతి ప్రాథమిక మైనవే కానీ, వాటిని తయారు చేసినవారు ఆధునిక ప్రపంచానికి రూప రేఖలు దిద్దడంలో ఎంతో తోడ్పడ్డారని చెప్పవచ్చు.

గెలీలియో తన నూతన సాధనాల సాయంతో ఖగోళ పరిశోధనలు సాగించి కొన్ని ముఖ్యమైన విషయాలను కనిపెట్టాడు. గురు గ్రహం యొక్క ఉపగ్రహాలను చూసిన మొట్టమొదటి వ్యక్తి అతడే. అతడు ఎదుర్కొన్న పెద్ద సమస్యలు ఖగోళంలో కాదు, భూగోళంలోనే. ఎందుకంటే కోపెర్నికస్ మాదిరిగానే ఇతడి ఖగోళ పరిశోధనకూడా యూరప్‌లో పెద్ద గందరగోళం తెచ్చిపెట్టింది. ఇతడు కూడా శతాబ్దాలుగా పాతుకుపోయిన సంప్రదాయాలను పెకలించడానికి ప్రయత్నించాడు. దానితో మతాధికారులు ఆగ్రహపరవశులైనారు. అతడు సమర్థిస్తున్న కోపెర్నికస్ సిద్ధాంతం తప్పు అనీ, పవిత్రమైన బైబిలుకే అపచారమనీ చర్చి నిరసించింది.

గెలీలియో భూమి సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని దృఢంగా విశ్వసించాడు. కాని, అది అబద్ధమని బహిరంగంగా ప్రకటించవలసిందని అధికారులు అతడిని బలవంతం చేశారు. అధికారులకు లొంగిపోయి అతడు ఆత్మవిరుద్ధంగా మాట్లాడుతున్నప్పటికీ లోలోపల అతడు తన విశ్వాసాన్ని మార్చుకోలేదు. ఆ విషయం అతని మిత్రులకు తెలుసు. మళ్ళీ



అజ్ఞానం, అసహనం సత్యాన్వేషణ స్వాతంత్ర్యాన్ని అరికట్టాయి, కొత్త విషయాలను కనుగొనడానికి ప్రయత్నించే సాహసం ఎవరూ చేయలేక పోయారు. ఏమైనప్పటికీ, గెలీలియో కనుగొన్నది నిజమన్న సంగతి నిలకడమీద తేలక పోలేదు.

ఇంగ్లీషు శాస్త్రజ్ఞుడు ఐజాక్ న్యూటన్ కోపెర్నికస్ సిద్ధాంతాన్ని మరింత ప్రచారం చేశాడు. రెండవ చార్లెస్ కాలంలో స్థాపించబడిన రాయల్ సొసైటీని (శాస్త్రజ్ఞుల, పండితుల సంఘం) అభివృద్ధిలోకి తీసుకు రావడానికి అతడు ఎక్కువగా కృషిచేశాడు. అప్పటికీ, ఇప్పటికీ

సాంకేతిక శాస్త్రం ఐక్యరాజ్య సమితి అవతరణను 'సంభవం' చేయడమే కాదు-'అనివార్యం' చేసింది. అయితే దురదృష్టవశాత్తూ కోపెర్ని కస్, గెలీలియో, న్యూటన్‌ల కాలంలో మాదిరిగానే మన కాలంలో కూడా అన్ని దేశాలలోనూ, నూతన విజ్ఞానాన్ని నిరోధిస్తున్న, విరోధిస్తున్న శక్తులు-అసహనం, అకారణ ద్వేషం-ఉన్నాయి. సత్యజ్యోతితో కాంతి మంతం చేయవలసిన అజ్ఞానాంధకారమయ కోణాలు ఇప్పటికీ ఉన్నాయి.

విజ్ఞాన సిద్ధాంతాలను కనుగొనడంతో పాటే వాటిని నిత్యజీవితంలో ఉపయోగంలోకి తీసుకువచ్చే ప్రయత్నాలు కూడా జరుగుతూ వచ్చిన మాట నిజమే. నక్షత్రాల పరిశోధనవల్ల పంచాంగాన్ని తయారు చేయడం సాధ్య మయింది, పంచాంగం వ్యవసాయానికి, నిత్య జీవనానికి అత్యవసర మయింది. ఈజిప్టులో వ్యవసాయ క్షేత్రాలను కొలిచే పద్ధతి చూసి గ్రీకులు రేఖాగణితం కనిపెట్టారు. కుమ్మరుల, కమ్మరుల పనివాడితనం తొలి రసా యనిక శాస్త్రజ్ఞులను ఆకర్షించింది. నిత్యజీవితంలో కనిపించే ఇటువంటి పనివాడి తనమే శాస్త్ర పరిశోధనలకు ముడి పదార్థమయింది. అలాగే, శాస్త్ర పరిశోధనలు పెక్కు ఆధునిక పరిశ్రమలకు పునాది వేశాయి. విద్యుచ్ఛక్తి మొదలుకొని ప్లాస్టిక్కుల వరకు అన్ని పరిశ్రమలకు మూలం శాస్త్ర పరి శోధనలే.

ఇంతటి పురోభివృద్ధిని 'సాధ్యం' చేసినవి పరికరాలు. ఈ పరికరాలు ఆదిలో రాతితో తయారు చేసుకునే వారు. తర్వాత – ఖనిజాలను కొలిమిలో కాల్చి రాబట్టిన లోహాలతో చేయబడినాయి. వట్టి చేతులతో చేయడం సాధ్యం కాని అనేక పనులు చేయడానికి ఈ పరికారలు ఉపయోగపడ్డాయి. చక్రాలు, మీటలుగా ప్రారంభమయిన యంత్ర సాధనాలు శతాబ్దాల గమనంలో విశే షంగా అభివృద్ధిచెందాయి. ఈ నాటికి ఆధునిక సాంకేతిక విజ్ఞానం మని షిని రోదసిలోవిహరింప చేయకలిగినంతగా అభివృద్ధి చెందింది.

కాని, దీని అంతటివల్ల మరొక పరిస్థితి కూడా ఏర్పడింది. వృత్తులు పెరగడంతో-నేత పనివారనీ, కమ్మరులనీ, గడియారాలు చేసే వారనీ, పడవలు తయారు చేసేవారనీ-ఇలా సమాజం ఎన్నో వర్గాలతో మరింత క్లిష్టమయింది. మొదటి అధ్యాయంలో మనం చెప్పుకున్న 'కృషి విభజన' పర్యవసానం ఇది. మనిషి శక్తిని, ప్రతిభను మరింత చిన్నవైన ప్రత్యేక శాఖలపై కేంద్రీకరించడం వల్ల,ప్రత్యేక నైపుణి సాధనకోసం 'కృషి' మరింత సూక్ష్మంగా 'విభక్తం' కావడం వల్ల పనివారికి ఒకరి సహకారం మరొకరికి మరింత అవసరమవుతూ వచ్చింది. భూగోళమంతటా సందులేకుండా, చిక్కగా సాలెగూడులా అల్లుకున్న మానవ సహకారమే నేటిమన జీవితం.

## వైజ్ఞానిక సామ్రాజ్యం

ఒక్కొక్క వ్యక్తి ప్రతిభ ఒక్కొక్క సన్నని నూలుపోగు అయితే అటువంటి ఎన్నో నూలుపోగుల నేత "పారిశ్రామిక విప్లవం," ఆధునిక పరిశ్రమలు ఎక్కువగా ఇంగ్లండ్‌లోనే ప్రారంభమైనాయి. అక్కడ నుంచి అన్ని దేశాలకూ వ్యాపించాయి. దానితో నూతన విపణులు, నూతన వృత్తులు ప్రతి చోటా ప్రారంభమైనాయి.

భౌతిక, రాసాయనిక శాస్త్రాలను తీసుకుంటే, 19 వ శతాబ్దారంభంలోనో, ఇంకా కొంచెం ముందుగానో, ఇంగ్లండ్ దేశస్థుడు జోసెఫ్ ప్రీస్ట్లీ 'ప్రాణవాయువు' అనే దాన్ని కనిపెట్టాడు; ఫ్రాన్స్‌దేశస్థుడు ఆంటోని లావోసియర్ ఆధునిక రసాయన శాస్త్రానికి సృష్టికర్త అయ్యాడు; ఇంగ్లండ్ దేశస్థుడు జాన్‌డాల్టన్ అణు సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. పదార్థంలోని అతి సూక్ష్మ విభాగాలు అణువులని అని అతడు కనిపెట్టాడు: ఆ తర్వాత జర్మనీ దేశస్థుడు జస్టస్ లీబిగ్ కృత్రిమమైన ఎరువును కనుగొని వ్యవసాయాభివృద్ధికి తోడ్పడ్డాడు. పోలెండుకు చెందిన మేరీక్యూరీ, ఆమె

భర్త ఫ్రాన్స్‌కు చెందిన పియరీక్యూరీ కలిసి 'రేడియం'ను కనుగొన్నారు. వ్యాధుల చికిత్సకు, అణునిర్మాణాన్ని అర్థం చేసుకోవడానికి అది అద్భుతమైనదని వారు తెలుసుకున్నారు.

ఇక జీవశాస్త్రంలో, వైద్యశాస్త్రంలో పురోభివృద్ధిని చూద్దాం. మొట్ట మొదటగా చెప్పుకోదగిన వ్యక్తి ఇంగ్లండ్ దేశస్థుడు చార్లెస్ డార్విన్. అతడు రచించిన 'జీవరాశుల మూలస్వరూపం' అనే గ్రంథం ప్రపంచమంతటా విశేషప్రచారం పొందింది. అందులో అతడు 'పరిణామ' వాదాన్ని ప్రతిపాదించాడు. ఆస్ట్రియా దేశస్థుడు గ్రిగర్ మెండెల్ వంశానుగతంగా

**How Production Increased in 50 Years.**

**Daily Output of One Man, 1780 and 1920**



సంక్రమించే లక్షణాలకు సంబంధించిన సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. ఇంగ్లండ్ దేశీయుడు ఎడ్వర్డ్ జెన్నర్ మసూచి వ్యాధికి టీకాలు మందు కని పెట్టాడు. ఫ్రాన్స్ దేశీయుడు లూయీ పాశ్చర్ 'క్రిమిసిద్ధాంతం' నిరూపించాడు. ఇంగ్లండ్ దేశస్థుడు జోసెఫ్ లిస్టర్ ప్రప్రథమంగా శస్త్రచికిత్సలో దేహాన్ని కుళ్ళనివ్వకుండా చేసే ఔషధాలను ఉపయోగించాడు. జర్మనీకి చెందిన రాబర్ట్ కోచ్ క్షయవ్యాధికి కారణమైన క్రిములను కనుగొన్నాడు. రష్యాకు చెందిన ఎలీమెట్నికోఫ్ రక్తంలోని తెల్లకణాలు వ్యాధిక్రిములను ఎలా నిరోధిస్తాయో వివరించాడు

జర్మనీ దేశస్థుడు విలియం రోయెంట్జెన్ 'ఎక్స్‌రే'ను కనుగొని ప్రపంచ ఆరోగ్యసాధనోద్యమ వ్యాప్తికి ఎంతో దోహదం చేశాడు. వాల్టర్ రీడ్ అనే అమెరికా దేశీయుడు 'కుంభకామెర్ల' (Yellow fever) వ్యాధి నిర్మూలనకు పరిశోధనలు సాగించాడు. ఇంగ్లండ్‌కు చెందిన అలెగ్జాండర్ ఫ్లెమింగ్ 'పెన్సిలిన్' మందును కనిపెట్టాడు. కెనడా దేశీయుడు ఫ్రెడెరిక్ బాంటింగ్ అతిమూత్రవ్యాధిని కుదర్చడానికి 'ఇన్సులిన్' కనిపెట్టాడు. జోనాస్‌సాక్ అనే అమెరికాదేశీయుడు శిశు-పక్షవాతానికి టీకాలు మందు కని పెట్టాడు. ఇంకా ఎన్నో ఇతర దేశాలకు చెందిన ఎంతోమంది పేర్లను ప్రపంచ వ్యాప్తమయిన ఈ వైజ్ఞానిక కుటుంబంలో చేర్చవచ్చును.

ఇటలీ దేశస్థుడు లుయిగీ గాల్వానీ విద్యుత్తు తీగల గుండా ప్రవహించ గల ఒక శక్తి అని కనిపెట్టాడు. ఇటలీకి చెందిన మరొక శాస్త్రజ్ఞుడు అలె సాండ్రోవోల్టా 'విద్యుత్ఘటాన్ని' సృష్టించారు. ఇంగ్లండ్ దేశస్థుడు మైఖేల్ ఫారడే 'డైనమో'ను కనిపెట్టాడు, దీనివల్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి సాధ్యమయింది. విద్యుచ్ఛక్తి పెద్ద పెద్ద కర్మాగారాలలో యంత్రాలను నడుపగలుగుతున్నవి.



19 వ శతాబ్దంలో నుంచి 20 వ శతాబ్దంలోనికి అడుగుపెట్టే నాటికి విజ్ఞానశాస్త్ర పరిశోధనా రంగం ఇంకా ఇంకా విస్తృతం కావడం మొదలు పెట్టింది.

అమెరికన్ శాస్త్రజ్ఞుడు ఆల్బర్ట్ మిచెల్సన్ కాంతివేగాన్ని కొలవగలిగాడు. న్యూజీలాండ్‌కు చెందిన ఎర్నెస్ట్ రూథర్‌ఫోర్డ్ అణువులోని న్యూక్లియస్ చుట్టూ ఎలక్ట్రాన్లు తిరుగుతున్నాయని కనుగొన్నాడు. ఆస్ట్రియా శాస్త్రజ్ఞుడు లీసేమిట్నర్ అణువిచ్ఛేద సిద్ధాంతం ప్రతిపాదించాడు.

20 వ శతాబ్దంలోని మహామేధావులకు నాయకుడు అమెరికా దేశస్థుడు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్. ఆయన సాపేక్షసిద్ధాంతాన్ని కనుగొన్నాడు. 'చాపాకృతి'లో నున్న విశ్వం పూర్ణత్వం వైపు పరిణతి పొందుతున్నదని ఆయన చెప్పాడు. డెన్మార్క్‌కు చెందిన నీల్స్‌బోర్ అణునిర్మాణాన్ని గురించి ఇంకా లోతుగా పరిశీలించి సౌరకుటుంబ వ్యవస్థను పోలినదే అతి సూక్ష్మ రూపంలో అణువులో ఇమిడి ఉందని ఊహించాడు

గ్రహాలు తమతమ కక్ష్యలు తప్పకుండా. క్రమం తప్పకుండా ప్రదక్షిణాలు చేయడం గెలీలియో తన టెలిస్కోప్‌లో చూశాడు. నాలుగు శతాబ్ధాల తర్వాత అదే ప్రవర్తన అణువులోని న్యూట్రాన్లలో, ప్రోటాన్లలో ఎలక్ట్రాన్లలో కనిపించింది. ఇవి అతి నిశితమైన సూక్ష్మదర్శినిలో సైతం కనిపించనంతటి సూక్ష్మకణాలు ఐన్‌స్టీన్ 1955 లో చనిపోయే ముందు ఒక మాట అన్నారు "అణువును కనుగొనడంతో సర్వం మారిపోయింది-మన మనస్సులు తప్ప"

కాబట్టి, మానవుడు సాధిస్తున్న భౌతిక విజయాలతో పాటు అతడి నైతిక ప్రమాణం కూడా ఉన్నతమవుతున్నదా అనే ప్రశ్న అలాగే మిగిలిపోయింది.

## ప్రవేశ్యానుకున్న సాంకేతిక శాస్త్రం

పారిశ్రామిక విప్లవ పర్యవసానంగా ఏర్పడిన పెద్ద సాంఘిక పరిణామాలలో నూతన యంత్రాలను కనిపెట్టిన వ్యక్తుల పాత్ర ఎటువంటిదో చూద్దాం. ఇంగ్లండ్ ఆర్థిక వ్యవస్థను పరిశీలిస్తే ఇది బాగా అర్థమవుతుంది. ఖరీదైన యంత్రాలను ఇంటిలో నెలకొల్పుకొనేందుకు పనివారికి ఆర్థిక స్తోమతు ఉండదు పైగా, వాటిని చేతితో నడపడానికి వీలుండదు. అందుచేత, వాటిని ప్రత్యేకంగా సరకుల ఉత్పత్తికోసం నిర్మించిన పెద్ద భవనాలలో నెలకొల్పేవారు. అలా కర్మాగారాల యుగం ప్రారంభమయింది.

విశేషంగా గమనించదగ్గ అంశం ఏమిటంటే-పారిశ్రామిక విప్లవ ఫలితంగా రాజకీయలు కూడా మారాయి భారీ ఉత్పత్తులు పెరుగుతున్న కొద్దీ కర్మాగారాలలో పని చేయడానికి సామాన్య జనానికి గిరాకీ పెరిగింది, యంత్రాల వ్యాప్తివల్ల మనుష్యుల జీవన విధానం, ఆలోచనా విధానమే మారిపోయింది. (ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ఈనాడు

కూడా మనం ఈ పరిణామదశను చూడగలం.) యంత్రాలతో పాటు జనాభా పెరిగింది; నగరాలు పెరిగాయి, ప్రజాసామాన్యానికి చెందిన ఒక నూతన సంస్కృతి అవతరించి. అభివృద్ధి చెందడం ప్రారంభించింది అదే ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థ వికాసానికి దారితీసింది.




వరసగా కొత్త యంత్ర పరికరాలను కనిపెట్టుతూ రావడం వల్ల ఇంగ్లండ్‌లో వస్త్రపరిశ్రమ ఎంతగా అభివృద్ధి చెందిందో, వస్త్ర ఉత్పత్తి ఎంతగా పెరిగిపోయిందో చూద్దాం. 1733 లో జాన్‌కే ఎగిరే నాడె కనిపెట్టాడు, దానివల్ల నేత వేగం పెరిగింది. 1765 లో జేమ్స్ హార్‌గ్రీవ్స్ 'స్పిన్నింగ్ జెన్నీ' అనే దానిని కనిపెట్టాడు. దాని వల్ల ఒకేసారి పెక్కు

దారాలను వడకడం సాధ్యమయింది. 1769 లో రిచర్డ్ ఆర్క్‌రైట్ 'జల యంత్రా'న్ని కనిపెట్టాడు నీటిచక్రం సాయంతో అది మరింత వేగంగా నూలు వడుకుతుంది. 1785 లో ఎడ్మండ్ కార్ట్‌రైట్ 'మరమగ్గం' కని పెట్టాడు. ఇదికూడా నీటిచక్రంతోనే నడుస్తుంది. అయితే ఈ యంత్రం తనంతట తానే వస్త్రం నేస్తుంది. 'స్వయంచోదక' యంత్రాలకు అదే ప్రారంభం నేటి ప్రపంచంలోని ముఖ్య సమస్యలలో యంత్రాల స్వయం చోదకత్వం కూడా ఒకటయింది.

18 వ శతాబ్దపు చివరి రోజుల్లో జేమ్స్ వాట్ ఆవిరి ఇంజనును కని పెట్టాడు. అది ఆవిరి శక్తితో యంత్రాలను నడుపుతుంది. 1785 లో ఈ ఆవిరి ఇంజనును వస్త్ర పరిశ్రమలో యంత్రాలను నడపడానికి ఉపయోగిం చారు: తర్వాత ఇతర పరిశ్రమలలో కూడా దానిని ప్రవేశపెట్టారు.

అయితే, ఈ దశలో మరొక కొత్త అవసరం ఏర్పడింది కర్మాగా రాలకు ముడి పదార్థాలను తక్కువ ఖర్చుతో, ఎక్కువ వేగంగా చేరవేయ డానికి, తయారైన సరకులను కర్మాగారాలనుంచి విపణులకు చేరవేయడానికి రవాణాసాధనాలు అవసరమైనాయి. అమెరికా దేశీయుడు రాబర్ట్‌ఫుల్టన్ 1807 లో స్టీమ్‌బోటును కనిపెట్టాడు. ఈ బోటులో తెడ్లను ఆవిరి ఇంజను సాయంతో నడుపుతారు. మొదట ఈ బోటును నదులమీద కోస్తాలవెంబడి నడి పారు. ఆ తర్వాత అదే మహా సముద్రయానానికి ప్రధానంగా ఉపయోగ పడింది. ఆవిరి ఇంజను అమర్చిన మొట్టమొదటి ఓడ 'గ్రేట్ వెస్టర్న్' 1838 లో అట్లాంటిక్ మహా సముద్రంలో ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకు వెళ్ళింది.

1830 లో ఇంగ్లండ్ దేశీయుడు జార్జి స్టీఫెన్సన్ ఆవిరి శక్తితో నడిచే రైలు ఇంజనును నిర్మించాడు అప్పటినుంచి రైలు మార్గాల నిర్మాణం విశే

షంగా పెరిగిపోయింది. ప్రయాణాలు మరింత భద్రంగా, మరింత వేగంగా సాగుతున్నాయి.

ఈ నూతన యంత్ర సాధనాలు ఒకదాని వల్ల మరొకటి ఎలా ప్రయోజనాన్ని పొందుతూ, అభివృద్ధి అవుతున్నాయో గమనించండి. ఆవిరి కోసం నీటిని కాగబెట్టాలన్నా, ఇనుప ఖనిజం నించి ఇనుమును తీయాలన్నా బొగ్గు ఎక్కువగా అవసరమయింది. అయితే ఇనుమును గట్టి చేయవలసివచ్చింది. 1856 లో ఇంగ్లండ్ దేశీయుడు హెన్రీ బెస్సెమెర్ ఇనుమును ఉక్కుగా మార్చే నూతన పద్ధతిని కనుగొన్నాడు. ఆ తర్వాత ఉక్కు తయారీలో అనేక పరిణత పద్ధతులు వాడుకలోకి వచ్చాయి. మిశ్రమలోహాలు కొన్నింటిని చేర్చి ఉక్కు నాణ్యాన్ని పెంచారు. ఈనాడు మన పారిశ్రామిక వ్యవస్థకు ఉక్కు కీలకమైన లోహం అయింది.

1892 లో జర్మనీ దేశస్థుడు రుడాల్ఫ్ డీసెల్ అనే అతడు ముడి పెట్రోలుతో నడిచే ఇంజనును తయారు చేశాడు. యంత్రాలను, రైళ్ళను, లారీలను, ఓడలను నడపడానికి ఈనాడు ప్రపంచమంతటా డీసెల్ ఇంజనులను వాడుతున్నారు. టెలిఫోన్, రేడియో మొదలయిన ప్రజాసంబంధ సాధనాలను గురించి వచ్చే అధ్యాయంలో తెలుసుకుందాం. అంతర్జాతీయ సహకార సౌధ నిర్మాణానికి సిమెంటులాగా ఉపయోగపడినవి అవే.

## విమానయానం

ఈ అధ్యాయంలో మనం ముఖ్యంగా 19 వ శతాబ్దం గురించి, ఇంకా కొంచెం వెనకటి కాలం గురించి చెప్పుకుంటున్నాం. అయితే అత్యధునాతన ప్రయాణ సాధనమైన విమానాన్ని గురించి చెప్పుకోకుండా ఈ అధ్యాయాన్ని ముగించడం సమంజసం కాదు. విమానయానం ప్రారంభం కావడంతో ప్రపంచంలో కోట్లాది ప్రజల జీవన విధానంలో మార్పు వచ్చింది.

అమెరికాకు చెందిన విల్బర్, ఆర్విల్ రైట్ అనే ఇద్దరు విమానాన్ని సృష్టించారు. 1903 లో ఉత్తర కెరోలినా రాష్ట్రంలోని కిట్టీహాక్‌లో వారు మొట్టమొదటిసారిగా తమ నూతన సాధనంతో ఆకాశంలోకి వెళ్ళారు. గాలి కంటె బరువుగల వస్తువు ఒకటి గాలిలో తేలడం అదే మొదలు. 1920 నాటికి వ్యాపార విమానాలు ప్రయాణీకులను, సరకులను, తపాలాను నగరాల మధ్య, దేశాల మధ్య చేరవేయడం ప్రారంభించాయి.

1939 నాటి ముఖ్య విమాన మార్గాలను కొన్నింటిని 16 పేజీలోని పటంలో చూడండి. ఇప్పుడు ఇంకా ఎన్నో మార్గాలు ఏర్పడినాయి. విమాన యుగంలోని యంత్రాలు వివిధ దేశాల ప్రజలను ఏ విధంగా సన్నిహితం చేస్తున్నాయో ఆ పటం సూచిస్తుంది. ఇక్కడ ఒక ప్రశ్న వస్తుంది. ఐదు శతాబ్దాల క్రితం అవతరించిన 'సార్వభౌమాధికారం గల రాజ్యాలు' ఈ విమాన యుగంలో కూడా నిజంగా "స్వతంత్రంగా" ఉండగలవా? ఈ పుస్తకంలో ఇక ఎక్కువగా వలసరాజ్యాల స్వాతంత్ర్యం గురించి ప్రస్తావిస్తాము. 'స్వాతంత్ర్యం' అంటే ఒకరిపై ఆధారపడకుండా ఉండటమే అయితే, అదేనా ఇప్పటి పెద్ద సమస్య? ఒకరిపై ఒకరు ఆధారపడుతూ, ఒకరివల్ల ఒకరు ప్రయోజనం పొందడం ఎలాగన్నది మరింత పెద్ద సమస్య కాదా?

మన రాజకీయవేత్తలకు, మనలో ప్రతి ఒక్కరికీ ఇవి ప్రధానమైన సమస్యలు. వీటికి సరియైన సమాధానాలు కనుగొనగలమో లేమో ఇప్పటికీ మనకు తెలియదు. కాని సమాధానాలు సాధించడానికి మనం ప్రయత్నించి తీరాలి ఈ పుస్తకంలోని మూడవ భాగంలో మనం దానిని గురించే పరిశీలించుదాం; రాజకీయాలకు సంబంధించినంతమట్టుకు ప్రపంచదేశాల మధ్య దూరం అంతకంతకు ఎలా తగ్గిపోతున్నదో, భూగోళం ఎలా కుదించుకు పోతున్నదో చూద్దాం.

అయితే, మనం బహుశః ఎప్పటికీ సమాధానం చెప్పలేని ప్రశ్న ఒకటున్నది: జీవితంలోని ముఖ్య విషయాలన్నీ నిజంగా విజ్ఞాన శాస్త్రం మీదనే ఆధారపడి ఉన్నాయా? లేక దానితో నిమిత్తంలేని ఇతర విషయాల మీద ఆధారపడి ఉన్నాయా? హిలేర్ బెల్లాక్ ఒక పద్యంలో చెప్పిన ఈ క్రింది భావం నిజమేనా?

"విజ్ఞానశాస్త్రం ఏదైనా ఒక కొత్తదానిని కనిపెట్టినప్పుడు, దానివల్ల మనం ఇంతకు ముందుకంటే జీవితంలో ఎక్కువ సుఖసంతోషాలను పొంద గలుగుతాము."

# 8

# వ్యవస్థాపకులు

సుమారు 200 సంవత్సరాల క్రితం అలెగ్జాండర్ హామిల్టన్ న్యూయార్క్ నుంచి ఫిలడల్ఫియాకు ఒక తపాలా బండిలో ప్రయాణం చేయడానికి పెక్కు రోజులు పట్టింది. ఆతడి ప్రయాణవేగం వాతావరణంమీద ఆధారపడి ఉండేది. ఈ నాడు, అంతకంటే చాలా తక్కువ వ్యవధిలో ప్రపంచాన్నే చుట్టి రావచ్చు-విమానంలో.

ఈ ప్రపంచంలో దూరం, కాలం నానాటికీ కుదించుకు పోతున్నాయి. మానవుడు దూరాన్ని జయించాడనే ముఖ్య విషయాన్ని మనం ఈ అధ్యాయం నుంచి మనస్సులో ఉంచుకోవాలి.

అమెరికాకు మొట్టమొదటగా వలస వచ్చి స్థిరపడినవారు ఒక్కసారి లండన్ వెళ్ళాలంటే, న్యూయార్కు నుంచి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రయాణం చేసి లండన్ చేరడానికి ఏడు వారాలు పట్టేది-అదైనా అదృష్టవశాత్తూ వాతావరణం అనుకూలిస్తే, ఈ నాడు, ఆదే ప్రయాణానికి జెట్ విమానంలో ఐదు గంటలు పడుతుంది

ఎయిర్ కండిషన్డ్ విమానంలో ప్రశాంతంగా నిద్రపోయి, ఉదయం ఫలహారం వేళకు లండన్‌లో మేలుకుంటే, ప్రయాణికునికి అంతర్జాతీయ సహకార స్వరూపం ప్ర త్య క్షం గా దర్శనమిస్తుంది. ఎలాగంటే అతడి ఫలహారం బల్లమీద కనిపించే రొట్టె ఇంగ్లండ్‌లో తయారైనది; దాని పిండి కెనడా నుంచో, హంగేరీ నుంచో, లేక రష్యానుంచో దిగుమతి అయినదై ఉంటుండి; ఆ రొట్టెకు రాసిన వెన్న డెన్మార్క్ నుంచి వచ్చింది; మరొక పళ్ళెంలోని మాంసం న్యూజీలాండ్ నుంచో, అర్జెంటీనా నుంచో, షికాగో నుంచో వచ్చి ఉంటుంది; మరొక పళ్ళెంలో పండ్లు ఉంటాయి; అవి మధ్యధరా ప్రాంతం నుంచో, దక్షిణాఫ్రికా నుంచో, కాలిఫోర్నియా నుంచో, పశ్చిమ ఇండియా దీవులనుంచో దిగుమతి అయి ఉంటాయి; అతడు త్రాగే కాఫీ బ్రాజిల్ నుంచో, తూర్పు ఆఫ్రికా నుంచో వచ్చి ఉంటుంది, అతడు చాకొలెట్ పానీయం త్రాగితే అది పశ్చిమాఫ్రికా నించి వచ్చినదై ఉంటుంది; కాఫీలో కలుపుకునే పంచదార మధ్య యూరప్ నుంచో, క్యూబా నుంచో వచ్చి ఉంటుంద; గడచిన రాత్రి ప్రపంచంలోని పెక్కు దేశాలలో జరిగిన విశేషాలను తెలిపే వార్తా పత్రికలు అతడి చేతుల్లోకి వస్తాయి; ఆ పత్రికల కాగితం కెనడా, స్వీడన్ దేశాలలోని అడవులలో లభించే ఒక రకం కర్రగుజ్జుతో త యూరైనది.

యాంత్రిక నాగరగత గల కేంద్రా లన్నింటిలోనూ ఇదే కనిపిస్తుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రం వల్ల రవాణా, వాణిజ్యాలు ప్రపంచమంతటా ఎలా విస్తరించుకున్నాయో క్రిందటి అధ్యాయంలో మనం తెలుసుకున్నాము. ఈ అధ్యాయంలో మనం కొన్ని 'అంతర్జాతీయ సంస్థ' లను గురించి తెలుసుకుందాము. ఇవి, నేటి మన జీవితంలో లీనమైపోయిన సంస్థలు.

సాంకేతిక శాస్త్రం ఇప్పుడు ప్రపంచ స్థాయిలో పనిచేస్తున్నది. ఏ దేశం గానీ, ఏ జాతి గానీ, తనకు తానుగా దానిని నిర్వహించలేదు.

అలాగే ఇంకా అనేక వ్యాపారాలు, వ్యవహారాలు అంతర్జాతీయంగా నిర్వ
హించవలసిన అవసరం ఏర్పడింది. ఈ అవసరం అంతకంతకు పెరుగు
తున్నది. "విజ్ఞానశాస్త్రం దాని దారిన అది ముందుకు దూసుకుపోతూ
ఉంటుంది. దాని ప్రమాదాలను హద్దులో పెట్టి, ప్రయోజనాలను రాబట్టు
కొనడానికి వీలుగా, సంస్థలను ఎక్కువగా అంతర్జాతీయ స్థాయిలో రూపొం
దించుకోవలసిన బాధ్యత మనపైన ఉంది" అని అమెరికా విదేశాంగ మంత్రి



శ్రీ డీన్ రస్క్ 1964 లో కొలంబియా విశ్వవిద్యాలయంలో ప్రసంగిస్తూ
అన్నాడు. ఆయన ఇంకా ఇలా అన్నాడు: "దేశాలు తమ జాతీయ [illegible]
లను, భావాలను, ఆకాంక్షలను, అధికారాలను అంటి పెట్టుకునే ఉండవచ్చు.
కాని, మనకు ఇష్టం ఉన్నా, లేకపోయినా విజ్ఞాన శాస్త్రం ఒక అంతర్జాతీయ
సమాజాన్ని సృష్టించింది. ఇతర సమాజాల మాదిరిగానే దానిని కూడా నిర్వ
హించవలసి ఉంది."

## 'ఉత్తర' కాండ

ఉదాహరణకు తపాలా విషయం తీసుకుందాం. 1874 వరకు ప్రతి దేశం విదేశాలకు పంపే ఉత్తరాల విషయమై ఆయా దేశాలతో తపాలా ఛార్జిలను బేరం ఆడుతూ ఉండేది. ప్రభుత్వం తానే స్వయంగా తపాలా బిళ్ళలు ముద్రించి, వాటి అమ్మకానికి కొన్ని నిబంధనలు పెట్టడం సులువే. కాని, సముద్రాలు దాటి, సరిహద్దులు దాటి, ఇతర దేశాలకు ఉత్తరాలను చేరవేయడం, బట్వాడా చేయడం అంటే అది కేవలం స్వవిషయం కాదు. అందులో విదేశ ప్రభుత్వాల ప్రసక్తి కూడా వస్తుంది. తపాలా ఖరీదులను ముందుగానే నిర్ణయించడం కష్టం.

అంతకంతకు అంతర్జాతీయ వాణిజ్యం పెరిగింది. ప్రపంచంలో ఒకచోటి నుంచి మరొక చోటికి వలసపోయే జనం పెరిగారు. అలా వలస వెళ్ళినవారు స్వదేశానికి ఉత్తరాలు రాస్తూ ఉండేవారు. వీటి రవాణా, బట్వాడా చాలా చిక్కైన వ్యవహారంగా ఉండేది. జర్మనీ నుంచి పొరుగునే ఉన్న ఆస్ట్రియాకు ఒక ఉత్తరం చేరాలంటే దానికి మూడు రకాల రేట్లు వసూలు చేసేవారు. అమెరికానుంచి ఆస్ట్రేలియాకు తపాలా చేరాలంటే-అర ఔన్సుకు ఐదు సెంట్లు మొదలు వంద సెంట్లవరకు రకరకాల రేట్లు ఉండేవి. ఉత్తరాలు బహు మార్గాలలో ప్రయాణం చేయవలసి ఉండేది. ప్రపంచం ఈ కొస నుంచి ఆ కొసకు ఉత్తరాలు చేరడానికి ఎంత కాలం పడుతుందో ఎవరికీ తెలియదు.

1874 లో ఈ చికాకులన్నీ తొలగి పోయాయి. ఇరవైకి పైగా దేశాలు ఒక ఒప్పందం కుదుర్చుకుని, ప్రపంచ తపాలా సమాఖ్య (యూనివర్సల్ పోస్టల్ యూనియన్. దీనిని క్లుప్తంగా యు. పి. యు అంటారు.)

స్థాపించాయి. ఈ సమాఖ్య కేంద్ర కార్యాలయం స్విట్జర్లాండ్‌లోని బెర్న్ నగరంలో నెలకొల్పబడి ఇప్పటికీ అక్కడే ఉంది.

అప్పటినుంచి శాంతి కాలంలోనూ, యుద్ధ కాలంలోనూ కూడా అది నిరాఘాటంగా పనిచేస్తూనే ఉంది. ప్రపంచ స్థాయిలో ఒక అత్యవసర సౌకర్యాన్ని కల్పించడానికి మానవుడు చేసిన అత్యంత జయప్రదమైన ప్రయత్నాలలో ఇది ఒకటి. ఈనాడు అందరి ప్రయోజనం కోసం వందకు



పైగా దేశాలు ఒక అంతర్జాతీయ తపాలా వ్యవస్థను నిర్వహిస్తున్నాయి. ప్రపంచ తపాలా సంఘం ఇప్పుడు ఐక్యరాజ్యసమితి శాఖ (ప్రత్యేక సంఘా)లలో ఒకటి అయింది. ఐక్యరాజ్యసమితి గురించి 10 వ అధ్యాయంలో చదువుదాం.

ఇంగ్లండ్‌కు చెందిన ప్రముఖ చరిత్రకారుడు హెచ్. జి. వెల్స్ ఒక సందర్భంలో చెప్పినట్లు, "ప్రతి రోజూ కొన్ని కోట్ల ఉత్తరాలు భూమి చుట్టూ హడావుడిగా తిరుగుతున్నాయి." ప్రపంచ తపాలా సంఘం పుణ్యమా అని తపాలా రేట్ల విషయంలో ఒకే పద్ధతి అమలులోకి వచ్చింది. ఎంత దూరం వెళ్ళవలసినా, ఎన్ని సరిహద్దులు దాటవలసినా, బరువును బట్టే తపాలా రేటును నిర్ణయించడం జరుగుతుంది.

ఇప్పుడు మీరు చదువుతున్న ఈ పేజీలను రచయిత లండన్ (ఇంగ్లండ్), రోమ్, (ఇటలీ), పారిస్, (ఫ్రాన్స్), జెనీవా (స్విట్జర్లాండ్), న్యూయార్క్ (అమెరికా)లలో ప్రయాణిస్తూ వ్రాశాడు. ఏ నగరంలో వ్రాసిన పేజీలను ఆ నగరం నుంచే విమాన తపాలా ద్వారా ప్రచురణ కర్తకు పంపాడు. ఇంగ్లండ్, ఇటలీ, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, అమెరికా దేశాల తపాలా ముద్రలతో అవి ప్రచురణకర్తకు చేరాయి. పెన్నీలైనా, లైర్లు అయినా, ఫ్రాంకులైనా, సెంట్లు అయినా వాటి అన్నింటి తపాలా ఖర్చు ఒకటే. ఐదు మార్గాల ద్వారా అవి రెండు రోజులు, లేక ఇంకా తక్కువ వ్యవధిలో చిరునామా దారునకు చేరాయి.

మన ప్రస్తుత ప్రపంచం ఇంతగా అభివృద్ధి చెందింది. ఇప్పుడు ప్రపంచ దేశాలన్నీ ఇరుగు పొరుగు కుటుంబాలుగా ఉన్నాయి. అలంకారికంగా చెప్పాలంటే—విమానం ప్రపంచ పటంలో నుంచి సముద్రాలను తుడిచివేసింది. రేడియో ప్రపంచ దూరాన్ని క్షణకాల దూరంలోకి మార్చివేసింది.

## దేశాల మధ్య తంతి సమాచార (సం) బంధాలు

19 వ శతాబ్దంలో ఇతర 'సంబంధ సాధనాల' విషయంలో కూడా ఇటువంటి అభివృద్ధే జరిగింది. ఈ క్రింది జాబితా చూడండి:

**1844** - తంతి సమాచార సాధనం (టెలిగ్రాఫీ) వాడుకలోకి వచ్చింది. శామ్యూల్ ఎఫ్. బి. మోర్స్ ప్రప్రథమ తంతి సందేశాన్ని బాల్టిమోర్ నుంచి వాషింగ్టన్‌కు పంపాడు. అందులో అతడు ఈ క్రింది పదాలను కొట్టాడు:

WHAT HATH GOD WROUGHT

['వాట్ హాత్ గాడ్ రాట్' - 'భగవానుడు సృష్టించినదేమిటి?']

**1866** - లండన్, న్యూయార్క్ నగరాల మధ్య సంభాషణకు వీలుగా అట్లాంటిక్ మహాసముద్ర గర్భంలో కేబుళ్ళు (తంతులు) వేశారు.

**1876** - అలెగ్జాండర్ గ్రాహంబెల్ టెలిఫోను కనిపెట్టాడు. వివిధ ప్రదేశాల ప్రజలు పరస్పరం నేరుగానే మాట్లాడుకోవడం ప్రారంభించారు.

**1894**- పెట్రోలు ఇంజన్లతో నడిచే మోటారు కార్లు వాడుకలోకి వచ్చాయి. ఇవి రైళ్ళతోనూ, స్టీమ్ ఓడలతోనూ పోటీ పడటం ప్రారంభించాయి.

**1896** - మార్కోనీ రేడియో కనిపెట్టాడు. ఇది టెలిగ్రాఫ్, టెలిఫోన్‌లతో పోటీ పడటం ప్రారంభించింది.

**1903**- రైట్ సోదరులు కనిపెట్టిన విమానం గాలిలో ఎక్కువసేపు ప్రయాణం చేయగలుగుతున్నది. మనిషి ఆకాశంలో 'ఎగర' గలడని అది నిరూపించింది.

ప్రపంచ వ్యాప్తంగా సంబంధ సాధనాలలో సాంకేతిక పద్ధతులు అభివృద్ధి చెందుతున్న కొద్దీ, వాటిని సమిష్టిగా, అత్యంత సమర్థంగా నిర్వహించుకొనడానికి దేశాలు ఒప్పందాలు కుదుర్చుకోవలసి వచ్చింది. ఉదాహరణకు, 1865 లో 20 దేశాలు అంతర్జాతీయ టెలిగ్రాఫ్ సంఘాన్ని స్థాపించాయి. తర్వాత పది సంవత్సరాలకు టెలిఫోన్ వచ్చినప్పుడు దానిని కూడా ఈ సంఘంలో చేర్చడం జరిగింది. ('సంఘం' అనే మాట అర్థాన్ని

గమనించండి!) రేడియో టెలిగ్రాఫీ కనిపెట్టిన తర్వాత ఇంకా విస్తృతమైన ఒడంబడికలు అవసరమైనాయి. 1906 లో బెర్లిన్ (జర్మనీ)లో జరిగిన ఒక మహాసభ అంతర్జాతీయ రేడియో సంఘాన్ని స్థాపించింది.

1932 లో మాడ్రిడ్‌లో జరిగిన ఒక మహాసభ ఈ రెండు రెండు సంఘాలను కలిపివేసి 'అంతర్జాతీయ తంతి వార్తా సంబంధాల



సంఘం' అని పేరు పెట్టింది. ఇది కూడా ఇప్పుడు ఐక్యరాజ్య సమితి శాఖలలో ఒకటి అయింది.

## మహా సభా పర్వం

గడచిన వంద సంవత్సరాల కాలంలో ప్రపంచంలో కొన్ని వేల మహా సభలు జరిగాయి. అన్ని ప్రముఖ నగరాలలోనూ, దాదాపు అన్ని విషయాల పైనా రాజకీయవేత్తలు, న్యాయవాదులు, ఇంజనీర్లు, డాక్టర్లు, వాస్తు శిల్పులు, ఆచార్యులు, నావికులు, కార్మిక నాయకులు మొదలయిన వారి అంతర్జాతీయ సమావేశాలు జరిగాయి. వీటిలో చాలా మహా సభలు, ప్రపంచ ఏకత్వ సాధనకు ఏదో ఒక రూపంలో నిరంతరం కృషిచేయడానికి సంఘాలను, లేక సంస్థలను స్థాపించాయి.




ఈనాడు, ఈ అంతర్జాతీయ సంస్థల నిర్వహణ ఏవిధంగా ఉన్నదో దాని వివరాలను ఈ పుస్తకంలోని మూడవ భాగంలో తెలుసుకుందాం. ఈలోగా ఒక్కసారి వెనక్కి తిరిగి చూస్తే, గడిచిన వంద సంవత్సరాలలో అంతర్జాతీయ మహాసభల ప్రాముఖ్యం అంతకంతకు విశేషంగా పెరుగుతూ

వచ్చినట్లు తెలుస్తుంది. ఈ క్రింద ఇచ్చిన సంఖ్యా వివరాల పట్టిక ఈ విష యాన్ని స్పష్టం చేస్తుంది.

## సర్వ మానవ శత్రువు - వ్యాధి

చాలా మహాసభలలో చర్చకు వచ్చిన విషయం ఆరోగ్యం. వ్యాధులు దేశ సరిహద్దులకు లోబడి ఉండవు కదా: గత శతాబ్దాలలో అన్నిటి కంటే కలరా వ్యాధి తీవ్రంగా ఉండేది. ఇటు వంటి వ్యాధులవల్ల ఒక్కొక్క ప్పుడు ఒక్కొక్క ప్రాంతపు జనాభా అంతా తుడిచి పెట్టుకు పోయేది వ్యాధి క్రిములకు రాజకీయ సరిహద్దు లేవీ అడ్డంకులుకావు—ఇప్పుడు పరిస్థితి మరీ అంత అధ్వ గోలగా లేదు.

కలరా. టైఫాయిడ్ వ్యాధులు ఓడలెక్కి ప్రపంచమంతటా తిరు గుతూ ఉండేవి. ఈ రోగాలు గల ప్రయాణీకులవల్ల, ఓడల్లో పచార్లు చేసే ఎలుకల వల్ల ఈ వ్యాధులు—ఆ ఓడలు ఏ ఏ దేశాలమీదుగా వెళ్తే-ఆ దేశా లన్నింటికీ వ్యాపించేవి. నౌకతీరం వద్ద ఆగినప్పుడు, తీరంనుంచి ఎలుకలు ఓడలోకి ఎక్కకుండా చేసేందుకు కొన్ని ప్రత్యేకమైన ఉపాయాలు ఈ నాడు కనిపెట్టారు ఆ రోజుల్లో అవి లేవు.

స్టీమ్ బోటులు వాడుకలోకి వచ్చిన తర్వాత ప్రజల ప్రయాణవేగం పెరిగింది ఈ వ్యాధుల నిరోధానికి ఏదైనా పద్ధతి ఉన్నదా అని పరిశీలించ డానికి వైద్య ప్రవీణుల అంతర్జాతీయ మహాసభలు జరిగాయి. 1851 నుంచి ఈ సభల సంఖ్య, ప్రాముఖ్యం అంతకంతకు పెరుగుతూ వచ్చింది, ప్రాచ్య, పాశ్చాత్య దేశాలన్నీ ఆరోగ్యం విషయమై ప్రత్యేకశ్రద్ధ వహించ డంతో ఈ సభలు ప్రపంచ స్థాయిలో జరగడం ప్రారంభమయింది.

1892లో మొట్టమొదటి అంతర్జాతీయ ఆరోగ్య మహాసభ జరిగినప్పుడు కుదిరిన ఒప్పందంపై పెక్కు ప్రభుత్వాలు సంతకాలు చేశాయి. తర్వాత ఆ ఒప్పందంలో ఇంకా ఎక్కువ దేశాలు చేరాయి. అంటు రోగాలు గల ప్రజలు, రోగాలను వ్యాప్తి చేయగల జంతువులు సరిహద్దులు దాటకుండా, మరొక దేశపు రేవులలో దిగకుండా చూడడం ఈ ఒప్పందపు ప్రధానలక్ష్యం. ఇటువంటి అంతర్జాతీయ ఆరోగ్యపథకాలే ప్రపంచ ఆరోగ్య సంఘం స్థాపనకు దారితీశాయి: ఈ సంఘం కూడా ఇప్పుడు ఐక్యరాజ్య సమితి శాఖలలో ఒకటిగా వుంది. దీని సంగతి పదవ అధ్యాయంలో వివరంగా తెలుసుకుందాం.

## దీన బాంధవులు

అయితే ఈ ప్రపంచ సంస్థలన్నీ ఐక్యరాజ్య సమితిలో శాఖలు కాలేదు. ఉదాహరణకు అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంస్థను తీసుకుందాం.

1864 లో ప్రష్యా, డెన్మార్కుల మధ్య యుద్ధం జరుగుతూ ఉండగా, జినోవాకు చెందిన డాక్టర్ అప్పియా ఎర్రటి సిలువగల తెల్లటి వస్త్రాన్ని ముంజేతికి కట్టుకుని యుద్ధరంగంలో ప్రవేశించాడు. యుద్ధ రంగంలో ఎర్ర సిలువ చిహ్నం (రెడ్ క్రాస్) కనిపించడం అదే మొదలు. అది అక్కడికి ఎలా వచ్చింది?

ఇదివరకు, గాయపడ్డ సైనికుడు ఎవరైనా విజేతచేత చిక్కితే వెంటనే అతడిని చంపివేసేవారు. పట్టుబడిన శత్రుసైనికుణ్ణి చంపకుండా వదిలిపెట్టడం చాలా అరుదుగా జరిగేది. చంపకపోవడం కూడా జాలితో కాదు-అతడిని బానిసగా ఉపయోగించుకోడానికే. అయితే—ఈ పుస్తకం మొదట్లో మనం చెప్పుకున్నట్లు-గ్రీకు నగర రాజ్యాలు క్షతగాత్రులైన

శత్రువులను కాస్త ఆదరంతో చూడడానికి కొన్ని ఒప్పందాలు కుదుర్చు కున్నమాట నిజమే



ఇది చాలా హెచ్చు ఎత్తున ప్రారంభమైన విషయం కాని, ఇటువంటి అంతర్జాతీయ న్యాయసూత్రాల అభివృద్ధి చెందాలంటే కొన్ని శతాబ్దాలు పడుతుంది. యుద్ధంలో 'మానవత'కు స్థానం కల్పించడానికి మధ్య మధ్య కొన్ని ప్రయత్నాలు జరుగుతూ ఉంటే, మనిషిలోని క్రౌర్యం వాటిని అణచివేస్తూ ఉండేది. ఈ కిరాతక స్వభావాన్ని ముందు అణచి వేయాలి.

1859 లో, జీన్ హెన్రీ డ్యూనాంట్ అనే స్విట్జర్లాండ్ వర్తకుడు ఇటలీలో ప్రయాణం చేస్తూ, సాల్ఫెరినో యుద్ధరంగంలో క్షతగాత్రులైన

సైనికుల దీనస్థితిని చూశాడు. హృదయ విదారకమైన ఆ దృశ్యాలను చూసి సహించలేక, వెంటనే అతడు వారికి వైద్య సహాయం ఏర్పాటు చేశాడు. స్విట్జర్లాండ్‌కు తిరిగి వచ్చిన తర్వాత తన హృదయ ఘోషను వ్యక్తం చేస్తూ ఒక పుస్తకం వ్రాశాడు. దేశదేశాల నాయకులందరూ దానిని చదివారు. యుద్ధరంగంలో గాయపడిన, జబ్బు పడిన సైనికులకు చికిత్స చేయడానికి, వారి ఆరోగ్యం విషయంలో శ్రద్ధ తీసుకోవడానికి ఒక అంతర్జాతీయ సంఘం రూపొందించాలని అతడు ఆ పుస్తకంలో విజ్ఞప్తి చేశాడు.



డ్యూనాంట్, అతడి మిత్రులు కలిసి ఇందుకోసం ఒక ఉద్యమం ప్రారంభించారు. ఫలితంగా 1864 లో "యుద్ధరంగంలో క్షతగాత్రులైన జబ్బుపడిన సైనికుల సాహాయ్యార్థం" ఒక అంతర్జాతీయ సమావేశం

కుదిరింది. దానిపై పెక్కు దేశాలు సంతకాలు చేశాయి. దానినే మొదటి జినీవా ఒప్పందం అని అంటున్నారు. అంతర్జాతీయ రెడ్‌క్రాస్ అవతరణకు అదే మూలం. తర్వాత చాలా మహాసభలు జరిగాయి; చాలా ఒప్పందాలు జరిగాయి; మానవకారుణ్యానికి సంబంధించిన ఇంకా పెక్కు కార్యాలను రెడ్‌క్రాస్‌కు అప్పగించడం జరిగింది.

20 వ శతాబ్దంలో, మొదటి నానాజాతి సమితి, తర్వాత ఐక్యరాజ్య సమితి యుద్ధసమయాలలో కష్టనష్టాలకు గురియైన యూరప్ ప్రజానీకానికి తిండి, బట్టా, ఇతర సదుపాయాలు కల్పించడానికి అంతర్జాతీయ రెడ్ క్రాస్ సాయాన్ని అర్థించాయి. మొదటి ప్రపంచ యుద్ధకాలంలోనూ, రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనూ పోరు జరిగే ప్రాంతాలలో లక్షలాది పురుషులకు, స్త్రీలకు, పిల్లలకు అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థ సేవచేసింది. విదేశాలలో యుద్ధ ఖైదీలుగా ఉన్న లక్షలాది సైనికులకు వారి స్వదేశాల నుంచి ఉత్తరాలను, ఆహార పదార్థాల బంగీలను చేరవేసింది. వారికి అవసరమైన వస్తువులెన్నో సమకూర్చింది.

రెడ్‌క్రాస్ కేంద్ర సంఘం స్విట్జర్లాండ్‌లోని జెనీవాలో ఉంది. అందులో ప్రముఖ న్యాయమూర్తులు, వైద్యులు, వాణిజ్యోద్యోగులు, వర్తకులు ఉండేవారు. వారెవ్వరూ జీతాలు తీసుకునేవారు కారు. ప్రధానమైన కార్యకలాపాలకు అయ్యే ఖర్చును అనేక ప్రభుత్వాలు, 'జాతీయ' రెడ్ క్రాస్ సంఘాల నిధులు భరించేవి.

అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థ మానవ జాతికి ఇంత గొప్ప సేవ చేస్తున్నందువల్ల అది "యుద్ధ రాజకీయాలతో నిమిత్తంలేని నిజమైన ప్రపంచ సంస్థ" అని అన్ని ప్రభుత్వాలు గుర్తించాయి. ఈ సంస్థకు అందరూ సాయం చేయవలసిన అవసరం ఉన్నదని కూడా గుర్తించడం

జరిగింది. ప్రభుత్వాల సంగతి అటుంచి, ఇప్పుడు ఎనభై కి పైగా దేశాలలో జాతీయ రెడ్‌క్రాస్ సంఘాలు ఉన్నాయి. ప్రపంచం అంతటా కలిపి, వీటి మొత్తం సభ్యుల సంఖ్య 10 కోట్లకు పైగా ఉన్నది.

యుద్ధాలు కాక, ఇంకా తుఫానులు, వరదలు, భూకంపాలు, క్షామాలు మొదలయిన ఉపద్రవాలవల్ల కూడా ప్రజలు పెక్కు కష్టనష్టాలకు గురి అవుతూ ఉంటారు. ఇటువంటి వారికోసం రెడ్‌క్రాస్ సంఘాల సమాఖ్య ప్రపంచ దేశాలన్నింటి నుంచి డబ్బు, ఆహారం, బట్టలు, ఇతర అవసర వస్తువులను సేకరించి. వారికి అందజేస్తుంది. రెడ్‌క్రాస్ సంస్థ ధ్యేయం ఏమిటో ఈ అధ్యాయం ముగింపులో చూడండి.

## యుద్ధాన్ని రూపుమాపడం ఎలా ?

రెడ్‌క్రాస్ మహాసభలు ఎప్పుడూ యుద్ధబాధితుల పరిస్థితులు చక్క బరిచేందుకు సహాయ్య కార్యక్రమాలను గురించె ఆలోచిస్తూ ఉండేవి. అసలు యుద్ధాలే లేకుండా చేయాలని ఇంకా ఎన్నో మహాసభలు 19వ శతాబ్దంలో ప్రయత్నించాయి.

ఇది చాలా కష్టసాధ్యమైన పని. ఎందుకంటే, చిరకాలంగా యుద్ధం అనేది కొన్ని లక్షలమంది మనుషులకు ముఖ్య చర్యగా ఉంటున్నది. గత చరిత్రతో గల బంధం, స్వదేశ శ్రేయస్సు పట్ల ఆకాంక్షకూడా యుద్ధంతో ముడివడి ఉన్నాయి. కొద్దికాలం క్రితం వరకు ప్రజలు యుద్ధం 'అనివార్యమ'నే భావిస్తూ వచ్చారు. అంటే, ప్రకృతి సహజమైన ఉపద్రవాలు ఎటువంటివో యుద్ధాలూ అటువంటివేనని విశ్వసించేవారు. యుద్ధాలు మనిషి సృష్టించినవనీ, వాటిని మనిషే నిరోధించగలడనీ గ్రహించ కలగడానికి చాలాకాలం పట్టింది.

కాని, యుద్ధాన్ని నిషేధించడం ఎలా? దీనికి ఒక మార్గం 'మధ్యవర్తిత్వ' సూత్రం. రెండు జాతుల మధ్య వివాదాన్ని మూడవ పక్షంవారు మధ్యవర్తిత్వం ద్వారా పరిష్కరించగలిగితే యుద్ధం లేకుండా పోతుందని క్రమంగా రాజకీయవేత్తలకు, మేధావులకు గట్టి నమ్మకం ఏర్పడింది.



మనం మూడవ అధ్యాయంలో చూసినట్లు, రాజుల మధ్య వివాదాలు చెలరేగినప్పుడు కొన్ని సందర్భాలలో పోప్ కల్పించుకునేవాడు. ఆ తర్వాత కాలంలో పలువురు మేధావులు 'శాంతి పథకాలు' తయారు చేశారనీ. యుద్ధాలకు దిగకుండా మధ్యవర్తిత్వం ద్వారా వివాదాలను పరిష్కరించుకోవలసిందని వారు జాతీయ ప్రభుత్వాలకు విజ్ఞప్తి చేశారనీ ఆరవ అధ్యాయంలో చెప్పుకున్నాము.

ఇక 19 వ శతాబ్దంలో ఈ సూత్రాలను ఆచరణలో పెట్టే పని మిగిలింది. "న్యాయం కావాలి-యుద్ధం కాదు" అనే నినాదాన్ని-నిరర్థకమైన దని కొట్టివేయకుండా-శ్రద్ధగా వినడం ప్రారంభించారు. అయితే అది మందకొడి వ్యవహారంగానే ఉంది. ముందు కొన్ని సంఖ్యా వివరాలను చూద్దాం; తర్వాత, నిరుపద్రవంగా జరిగిన ఒక మధ్యవర్తిత్వాన్ని గురించి, అది అందరి దృష్టినీ ఎంతగా ఆకర్షించిందో దానిని గురించి చెప్పుకుందాం.

1820, 1840 సంవత్సరాల మధ్యకాలంలో, సార్వభౌమాధికారం గల ప్రభుత్వాల మధ్య ఎనిమిది మధ్యవర్తిత్వ ప్రయత్నాలు జరిగాయి; 1840, 1860 సంవత్సరాల మధ్య ఇటువంటి ప్రయత్నాలు ముప్ఫయి జరిగాయి; 1860, 1880 సంవత్సరాల మధ్య నలభై నాలుగు పరిష్కారాలు జరిగాయి. ఈ సంఖ్యలు అంతకంతకు పెరుగుతూ వచ్చాయి. దేశాలమధ్య "మధ్యవర్తిత్వం" ఒక అలవాటు అయింది. వీటివల్ల వచ్చి ఉన్న యుద్ధాలు అనేకం ఆరంభం కాకుండానే ఆగిపోవడం కూడా జరిగింది, ఇది మానవుని ఇంగితజ్ఞానానికి గొప్ప విజయం.

ఇప్పుడు ఒక ఉదాహరణ చెప్పుకుందాం. 1862 లో, అమెరికాతో ఏర్పడిన ఒక పెద్ద వివాదం విషయంలో బ్రిటన్ మధ్యవర్తిత్వానికి అంగీకరించింది. అసలు జరిగినదేమిటంటే, అమెరికాలో జరిగిన అంతర్యుద్ధంలో దక్షిణాది రాష్ట్రాలను బ్రిటన్ సమర్థించింది. వాటికి వత్తాసుగా 'అలబామా' అనే ఒక యుద్ధ నౌకను ఆయుధాలతోనూ, సిబ్బందితోనూ పంపింది. అంతర్జాతీయ న్యాయ శాస్త్రాన్ని అనుసరించి ఈ చర్య అక్రమమైనది. 'అలబామా' నౌక చర్యలవల్ల ఉత్తరాది రాష్ట్రాల నౌకలకు విశేష నష్టం సంభవించింది; ప్రాణనష్టం కూడా చాలానే జరిగింది. అందుకోసం అమెరికా ప్రభుత్వం బ్రిటన్‌ను నష్టపరిహారం చెల్లించవలసిందని అడిగింది.

బ్రిటన్ అంగీకరించకపోవడంతో వివాదం ఏర్పడింది. అది చాలా క్లిష్టమై, ఉద్రిక్త పరిస్థితి నెలకొన్నది. అయితే అది యుద్ధానికి దారితీయకుండా నిష్పాక్షికమైన మధ్యవర్తుల సంఘం ఒకటి కల్పించుకుని ఇరు దేశాలను సమాధానపరచింది. బ్రిటిష్ ప్రభుత్వం అమెరికా ప్రభుత్వానికి 30 లక్షల పౌండ్లు (అప్పటి విలువ ప్రకారం 120 లక్షల అమెరికన్ డాలర్లు) నష్టపరిహారం చెల్లించాలని ఆ సంఘం తీర్పు చెప్పింది. అందుకు బ్రిటన్ అంగీకరించి, ఆ ధనాన్ని చెల్లించింది. అంతటితో ఆ తగవు తీరిపోయింది— తర్వాత దాని సంగతే మరచిపోయారు.

ఈ చక్కని ఉదాహరణను చూసి, ఇతర దేశాలు కూడా ఈ పద్ధతిని అనుసరించాయి. మధ్యవర్తిత్వం జరిగిన చాలా సందర్భాలలో, మధ్యవర్తులు చెప్పిన తీర్పును ఆ యా దేశాలు అక్షరాలా పాటించడం జరిగింది. ఈ పద్ధతి అందరికీ ప్రయోజనకరంగా కనిపించింది వివాదాల శాంతియుత పరిష్కారానికి ఆ విధంగా ప్రాతిపదిక ఏర్పడింది.

వివాదాన్ని మధ్యవర్తిత్వానికి అప్పగించకపోవడానికి 'జాతీయ శ్రేయస్సు'ను సాకుగా కొన్ని ప్రభుత్వాలు [illegible]. భయం వల్లనో, నాంఛవల్లనో జాతీయ [illegible] యీ శాంతియుత పరిష్కార పద్ధతిని అంగీకరించేవి [illegible] న్యాయం సంగతి పక్కకు నెట్టి యుద్ధానికి తలపడేవారు. ఇటువంటి దేశాల మధ్య యుద్ధాలను నిరోధించడానికి మధ్యవర్తిత్వం కాక, అంతకు మించిన మరొక పద్ధతి అవసరమయింది. ఈ 'శాంతి పరిరక్షణ' సమస్య చాలా పెద్దది. దీనిని యీ పుస్తకం మూడవ భాగంలో చర్చించుదాం.

## అంతర్జాతీయ న్యాయస్థానానికి పునాది

ఏమైనప్పటికీ, మధ్యవర్తిత్వం పద్ధతి సాగుతూనే వుంది. అయితే, రెండు దేశాల మధ్య సంఘర్షణ చెలరేగినప్పుడల్లా మధ్యవర్తులుగా వ్యవహరించడానికి గౌరవనీయులు, విశ్వాసపాత్రులు అయినవారు ఎవరు దొరుకుతారా అని అప్పటికప్పుడు వెతుక్కోవడం చిరాకు వ్యవహారంగా ఉండేది. ప్రపంచం అంతటికీ ఉమ్మడిగా ఒక శాశ్వత న్యాయస్థానం ఉంటే— వ్యక్తులు తమ వ్యక్తిగత వివాదాలను ఆ న్యాయస్థానానికి అప్పగించుకునేందుకు మరింత సుముఖంగా ఉండేవి.



విశాలదృష్టిగల న్యాయవాదులు తరచుగా ఈ విషయాన్ని చర్చిస్తూ ఉండేవారు. 1899 లో వారు హేగ్ (హాలెండ్) లో ఒక సమావేశం జరిపారు. దీనినే మొదటి హేగ్ మహాసభ అని వ్యవహరించేవారు. ఈ సభలో

"వివాదాల శాంతియుత పరిష్కార పద్ధతి" విషయంలో ఒప్పందం కుదిరింది.

ఆ సంవత్సరంలోనే 26 దేశాలు కలిసి హేగ్‌లో అంతర్జాతీయ మధ్యవర్తిత్వ న్యాయస్థానాన్ని స్థాపించాయి. ఇది నిజమైన అంతర్జాతీయ న్యాయస్థానం కాదు; ఏ దేశమైనా యిష్టం ఉంటే ఈ న్యాయస్థానానికి వెడుతుంది. లేకపోతే లేదు; వెళ్ళితీరాలన్న నిర్బంధం లేదు. అయినా, హేగ్‌లోని మధ్యవర్తులు ఏడాదికి కనీసం రెండు మూడు అంతర్జాతీయ వివాదాలను పరిష్కరిస్తూ ఉండేవారు. కాస్త ఇంగిత జ్ఞానం ఉన్నవారు యుద్ధంకంటే ఈ పద్ధతి మంచిదని గ్రహించారు.

1907 లో రెండవ హేగ్ మహాసభ జరిగింది. ఈ మహాసభ మరింత వివరంగా నియమావళి తయారు చేసింది. దీనిపై మరిన్ని దేశాలు సంతకాలు చేశాయి. దేశాలమధ్య వివాదాలలో నిష్పక్షపాతంగా వ్యవహరించడానికి సంబంధించిన చర్యలను ఈ ఒప్పందంలో పేర్కొనడం జరిగింది కాని, దురదృష్టమేమిటంటే—నిజంగా పెద్ద వివాదాలేవీ హేగ్ న్యాయస్థానానికి వచ్చేవి కావు వాటిని దౌత్య ఉద్యోగులకు అప్పగించే వారు; వారివల్ల కాకపోతే సైన్యాధిపతులకు అప్పగించేవారు.

1914 లో మూడవ హేగ్ మహాసభ జరగబోతూ వుండగా మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. ఆ ఏడాది హేగ్ మహాసభకు హాజరు కావలసి వున్న దేశాలు పరస్పరమే ఆ యుద్ధం ప్రారంభమయింది. దానితో హేగ్ న్యాయస్థానాన్ని సుస్థిరం చేయడానికి ఉద్దేశించిన పథకాలను పక్కన పెట్ట వలసి వచ్చింది. వివాదాలను శాంతియుతంగా పరిష్కరించే క్రొత్త పద్ధతి అడుగున పడిపోయి, సాంప్రదాయికమైన బలప్రయోగ పద్ధతి పైకి వచ్చింది.

అంతర్జాతీయ సహకారానికి ఉద్దేశించిన ఇతర పథకాలు, కార్య క్రమాలు కూడా మొదటి ప్రపంచ యుద్ధంవల్ల అణగారిపోయాయి. అయితే, అవి పూర్తిగా తుడిచిపెట్టుకుపోలేదు వాటిలో కొన్ని—ఉదాహరణకు రెడ్‌క్రాస్—మరింత బలాన్ని పుంజుకున్న మాట కూడా నిజం. ఎందుకంటే



వాటి అవసరం ఎంతగా ఉన్నదో యుద్ధం నిరూపించింది. 1919 లో యుద్ధం ముగియగానే, ఛిన్నాభిన్నమైపోయిన ప్రపంచ సమైక్యాన్ని మళ్ళీ మరమ్మతు చేసి, శాంతిని నెలకొల్పే పని ప్రారంభమయింది.

చివరికి 'శాశ్వత' న్యాయస్థానం హేగ్‌లో ఎలా స్థాపించబడిందో వచ్చే అధ్యాయంలో చెప్పుకుందాం.

## యూరప్ కూటమి

అయితే, మూడవ భాగంలో ప్రవేశించేముందు, శాంతి పరిరక్షణకు సంబంధించిన అతి క్లిష్ట సమస్యలలో ఒకదానిని పరిశీలించుదాము.

(మూడవ భాగంలో చర్చించేవి 20 వ శతాబ్దపు విషయాలు). ప్రపంచ సమైక్యానికి తీసుకునే చర్యలకు స్థిరమైన రాజకీయ ప్రాతిపదిక లేకపోతే వాటివల్ల ప్రయోజనమేమీ ఉండదు. ప్రపంచంలో 'క్రమస్థితి' లేకుంటే స్వాతంత్ర్యం, ఆహారం, స్నేహం—వీటికోసం మానవుడు జరిపే అన్వేషణ నిరర్థకమవుతుంది.

సార్వభౌమాధికారం గల దేశాల మధ్య శాంతిని కాపాడేందుకు చేసిన ప్రయత్నాలన్నింటిలోకి పెద్దది 'యూరప్ కూటమి'ని స్థాపించడం. యూరప్ దేశాలన్నింటి బలం సమ తూకంలో ఉంచాలన్నది ఈ కూటమి ప్రధానాశయం. ప్రమాదం తలయెత్తినప్పుడల్లా—అది యుద్ధానికి దారితీయకుండా జాగ్రత్త పడేందుకు—పరస్పరం సంప్రతించుకొనడానికి యూరప్ నాయకులు అంగీకరించారు.

అయితే, అప్పటికి ఒక 'శాశ్వత' శాంతి సంస్థ ఇప్పటిలాగా లేదు. 19 వ శతాబ్దం అంతటా ఈ 'కూటమి' చాలా సమావేశాలు జరిపింది. కాని, ప్రతి నాయకుడు బెదిరించో, బెల్లించో సైనిక బలం తనవైపు మొగ్గేటట్లు చేయడానికి ప్రయత్నించేవాడు. తూకం తమవైపు మొగ్గాలని అందరూ ప్రయత్నించేసరికి ఎవరికీ అది వీలు కాలేదు. దాని ఆయుధాల పేకరణలో పోటీ ఆరంభమయింది. తూకం పూర్తిగా భగ్నమైపోయింది.

'బలా బలాల సమతౌల్యం' పద్ధతి వల్ల యూరప్ చాలా సంవత్స రాలు ప్రశాంతంగానే ఉన్నప్పటికీ, లోలోపల సాయుధ బలాలను సమీ కరించుకొనడం జోరుగా సాగుతూనే వుంది. 1914 నాటికి ఉద్రిక్తత పరా కాష్ఠ నందుకున్నది. 'కూటమి' కథ ముగిసిందనడానికి ప్రమాద సంకేతం కనిపించింది. సైనిక కూటములపై ఆధారపడిన అధికార రాజకీయాల పర్యవసానం ఏమిటో ప్రపంచానికి తెలిసి వచ్చింది. మొదటి ప్రపంచ యుద్ధం సంభవించింది. అంతకు ముందు ఎన్నడూ కనీ విని ఎరుగనంతటి రక్తపాతం జరిగింది.

నాలుగు సంవత్సరాలపాటు నిర్విరామంగా జరిగిన అమానుష హత్యాకాండ, విధ్వంసనకాండ తర్వాత ఏర్పడిన పరిస్థితి గురించి దక్షిణ ఆఫ్రికాకు చెందిన జనరల్ జాన్‌స్మట్స్ ఇలా చెప్పాడు: "ప్రపంచంలో రెండే మార్గాలున్నాయి—ఒకటి బల ప్రయోగ మార్గం, రెండవది పరస్పరావ గాహన మార్గం. వీటిలో మొదటి మార్గాన్ని చిట్టచివరి కొనవరకు చూశాం. అది ప్రపంచాన్ని శిథిలావశేషాల కుప్పగా తయారుచేయడం కూడా కళ్ళారా చూశాం."

## శేష ప్రశ్న

ఇక ఈ అధ్యాయంలో చివరికి మిగిలిన ప్రశ్న యిది: నలుసు లాంటి ఈ భూగోళంమీద మానవజాతి రాజకీయ వ్యవహారాలను ఆధునిక జీవితావసరాలకు అనుగుణంగా మలచుకోవడం ఎలా? అంతర్జాతీయ సంఘర్షణలను రూపుమాపి, దాని స్థానంలో అంతర్జాతీయ సహకారం ప్రాతి పదికగా గల ప్రపంచ వ్యవస్థను రూపొందించడం ఎలా? సూటిగా చెప్పా లంటే—ప్రపంచ శాంతిని పరిరక్షించడం ఎలా?

ఈ ప్రశ్నకు సమాధానం సాధించగలమనే విశ్వాసమే మూడవ భాగానికి ముఖ్యవస్తువు. రెడ్‌క్రాస్ సంస్థ అనుసరించే ఈ క్రింది ఆదర్శ సూత్రంతో ఆ విశ్వాసమే అభివ్యక్తమవుతుంది.

"అన్ని జాతులకు ప్రధానమైనది మానవ జాతి"

# 9

# మానవుని మొదటి పార్లమెంటు

రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో ప్రతి ఏడాది ఆరవై కిపైగా దేశాలనుంచి వందలాది రాజకీయవేత్తలు, దౌత్య ఉద్యోగులు, ప్రపంచ నాయకులు స్విట్జర్లాండ్‌లోని జెనీవా నగరానికి వస్తూ వుండేవారు. నానాజాతి సమితి వార్షిక సమావేశంకోసం వారు ఈ సుందర నగరాన్ని సందర్శిస్తూ వుండేవారు.

1919 నుంచి 1939 వరకు 20 సంవత్సరాలపాటు జెనీవా నానాజాతి సమితి ప్రధాన కార్యాలయ స్థానంగా ఉన్నది. సమితి తాలూకు మండలి, ఇతర అంగాల కార్యాలయాలన్నీ జెనీవాలోనే ఉండేవి.

ఆ విధంగా చివరికి, ప్రపంచపు మొదటి పార్లమెంటు (లేక ఆ మాదిరిది) రూపొందింది. దానిని గురించిన మూడు ప్రశ్నలకు సమాధానం చెప్పడమే ఈ అధ్యాయంలో ప్రధాన విషయం. ఆ ప్రశ్నలు యివి.

నానాజాతి సమితి ఎలా ఏర్పడింది? అది చేసిన పని ఏమిటి? చివరికి జరిగినదేమిటి?

## 'యుద్ధాన్ని రూపుమాపడానికి యుద్ధం'

1914 నుంచి 1918 వరకు యూరప్‌లోనూ, ఆసియాలోని పెక్కు ప్రాంతాలలోనూ మొదటి ప్రపంచ యుద్ధం భీభత్సాన్ని సృష్టించింది. కోటి మంది ప్రజలు మరణించారు. ఇంకా ఎన్నో కోట్లమంది శారీరకంగా, మానసికంగా రకరకాల బాధలకు, వ్యాధులకు గురియై జీవచ్ఛవాలైనారు

యూరప్‌లో సగం శిధిలమైపోయింది. రాజులు, చక్రవర్తులు సింహాసనాలమీదనుంచి దొర్లగిలపడ్డారు. రష్యాలో హింసాత్మక విప్లవం చెలరేగుతూంది. యుద్ధంవల్ల ఛిన్నాభిన్నమైపోయిన దేశాలకు—లెక్క లేనంతమంది యుద్ధ ఖైదీలు, కొంపలు కోల్పోయిన కాందిశీకులు—మరింత పెద్ద బెడదగా తయారయ్యారు. ఆకలితో అలమటించిపోయే ప్రజలు "ఇంక ఎన్నటికీ యుద్ధం వద్దు బాబోయ్" అని ముక్తకంఠంతో ఆక్రందనలు చేశారు.

ప్రపంచంలో అంతకుముందు ఎన్నడూ అంతటి మారణహోమం జరగలేదు. అది "యుద్ధాన్ని రూపుమాపడానికి చేసిన యుద్ధం" అని రాజకీయవేత్తలు వ్యాఖ్యానించారు గానీ, అది ఎంతమాత్రం నిజం కాదు. అది యుద్ధాన్ని రూపుమాపిందేమీ లేదు. పైగా అది రెండవ ప్రపంచ యుద్ధానికి దారి తీసింది. రెండవ ప్రపంచయుద్ధం అనేది వేరే యుద్ధమేమీ కాదు — మొదటి ప్రపంచ యుద్ధపు ఉత్తరార్థమే! అయితే, కొన్ని దేశాలు మాత్రం ఒక పక్షంనుంచి మరొక పక్షంలోకి మారాయి. యుద్ధం ఎప్పుడూ యుద్ధాన్ని రూపుమాపలేదు.

1919 లో యుద్ధానంతర పరిస్థితిని చక్కబరచడానికి పారిస్‌లో శాంతి మహాసభ జరిగింది. నాలుగు సంవత్సరాలపాటు ఒక దేశం యింకొక దేశంపై ద్వేషాగ్నిని కురిపించింది. విద్వేష ప్రకటనకు ఎన్ని సాధనాలైతే ఉన్నాయో అన్ని సాధనాలనూ "శత్రువు"పై ప్రయోగించడం జరిగింది. ఇంత జరిగిన తర్వాత ఇక ఒప్పందం కుదరడం అనేవి—విజేతల మధ్య కూడా దాదాపు అసాధ్యమయింది.



అయితే అదృష్టవశాత్తూ, ఒకవైపు యుద్ధం సాగుతూ ఉండగానే —పరిస్థితులు అనుకూలించినప్పుడు స్థిరమైన శాంతిని నెలకొల్పడానికి తగు పథకాలు తయారు చేయడం, వాటిని చర్చించడం జరుగుతూ వచ్చింది. ఇటువంటి వాటిని 80 పథకాలను పరిశీలించడం జరిగింది. వీటిలో చాలా 'శాంతి పథకాలు' మనం ఆరవ అధ్యాయంలో చూపినమాదిరివే. ఈ పథ

కాలన్నింటినీ ఉపయోగించుకుని, యుద్ధాన్ని శాశ్వతంగా నిర్మూలించడానికి ఒక 'అంతర్జాతీయ వ్యవస్థ'ను రూపొందించాలని ఆలోచించడం ప్రారంభించారు.

ఎటువంటి శాంతిని నెలకొల్పాలో స్పష్టంగా ఆలోచించిన ప్రముఖ నాయకులు అమెరికా అధ్యక్షుడు వుడ్రోవ్‌విల్సన్, బ్రిటన్‌కు చెందిన రాబర్ట్‌సిసిల్ ప్రభువు, దక్షిణ ఆఫ్రికాకు చెందిన జనరల్ స్మట్స్, నార్వేకు చెందిన డాక్టర్ ఫ్రిట్జాఫ్ నాన్సెన్. 1919 'శాంతి ఒడంబడిక' అనబడే దానిపై ఇతర రాజకీయ నాయకులు కూడా సంతకాలు చేశారు. కానీ, నిజంగా ద్వేషానికి, పగకు మనస్సులో తావివ్వకుండా విశాల దృష్టితో పరిస్థితులను అవగాహన చేసుకున్నవారు మాత్రం ఆ నలుగురే. ప్రపంచ ప్రజలందరి శ్రేయస్సును గురించి తాపత్రయ పడినవారు వారే। 20 వ శతాబ్దానికి చెందిన గొప్ప "అంతర్జాతీయ వాదుల"లో వారిని లెక్కించవచ్చు.

## నానాజాతి సమితి ఒడంబడిక

నానాజాతి సమితి ఒడంబడికను రూపొందించడానికి అమెరికా అధ్యక్షుడు విల్సన్ శాంతి మహాసభకు హాజరైనప్పుడు ఇలా అన్నారు : "పాలితుల ఆమోదం ప్రాతిపదికగా న్యాయ పాలనా వ్యవస్థను నెలకొల్పాలని మనం ప్రయత్నిస్తున్నాము."

ఆ ఒడంబడిక చరిత్రాత్మకమైనది. అందులో లోపాలు ఎన్ని ఉన్నప్పటికీ, అసలు ప్రపంచ రాజ్యాంగాన్ని రూపొందించడానికి మానవులు చేసిన మొదటి ప్రయత్నం అదే. అందులో 26 ప్రకరణాలు ఉన్నాయి. నూతన ప్రపంచ వ్యవస్థ నిర్వహణకు సంబంధించిన సూత్రాలు అందులో ఉన్నాయి. ఈ సూత్రాలను ఇక్కడ సంగ్రహంగా పరిశీలించుదాం.

(నాటక ప్రదర్శనానికి ముందు 'డ్రెస్ రిహార్సల్'లాగా ఈ సూత్రాలు ఐక్య రాజ్యసమితి అవతరణకు తోడ్పడినాయి.)

స్వపరిపాలనగల దేశాలన్నీ ఇందులో సభ్యులుగా చేరాలని ఒడంబడిక ఆశయం. (ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఈ పథకంలో వలస రాజ్యాలన్నింటినీ వాటి సొంత పేర్లతో చేర్చలేదు — వాటికి స్వపరిపాలన లభించినది ఇటీవలనే కనుక. ఇప్పుడు ఇటువంటి దేశాలన్నీ ఐక్య రాజ్యసమితిలో పూర్తి సభ్యులుగా ఉన్నాయి.)

ఆ విధంగా 'పవిత్రమైన ఒడంబడిక'కు కట్టుబడిన నానాజాతి సమితి సభ్యదేశాలన్నీ, విశిష్ట ప్రపంచాన్ని సృష్టించడంకోసం తమలో తాము శాంతి సఖ్యాలతో మెలగుతామనీ, ఒకరి కొకరు సాయం చేసుకుంటామనీ ప్రమాణం చేశాయి. 1919 లో, వెంటనే 40 స్వతంత్ర దేశాలు సమితిలో చేరాయి. ఆ తర్వాత మరి 21 దేశాలు చేరాయి. అంటే అప్పటి ప్రపంచ జనాభాలో నూటికి 90 మందికి ఈ సమితి కార్యకలాపాలు వర్తించి నట్లయింది.

## నానాజాతి సమితిలోని 61 సభ్య దేశాలు

## (1919—1939)

| | | |
|---|---|---|
| అబిసీనియా | ఈక్వడార్ | మెక్సికో |
| ఆఫ్ఘనిస్తాన్ | ఈజిప్టు | నెదర్లాండ్స్ |
| అల్బేనియా | ఈస్టోనియా | న్యూజిలాండ్ |
| అర్జెంటినా | ఫిన్లెండ్ | నార్వే |
| ఆస్ట్రేలియా | ఫ్రాన్స్ | పనామా |
| ఆస్ట్రియా | జర్మనీ* | పెరుగ్వే* |

| | | |
|---|---|---|
| బెల్జియం | గ్రీస్ | పెరూ |
| బొలీవియా | గ్వాటెమాలా | పోలెండ్ |
| బ్రెజిల్* | హైతీ | పోర్చుగల్ |
| బ్రిటన్ | హోండురాస్ | రష్యా* |
| బల్గేరియా | హంగరీ | సాల్వడార్* |
| కెనడా | ఇండియా | సయాం |
| చిలీ* | ఇరాక్ | స్పెయిన్* |
| చైనా | ఇరాన్ | దక్షిణ ఆఫ్రికా |
| కొలంబియా | ఐర్లండ్ | స్వీడన్ |
| కోస్టారికా | ఇటలీ* | స్విట్జర్లాండ్ |
| క్యూబా | జపాన్* | టర్కీ |
| జెకొస్లవాకియా | లట్వియా | ఉరుగ్వే |
| డెన్మార్క్ | లైబీరియా | వెనిజులా* |
| డొమినికా | లిత్వానియా | యుగోస్లావియా |
| | లక్సెంబర్గ్ | |

అమెరికా నానాజాతి సమితిలో చేరకపోయినప్పటికీ, ఇది ప్రపంచ సమైక్యానికి చేసిన గొప్ప కృషి అని చెప్పక తప్పదు. అంతకు ముందు చరిత్రలో ఎప్పుడూ ఇటువంటిది జరగలేదు. ఒక నూతన శకానికి అది నాంది అనిపించుకుంది. ఒక్క యూరప్ దేశాలు మాత్రమే కాక, ఆసియా, ఆఫ్రికా, అమెరికా ఖండాలలోని దేశాలు కూడా అందులో చేరాయి కాబట్టి, దాదాపుగా అది 'విశ్వ' సమితి (Universal League) అయింది.

---

* ఈ గుర్తు గల పది దేశాలు మధ్యలోనే సమితినుంచి అప్పుడొకటి అప్పుడొకటిగా నిష్క్రమించాయి.

మానవుడు రూపొందించిన ఈ మొట్టమొదటి పార్లమెంటు జయప్రదం కావాలని ప్రపంచంలోని కోట్ల ప్రజలు ఆకాంక్షించారు.

ఇక్కడ ఒక చిన్న వివరణ అవసరం. 'పార్లమెంటు' అనే పదాన్ని ఒక ఆదర్శం అనే ఉద్దేశంతోనే ఉపయోగించాము. అంతేగానీ, సమితి ప్రభుత్వం కాదు. అమెరికా, ఆస్ట్రేలియాలోని ఫెడరల్ ప్రభుత్వం వంటిది కాదు ఈ సమితి. ఇది స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం గల దేశాల సంఘం మాత్రమే. ఈ అంశాన్ని గ్రహిస్తే సమితికి సంబంధించిన విషయాలన్నీ మనకు తేలికగా అర్థమవుతాయి.

సమితిలోని వివిధాంగాలు ఏమిటో, వాటి నిర్మాణం ఏ విధంగా ఉన్నదో 184 వ పేజీలోని పటం స్థూలంగా చూపుతుంది.

పటం మధ్య భాగంలో చూడండి: సర్వ ప్రతినిధిసభ మండలి, సచివాలయం, పెక్కు సంఘాలు కనిపిస్తాయి. సమితి నిర్వహణ వాటి ద్వారానే జరుగుతుంది.

## సర్వ ప్రతినిధి సభ (Assembly)

సర్వ ప్రతినిధిసభ సభ కనీసం ఏడాదికొక సమావేశ మవుతుంది. అందులో ఒక్కొక్క దేశానికి ముగ్గురు ప్రతినిధుల చొప్పున ఉంటారు. అయితే, ఒక్కొక్క దేశపు ప్రతినిధివర్గానికి ఒక్కొక్క వోటు మాత్రమే ఉంటుంది. ఫ్రెంచి, ఇంగ్లీషు అధికార భాషలు. అయితే తమ అనువాదకులను తాము వెంట తెచ్చుకునేటట్లయితే ప్రతినిధులు ఏ భాషలోనైనా మాట్లాడవచ్చు.

అంతకంతకు ఈ వార్షిక సమావేశాలకు ప్రాముఖ్యం హెచ్చింది. ప్రధానమంత్రులు దేశాధినేతలు, విదేశాంగ మంత్రులు, ప్రభుత్వ ప్రధాన

కార్యదర్శులు ఈ సమావేశాలకు హాజరు కావడం అలవాటుగా మారింది. అన్ని దేశాలనుంచి పత్రికా విలేఖరులు జెనీవాకు వచ్చేవారు. వారివల్ల సర్వ ప్రతినిధిసభ సమావేశాలకు విశేష ప్రచారం జరిగేది




జాతీయ నాయకులకు నలుగురి దృష్టిలో పడడం అంటే చాలా యిష్టం. అటువంటి అవకాశం సమితి కల్పించేది. అయితే ఒక్క విషయం మనం జ్ఞాపకం పెట్టుకోవాలి—ప్రతినిధులందరూ తమ దేశాల తరఫునే మాట్లాడేవారు. నార్వేకు చెందిన డాక్టర్ ఫ్రిట్జాఫ్ నాన్సెన్‌వంటి చాలా కొద్దిమంది—సర్వుల గౌరవానికి పాత్రులైనవారు—మాత్రం ప్రపంచ మంత

టినీ దృష్టిలో ఉంచుకుని మాట్లాడేవారు. ఆ విధంగా సర్వ ప్రతినిధి సభ జాతీయ దృక్పథాల ప్రకటనకు ఒక్కని వేదిక అయింది. అంతే గానీ, అది తనకు తాను ఒక పరిపూర్ణమైన, వాస్తవమైన పార్లమెంటు కాలేదు

అయితే, "జెనీవా సామరస్యం" (దానిని అలాగే వ్యవహరించేవారు) ఈ వివిధ ధృక్పథాలను మేళవించడానికి చాలా తోడ్పడింది. ప్రతి సంవత్సరం అక్కడ కలుసుకొనడంవల్ల ప్రతినిధులు ఒకరి సమస్యలను మరొకరు, ఒకరి ఆశయాలను మరొకరు మరింత లోతుగా అవగాహన చేసుకో గలిగారు. ఈ భావాన్నే ఒక ప్రతినిధి ఇలా చెప్పాడు: "నేను జెనీవాకు రాకముందు నాదేశ శ్రేయస్సుకు ఏది ఉత్తమమని భావించేవాడినో దానికే సమ్మతి తెలిపేవాడిని. కాని, ఇప్పుడు మానవజాతి అంతటికీ ఏది శ్రేయోదాయకమని భావిస్తున్నానో దానికి సమ్మతి తెలుపుతున్నాను ఎందుకంటే, వెంటనే కాకపోయినా ఎప్పటికైనా అదే నా దేశానికి కూడా శ్రేయస్సు చేకూర్చగలదని తెలుసుకున్నాను."

## మండలి (Council)

ఇది సర్వ ప్రతినిధి సభ కంటే చాలా చిన్నది ఇది ఏడాదికి మూడు లేక నాలుగుసార్లు సమావేశమయ్యేది. మొదట్లో నాలుగు అగ్ర రాజ్యాలు—బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, జపాన్—మాత్రమే మండలిలో ఉండేవి తర్వాత 1926లో జర్మనీకి, 1933 లో రష్యాకు స్థానం కల్పించారు. ఈ ఆరింటికి మండలిలో శాశ్వత సభ్యత్వం ఉండేది.

ఇవి కాక, ఇంకా పెక్కు చిన్న దేశాలకు వంతులవారీగా మండలిలో సభ్యత్వం ఇచ్చేవారు. అయితే, ఈ దేశాలు అగ్రరాజ్యాలకు వ్యతిరేకంగా వోటు చేయరాదని ఒక నిబంధన ఉండేది. ఈ మండలి నానాజాతి సమితికి 'కార్య నిర్వాహకవర్గం' వంటిది. గ్రీస్, బల్గేరియాల మధ్య వివా

దాన్ని పరిష్కరించిన పద్ధతిని చూస్తే ఈ మండలి శాంతి పరిరక్షణకు కొంత మంచి కృషి చేసిందని తెలుస్తుంది. (గ్రీస్. బల్గేరియాల వివాదాన్ని గురించి ముందు పేజీలలో చదువుదాం )

## సచివాలయం (Secretariat)

యూరప్ కూటమికి, నానాజాతి సమితికి ఒక ముఖ్యమైన తేడా ఏమి టంటే, సమితికి ఎప్పుడూ అందుబాటులో ఉండే శాశ్వత సిబ్బంది ఉండేది. సుమారుగా 50 జాతులకు చెందిన 600 మందికి పైగా ఉద్యోగులు సమితికి ఉండేవారు.

ఇది నిజంగా గొప్ప విషయమని చెప్పాలి. నానాజాతి సమితి ప్రధాన కార్యదర్శి క్రింద ఈ ఉద్యోగులంతా చక్కని బృందంగా వుండి, సర్వ ప్రతినిధి సభకు, మండలికి సంబంధించిన పనులు చేస్తూ వుండేవారు. మొట్టమొదటి "అంతర్జాతీయ పౌర ఉద్యోగులు" వారే ఈ ఉద్యోగులు ఉద్యోగాలలో చేరే ముందు తమ జీవితంలోని ఇతర విధులన్నింటికంటే సమితి విధులను మిన్నగా భావిస్తామని ప్రమాణ స్వీకారం చేయవలసి ఉండేది.

ఇది కూడా గొప్ప పురోగమనమనే చెప్పాలి సచివాలయం ఏర్పడ టంతో "అంతర్జాతీయ మానవుడు" ప్రపంచ రంగస్థలంమీద దర్శన మిచ్చాడు. మానవ జాతికి అతడు నిజమైన సేవకుడు

## ఉప సంఘాలు

సమస్యలేవైనా తలెత్తినప్పుడు వాటిని పరిష్కరించడంకోసం సమితి కొన్ని పరిశీలక ఉప సంఘాలను పర్యవేక్షక ఉప సంఘాలను నియమించేది. వాటిలో, ఐదింటిని ఉదాహరణగా చెప్పుకుందాం.

## ఆరోగ్య ఉపసంఘం

వెనుకటి అధ్యాయంలో చెప్పిన వ్యాధి నిర్మూలనోద్యమాలను విస్తృతం చేయడానికి, పటిష్టం చేయడానికి యీ సంఘం కృషి చేసింది.

## రవాణాల ఉపసంఘం

భూమిమీద, సముద్రాలమీద ప్రయాణాలను, రవాణాలను అభివృద్ధి పరచడానికి కృషి చేసింది.

## ఆర్థిక వ్యవహారాల ఉపసంఘం

ప్రపంచమంతటా లక్షలాది ప్రజలు పేదలుగా, నిరుద్యోగులుగా ఎందుకు వున్నారో పరిశీలన జరిపింది. దేశాల మధ్య వ్యాపారంలో మోసాలను అరికట్టడానికి ప్రయత్నించింది.

## అల్పసంఖ్యాకుల పరిశీలక ఉపసంఘం

మొదటి ప్రపంచ యుద్ధం ఫలితంగా సరిహద్దులు మారడంవల్ల, స్వదేశాలతో ఎడబాటు పొందిన మూడు కోట్లమందికి పైగా ప్రజల సమస్యలను ఈ ఉపసంఘం పరిశీలించింది.

## సంరక్షణాధికారాల ఉపసంఘం

ఆసియా, ఆఫ్రికా ఖండాలలో—అంతకు ముందు జర్మనీ, టర్కీలకు చెందివున్న—కొన్ని భూభాగాల ప్రజల సంక్షేమ వ్యవహారాలు చూసేది.

ఇవి ఉదాహరణకోసం చెప్పుకున్న కొద్ది ఉప సంఘాలు మాత్రమే. ఇటువంటి ఉప సంఘాల నెన్నింటినో రకరకాల సమస్యలకోసం, ప్రపంచ మంతటికీ చెందిన కార్యాలకోసం సమితి నియమించింది. నానాజాతిసమితి అంగాలే నేటి ఐక్యరాజ్య సమితిలో మరింత చైతన్యవంతగా, సమర్థముగా ఎలా పని చేస్తున్నాయో వచ్చే అధ్యాయంలో చూద్దాం.

184వ పేజీలోని పటాన్ని మరొకసారి చూడండి: అందులో ఎడమవైపున ప్రపంచ న్యాయస్థానం, కుడివైపున అంతర్జాతీయ కార్మిక సంస్థ కనిపిస్తాయి. ఈ రెండు సంస్థలు 1919 నుంచి ప్రపంచ వ్యవహారాలలో ప్రముఖపాత్ర నిర్వహించాయి. ఇవి ప్రస్తుతం ఐక్యరాజ్య సమితిలో భాగాలుగా ఉన్నాయి. ఇప్పుడు వీటి కార్యరంగం మరింత విస్తృతమయింది. అందుచేత వీటిని గురించి కొంచెం వివరంగా చెప్పుకుందాం.

## ప్రపంచ న్యాయస్థానం అవతరణ

ఎనిమిదవ అధ్యాయంలో విడిచిపెట్టిన కథను మళ్ళీ యిక్కడ కొనసాగించుదాం. 1914 లో యుద్ధం ప్రారంభం కావడంవల్ల మూడవ హేగ్ మహాసభ జరగనేలేదు. కాని, యుద్ధం ముగిసిన తర్వాత, మొట్ట



మొదటి 'శాశ్వత' ప్రపంచ న్యాయస్థానం మళ్ళీ హేగ్‌లోనే స్థాపించారు. "శాశ్వత అంతర్జాతీయ న్యాయస్థానం" అని దానికి పేరు పెట్టారు.

అంతకు ముందు శాశ్వత న్యాయస్థానాన్ని స్థాపించలేకపోవడానికి ఒక కారణం—న్యాయమూర్తులను ఎన్నుకొనే పద్ధతిపై దేశాలమధ్య ఏకీభావం కుదరకపోవడం. కాని, నానాజాతి పుణ్యమా అని ఆ యిబ్బంది తీరిపోయింది. సమితి సర్వ ప్రతినిధి సభ, మండలి కలిసి న్యాయమూర్తులను ఎన్నుకొనడం ప్రారంభించాయి.

ఈ న్యాయస్థానానికి మొదట్లో పదకొండుమంది న్యాయమూర్తులను ఎన్నుకునేవారు. తర్వాత వారి సంఖ్యను పదిహేనుకు పెంచారు. ఇప్పుడు ఈ న్యాయస్థానాన్ని నానాజాతి సమితినుంచి ఐక్యరాజ్యసమితి స్వీకరించింది. న్యాయమూర్తుల సంఖ్య ఇప్పటికీ అంతే ఉన్నది. న్యాయశాస్త్ర దృక్పథాలన్నింటికీ న్యాయస్థానంలో ప్రాతినిధ్యం లభించడానికి వీలుగా ఈ పదిహేనుమంది న్యాయమూర్తులను వేర్వేరు దేశాలనుంచి జాగ్రత్తగా ఎంచుకోవలసి వుంది నానాజాతి సమితిలో అమెరికా చేరకపోయినప్పటికీ ప్రపంచ న్యాయస్థానంలో అమెరికా న్యాయమూర్తిని ఒకరిని ఎన్నుకున్నారన్నది గమనించదగ్గ విషయం.

మొదటి ప్రపంచ యుద్ధానికి, రెండవ ప్రపంచ యుద్ధానికి మధ్య—సుమారు ఇరవై సంవత్సరాల కాలంలో—ఈ న్యాయమూర్తులు 34 అంతర్జాతీయ వివాదాలను పరిష్కరించారు. ఇవి కాక, సర్వ ప్రతినిధిసభ, మండలి అప్పగించిన మరి 27 చిక్కు సమస్యలను పరిశీలించి, తమ సలహాలను అందజేశారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత వారు ఐక్యరాజ్య సమితికి ఎంతో సాయపడుతున్నారు 1946 నుంచి ముప్పయి పైగా అంతర్జాతీయ వివాదాలను ఇప్పటికి న్యాయస్థానానికి అప్పగించడం జరిగింది. ఇవి కాక సుమారు 12 సమస్యలపై న్యాయస్థానం సలహాలు ఇచ్చింది. నిజం

చెప్పాలంటే, ఇంత మాత్రం చాలదు. ప్రపంచంలో న్యాయం ప్రవర్తిల్లా లంటే, అగ్ర రాజ్యాలు ముఖ్యంగా ప్రపంచ న్యాయస్థానాన్ని ఉపయో గించుకొనడం అవసరం. కాని, సాధారణంగా అగ్రరాజ్యాలు ఈ న్యాయ స్థానాన్ని అట్టే పట్టించుకోవు.



ప్రపంచ న్యాయస్థానం పరిష్కరించిన వివాదాలేమిటి? మొదటి 20 సంవత్సరాలలో పరిష్కరించిన వాటిలో మచ్చుకు రెండింటిని ఈ అధ్యా యంలో చెప్పుకుందాం.

(1) ఫ్రాన్స్, టర్కీల మధ్య వివాదం : 1926 లో, 'లోటస్' అనే ఫ్రెంచి నౌక, మరొక టర్కీ నౌక సముద్ర మధ్యంలో ఢీకొన్నాయి. ఫలితంగా టర్కీ నౌక మునిగిపోయింది. అందులో ఉన్న సిబ్బంది ఎనిమిదిమందీ మరణించారు. దీనితో టర్కీకి కోపం వచ్చింది. ఫ్రెంచినౌక ఒకరేవులో ఆగినప్పుడు టర్కీ ప్రభుత్వం ఆ నౌక కెప్టెన్‌ను అరెస్టుచేసి, జైల్లో పెట్టింది. ఇది ఫ్రాన్స్‌కు ఆగ్రహం కలిగించింది. 'అంతర్జాతీయ న్యాయా'న్ని ఉల్లంఘించినందుకు ఉభయదేశాలు పరస్పరం నిందించు కోవడం ప్రారంభించాయి. పరిస్థితి అసహ్యంగా తయారయింది.

అయితే, ఇంగిత జ్ఞానంతో ఇరుపక్షాలూ తమ వివాదాన్ని అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించారు. న్యాయస్థానం టర్కీకి అనుకూలంగా తీర్పు చెప్పింది. ఫ్రాన్స్ ప్రభుత్వం సహృద్భావంతో తీర్పును పాటించింది.

(2) డెన్మార్క్, నార్వేల మధ్య వివాదం· ఈ వివాదం వంటివి న్యాయస్థానానికి చాలానే వచ్చాయి. పూర్వం అయితే ఇవి యుద్ధానికి దారి తీశేవి. 1961 లో నార్వే రాజు అట్లాంటిక్ మహా సముద్రం అవతల తూర్పు గ్రీన్‌లాండ్‌లోని ఒక పెద్ద భూభాగం తమదని ప్రకటించాడు. అక్కడ చిరకాలంగా నార్వేవారు చాలామంది నివసిస్తున్నారు. కాని, డెన్మార్క్ ఇందుకు ఒప్పుకోలేదు—1721 నుంచి కోస్తాలో చాలా భాగం డెన్మార్క్ అధికారుల ఆధీనంలో ఉన్నదనీ, అందుచేత ఆ భూభాగం తమదేననీ చెప్పింది. అప్పటివరకు తూర్పు గ్రీన్‌లాండ్‌పై డెన్మార్క్‌కే సార్వభౌమాధికారం ఉన్నది కనుక, ఆ భూభాగం దానిదేనని ప్రపంచ న్యాయస్థానం తిర్పు చెప్పింది. తీర్పును తలదాల్చి నార్వే వెనక్కి తగ్గింది.

మొదటి ప్రపంచ యుద్ధానికి, రెండవ ప్రపంచ యుద్ధానికి మధ్య తీర్పు కోసంగానీ, సలహాకోసంగానీ అరవైకి పైగా వివాదాలు ప్రపంచ న్యాయస్థానానికి అప్పగించబడినాయి ప్రతిసారీ న్యాయస్థానం నిర్ణయాన్ని గౌరవించడమే జరిగింది.

ప్రభుత్వాల మధ్య తగాదాలను పరిష్కరించడంలో న్యాయస్థానం విలువ ఎంతటిదో దీనివల్ల తెలుస్తుంది. అయితే, ఈ న్యాయస్థానానికి రెండు బలహీనతలు, లేదా లోపాలు ఉన్నాయని గుర్తించడం జరిగింది. మొదటిది—ఏదైనా ఒక పక్షం తీర్పును ధిక్కరించితే న్యాయస్థానం చేయగలిగిందేమీ లేదు. 1951 లో బ్రిటన్, ఇరాన్‌ల మధ్య వివాదం

ఏర్పడినప్పుడు ఇదే జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఇటువంటివి చాలానే జరిగాయి. ఇవి న్యాయ సూత్రాలకు సంబంధించిన వివాదాలు కావనీ, 'రాజకీయమైనవ'నీ ఆ దేశాలు వాదించాయి. అందుకే ప్రపంచ న్యాయస్థానం అధికారాలకు మించిన శాంతిరక్షణ యంత్రాంగం ఒకటి అవసరమయింది. దీని సంగతి వచ్చే అధ్యాయంలో చర్చించుకుందాం.

రెండవది—సాధారణంగా అగ్రరాజ్యాలు తమ వివాదాలను ప్రపంచ న్యాయ స్థానానికి రానివ్వవు (ఈ సంగతి ఇంతకుముందే చెప్పుకున్నాము). ఈ ధోరణి ప్రపంచ న్యాయ్యం పురోభివృద్ధికి ఆటంకంగా ఉంటుంది. అందుచేత, ప్రపంచ న్యాయస్థానాన్ని ఎక్కువగా ఉపయోగించుకొనేటట్లు ప్రజలు తమ ప్రభుత్వాలను ఒత్తిడి చేయడం అవసరం. బలవంతంగానైనా వివాదాలను న్యాయస్థానానికి అప్పగించేటట్లు చేయాలి.

## కార్మికుల హక్కులు

నానాజాతి సమితి అనుబంధ సంస్థలలో మరొకటి అంతర్జాతీయ కార్మిక సంస్థ దీనినే క్లుప్తంగా ఐ. ఎల్. ఓ. (ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్) అంటారు. దీనిని కూడా 1919 లోనే స్థాపించారు. అప్పటి నుంచి - రెండవ ప్రపంచ యుద్ధం సాగుతూ ఉండిన కొద్ది సంవత్సరాలలో మినహా—ఇప్పటి వరకూ ఈ సంస్థ విస్తృతమవుతూనే ఉంది.

అంతర్జాతీయ కార్మిక సంస్థ స్థాపనకు పూర్వం పంద సంవత్సరాలుగా అటువంటి సంస్థను ఒకదానిని స్థాపించడం అవసరమని చాలామంది ఆలోచించారు. ఈ సంస్థ స్థాపనకు దారితీసిన రెండు అంతర్జాతీయ పరిస్థితులను మచ్చుకు పరిశీలించుదాం.

### పిల్లలకు రక్షణ

దాదాపుగా 19 వ శతాబ్దం అంతా చిన్న పిల్లలను 'చౌక కూలీలు'గా పరిగణిస్తూ ఉండేవారు. పిల్లలచే బలవంతగా చాకిరి చేయించేవారు.



కర్మాగారాలలోనూ, గనులలోనూ, రబ్బరు తోటలు మొదలయిన వాటిలోనూ పిల్లలను కూలీలుగా ఉపయోగించడంవల్ల యజమానులకు ఉత్పత్తి ఖర్చు చాలా కలిసి వచ్చేది. వస్త్రాల మిల్లులలో దారం తెగినప్పుడు ముడి వేయడం, యంత్రాలకు నూనె వేయడం వంటి పనులు పిల్లలకు చెప్పేవారు. ఐదేళ్ళ పసిపిల్లలను కూడా తెల్లవారుజామున నాలుగు గంటలకు నిద్రలేపి, పనికి తీసుకువెళ్ళేవారు పని చేస్తూ కునికిపాట్లు పడితే పట్టుకొని కొట్టేవారు. ఒక్కొక్కప్పుడు పిల్లలు యంత్రాల దగ్గర పని చేస్తూ, నిద్ర మత్తువల్ల తూలి యంత్రాలమీద పడి తీవ్రంగా గాయపడుతూ ఉండేవారు. అయినా, ఒక్క యజమాని కూడా పిల్లలచేత పని చేయించే పద్ధతిని మానలేను ఎందుకంటే తాను మానినా తన పోటీదారులు మానకపోవచ్చు. అప్పుడు తనకంటే వారి ఉత్పత్తివ్యయం తగ్గుతుంది. ఒకే 'ప్రమాణాల'కు అందరూ కట్టుబడి వుండేటట్లు 'అంతర్జాతీయ ఒప్పందం' కుదుర్చుకుంటే తప్ప ఈ సమస్య పరిష్కారం కాదు.

# ఉద్యోగ పరిస్థితులను మెరుగు పరచడం

కొన్ని కొన్ని వృత్తులు, లేదా ఉద్యోగాలు మిగతావాటి కంటే ప్రమాదకరమైనవిగా వుంటాయి. ఇటువంటి ప్రమాదకరమైన ఉద్యోగాలలో అగ్గిపెట్టెల తయారీ ఒకటి. అగ్గిపుల్లల ఉత్పత్తిలో తెల్ల భాస్వరాన్ని తీసివేయడానికి వీలవుతుందా అనే విషయం పరిశీలించడంకోసం 1905 లో 15 దేశాల ప్రతినిధులు సమావేశమైనారు. ఈ తెల్ల భాస్వరం ప్రమాదకరమైన విష పదార్థం. దీనివల్ల పనివారికి 'ఫాసీజా' (దవడలకు సోకే వ్యాధి) అనే ఒక రకమైన వ్యాధి వచ్చేది. అంతకంటే ఖరీదైన మరొక పదార్థం ఉపయోగిస్తే ఎవరికీ ప్రమాదం ఉండదని తెలుసు. కాని, ఖరీదైన పదార్థం ఉపయోగిస్తే అగ్గిపెట్టెల ఖరీదు పెరుగుతుంది. చౌక పదార్థం ఉపయోగించే ఉత్పత్తిదారులు అగ్గిపెట్టెలను చౌక ధరకు ఇవ్వగలుగుతారు. ఈ పోటీ లేకుండా చేయాలంటే 'అంతర్జాతీయ ఒప్పందం' ద్వారానే వీలవుతుంది.

పెక్కు అంతర్జాతీయ సమావేశాలు జరిగిన తర్వాత చివరికి 1919 లో అంతర్జాతీయ కార్మిక సంఘం స్థాపించబడింది. దాని మొట్టమొదటి సమావేశం వాషింగ్టన్‌లో జరిగింది. అయితే, విచిత్రమేమిటంటే 1934 వరకు అమెరికా ఆ సంఘంలో చేరలేదు. ఈనాడు దేశాలు—ఐక్యరాజ్య సమితిలో చేరకుండానే—ప్రపంచ న్యాయ స్థానంలోనూ, అంతర్జాతీయ న్యాయస్థానంలోనూ సభ్యులుగా చేరే అవకాశం వున్నది.

ప్రస్తుతం అంతర్జాతీయ కార్మిక సంస్థలో వందపైగా దేశాలకు సభ్యత్వం వున్నది. సాంఘిక న్యాయం అనే ప్రాతిపదికపై శాంతిని నెలకొల్పడానికి సాయపడడమే ఈ సంఘం లక్ష్యం ఏ దేశంలో గానీ, శాంతికి, అభ్యుదయానికి ప్రమాదం తెచ్చిపెట్టేది దారిద్ర్యమేనని ఈ సంస్థ విశ్వసిస్తున్నది.

ప్రపంచమంతటా ఉద్యోగ పరిస్థితులను మెరుగు పరచడానికి కార్మికులు, యజమానులు, ప్రభుత్వాలు కలిసి అంతర్జాతీయ కార్మిక సంఘం ద్వారా కృషి చేస్తారు. సమాలోచనలు జరిపి నిర్ణయాలు చేస్తారు. ప్రభుత్వాల ప్రతినిధులతో పాటు, సమావేశాలకు యజమానుల సంఘాల ప్రతినిధులు, కార్మిక ప్రతినిధులు కూడా హాజరయి తమ తమ దేశాలలోని యజమానులు, కార్మికుల అభీష్టానుసారంగా వోటు చేస్తారు. ఆ విధంగా వారు త్రిపక్ష సంఘంగా వ్యవహరిస్తారు.



ఒక విధంగా అంతర్జాతీయ కార్మిక సంఘం ఇతర అంతర్జాతీయ సంస్థలకంటే భిన్నమయింది. ఇందులో 'దేశాలు' వోటు చేయడానికి బదులు, ప్రతినిధులు తమ 'వర్గ శ్రేయస్సు'ల కొరకు వోటు చేస్తారు. అందుచేత ఒక్కొక్కప్పుడు యజమానుల ప్రతినిధులలో అధిక సంఖ్యాకులు కార్మిక ప్రతినిధులకు వ్యతిరేకంగా వోటు చేయడం, ప్రభుత్వ ప్రతినిధులు అటూ యిటూ కూడా—ఒక్కొక్కసారి ఒక్కొక్క విధంగా వోటు చేయడం చూస్తాము.

ఇటువంటి పరిస్థితులలో 'జాతీయత' ప్రస్తావన అవకాశం తక్కువ; అయితే, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అంతర్జాతీయ కార్మిక సంస్థ

సమావేశాలలో, దక్షిణ ఆఫ్రికా 'జాతి విచక్షణ' విధానాన్ని గురించి, ఆఫ్రికా వలసలలో పోర్చుగల్ సాగిస్తున్న 'నిర్బంధపు చాకిరి' పద్ధతిని గురించి తీవ్రమైన చర్యలు చెలరేగాయి.

అంతర్జాతీయ కార్మిక సంస్థ స్థూల స్వరూపం ఈ క్రింది పటంలో మీకు కనిపిస్తుంది. వార్షిక సమావేశం, కార్య నిర్వాహకవర్గం, కార్యాలయం ఇవి ఈ సంఘంలో ప్రధానాంగాలని పటం తెలియజేస్తుంది. వీటిలో కార్య నిర్వాహకవర్గం ఏటా చాలాసార్లు సమావేశమవుతుంది ; కార్యాలయ స్థానం జెనీవా.



అంతర్జాతీయ కార్మిక సంస్థ పెక్కు విషయాలపై, పెక్కుదేశాల మధ్య ఒప్పందాలు కుదిర్చింది. వాటిలో మచ్చుకు కొన్ని యీ క్రింద ఇవ్వ బడినాయి:

నిరుద్యోగం, వేతనాల సమస్యలు
వైద్య సౌకర్యం, సాంఘిక భద్రత
బాలల ఉద్యోగ పరిస్థితులు
స్త్రీల ఉద్యోగ పరిస్థితులు
వారాంతపు విశ్రాంతి సౌకర్యం
ఉద్యోగ ప్రవేశానికి కనీస వయస్సు
నౌకలలో ఉద్యోగ పరిస్థితులు
ఉద్యోగ విషయాలలో విచక్షణ
సంఘాలు ఏర్పరచుకునేందుకు కార్మికులకు హక్కు
వృత్తిశిక్షణ, కార్మికుల విద్య

అంతర్జాతీయ కార్మిక సంఘం దర్శక (Director) పదవిని —1919 నుంచి ఇప్పటివరకు-ఐదుగురు వ్యక్తులు నిర్వహించారు. వీరిలో ఒకరు ఫ్రాన్స్‌కు చెందినవారు. ఇంకొకరు ఇంగ్లండుకు చెందినవారు; మరొకరు ఐర్లండ్‌కు చెందినవారు. మిగిలిన ఇద్దరు అమెరికా వారు. ఈ సంఘానికి 800 మంది ఉద్యోగులు అరవైకి పైగా దేశాలనుండి ఎంచుకో బడినవారు. ఈ ప్రపంచ బృందం ఇప్పటికి నలభై సంవత్సరాలకు పైగా జీవన పరిస్థితులను మెరుగుపరచడానికి కృషి చేస్తున్నది. పారిశ్రామిక భద్రత, ఆరోగ్యం, ఉత్పత్తి, చేతిపనులు, వ్యవసాయం, రవాణా, కార్మిక

సంక్షేమం, ఉద్యోగ ప్రమాణాల అభివృద్ధి మొదలైన పెక్కు కార్యాలలో వీరు నిమగ్నులై ఉన్నారు



అంతర్జాతీయ కార్మిక సంస్థ సంస్థాపకులు జెనీవాలో దాని ప్రధాన కార్యాలయ భవనాన్ని నిర్మించేటప్పుడు, ఈ క్రింది ఆదర్శ సూత్రాన్ని [లాటిన్‌లో] లిఖించిన ఒక పత్రాన్ని పునాది రాయితోబాటు నిక్షిప్తం చేశారు.

"మీరు శాంతిని కోరుతున్నట్లయితే, న్యాయాన్ని పరివ్యాప్తం చేయండి."

## నానాజాతి సమితి ఘన కార్యాలు

నానాజాతి సమితి రెండవ ప్రపంచ యుద్ధం రాకుండా, చేయలేక పోయినప్పటికీ, స్నేహం, ఆహారం, స్వాతంత్ర్యం, ఈ మూడింటి ప్రాతి

పదికపై భవిష్యత్తులో ఒక శాంతి సంస్థ రూపొందడానికి అనేక విధాలుగా పునాది వేసింది.

మొదటి ప్రపంచ యుద్ధానికి రెండవ ప్రపంచ యుద్ధానికి మధ్య ఇరవై సంవత్సరాల అల్లకల్లోల పరిస్థితుల్లో నానాజాతిసమితి చేసిన సేవకు ప్రపంచంలో ఎన్నో లక్షల మంది ప్రజలు ఋణపడి ఉన్నారు. మానవ జాతికి ఈ సమితి చేకూర్చిన ప్రయోజనాలను కొన్నింటిని ఇక్కడ చెప్పుకుందాం.

## కాందిశీకులకు పునరావాసం

మొదటి ప్రపంచ యుద్ధంవల్ల లక్షలాది నిస్సహాయ స్త్రీలు, పిల్లలు నిరాశ్రయులైనారు. 1919 లో, శాంతి సాధకులకు ఎదురైన అతి ముఖ్య సమస్యలలో ఒకటి ఈ నిరాశ్రయులకు ఆశ్రయం కల్పించడం. ఈ సమస్య పరిష్కారం కావడానికి చాలా సంవత్సరాలే పట్టింది నార్వేకు చెందిన ప్రముఖ శాస్త్రజ్ఞుడు, క్రీడాకారుడు, రాజకీయవేత్త డాక్టర్ ఫ్రిడ్జాఫ్ నాన్సెన్ కాందిశీకుల వ్యవహారాల సంఘానికి అధ్యక్షుడుగా నియమితులైనారు. ఆయన మొదట, 12 దేశాలకు చెందిన 4,27,000 ల మంది యుద్ధ ఖైదీలను స్వదేశాలకు పంపించే ఏర్పాట్లు చేశారు ఆ తర్వాత, తూర్పు యూరప్ లోని 14,00,000 మంది కాందిశీకులకు ఆహారం, ఉద్యోగం, గృహవసతి కల్పించేందుకు కృషిచేశారు. ఇది నిజంగా మహత్తరమైన బాధ్యత. "నానా జాతిసమతి లేకుంటే ఈ భగ్నజీవులందరూ దుర్మృతి పాలయ్యేవారు" అని డాక్టర్ నాన్సెన్ అన్నారు. ఆయన పేరిట ఇప్పటికీ 'నన్సెన్‌పాస్‌పోర్ట్' వాడుకలో ఉంది

## చితికిపోయిన దేశాల ఉద్ధరణ

నానాజాతిసమితి సభ్యదేశాలలో కొన్ని యుద్ధంవల్ల పూర్తిగా చితికి పోయాయి. వాటికి సమితి సాహాయ్యం ఎంతో అవసర మయినది ఉదా



హరణకు ఆస్ట్రియాను తీసుకుందాం. జనాభా అంతకు ముందు అది ఆస్ట్రో-హంగేరీ సామ్రాజ్యంగా ఉన్నప్పటి జనాభాతో పోల్చితే-ఎనిమిదో వంతు అయింది. యుద్ధానంతరం నాలుగు సంవత్సరాలకు అది బొత్తిగా తనను తాను పోషించుకోలేని స్థితికి వచ్చింది, ఆస్ట్రియా ధనానికి విలువ లేకుండా పోయింది. యుద్ధానికి పూర్వం ఒక పెద్ద ఇల్లు కొనుక్కోవడానికి సరిపోయే డబ్బు 1922 నాటికి ఒక పూట భోజనం చేయడానికి సరిపోతున్నది. దివాళా తీసిన ఒక దేశం పొరుగు దేశాలను కూడా దివాళా తీయించగలదని తెలుసుకుని సమితి ఆస్ట్రియా ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించడానికి ఒక సంఘాన్ని నియమించింది 1926 నాటికి ఆస్ట్రియా కోలుకుంది. "నానా జాతి సమితి మాకు ఆశాభంగం కలిగించలేదు" అని ఆస్ట్రియా అధ్యక్షుడు ప్రకటించాడు.

## మానవ సంక్షేమం

మానవ జాతి జీవనాన్ని మరింత సుఖప్రదం చేయడానికి ఉద్దేశించిన ఇతర పథకాలు కూడా నానా జాతిసమితి ఒడంబడికలో ఉన్నాయి ఉదాహర

ణకు- 'వ్యాధుల నిరోధానికి, నివారణకు' కూడా సభ్యదేశాలన్నీ రెడ్ క్రాస్‌తో సహకరించడానికి, కలిసి కృషిచేయడానికి కంగీకరించాయి. వల్లమందు. ఇతర ప్రమాదకరమైన మందుల రవాణాను అరికట్టాలని కూడా వారు అంగీకారానికి వచ్చారు. ఇటువంటి వాటిని అక్రమంగా రవాణా చేసేవారు హెచ్చు లాభాలను ఆర్జిస్తున్నారు. అందుచేత. సరిహద్దుల వద్ద వారిని పట్టి వేయడానికి 'అంతర్జాతీయ చర్య' తీసుకోవలసిన అవసరం ఏర్పడింది. అంతకుముందు వలసలుగా ఉన్న కొన్ని ప్రాంతాలు సమితికి చెందిన ఒక ప్రత్యేకసంఘం సంరక్షణ క్రిందకు వచ్చాయి. అంటే ఆ ప్రాంతాలకు స్వపరిపాలన వచ్చేవరకు, వాటి సంరక్షణ బాధ్యత సమితి సభ్యదేశాలన్నింటి మీద పడిందన్నమాట. ఇటువంటి ప్రాంతాలను "అధికారం పొందిన ప్రాంతాలు" అని వ్యవహరించేవారు. (ఈ ధర్మ కర్తృత్వం పద్ధతే ఐక్యరాజ్య సమితి ఇప్పుడు నిర్వహిస్తున 'ధర్మ కర్తృత్వ ప్రాంతాల' పథకాలకు మూలం. వీటి సంగతి వచ్చే అధ్యాయంలో పరిశీలిద్దాం.)

## వివాదుల పరిష్కారం

అనేక కారణాల వల్ల ప్రపంచ న్యాయ స్థానానికి నివేదించే వీలులేక పోయిన పెక్కు తీవ్ర సమస్యలను నానాజాతి సమితి మండలి పరిష్కరిస్తూ ఉండేది. ఉదాహరణకు అటువంటి సంఘటలను ఒక దానిని చూద్దాం-ఆ రోజుల్లో అది తీవ్ర సంచలనం కలిగించింది. అయితే, సమితి తీసుకున్న చర్యవల్ల అది సమసిపోయి, విస్మృతి పథంలో పడిపోయింది. 1925 అక్టోబరు 22 వ తేదీన బల్గేరియా, గ్రీస్ దేశాలమధ్య సరిహద్దుపై గస్తీ తిరుగుతున్న సైనికులు ఒకరిపై ఒకరు కాల్పులు జరుపుకున్నారు. అవతలి పక్షం వారు తమపై దాడిచేయబోతున్నరని ఇరు పక్షాలూ పరస్పరం అనుమానించాయి. ఈ అనుమానంతో రెండు దేశాలూ సైన్యాలను తమ తమ సరి

13

షోద్ధులను తరలించాయి. మళ్ళీ యుద్ధం ప్రజ్వరిల్లబోతున్నదనే అందరూ అనుకున్నారు. కాని, సమితి మండలి సభ్యులకు వెంటనే తంతిద్వారా కబురు పంపి, పారిస్‌లో సమావేశం ఏర్పాటు చేశారు. అక్టోబరు 26 న ఈ సమావేశం జరిగింది. సమితి "పంశీలకులు"ను వెంటనే వివాదగ్రస్త ప్రాంతానికి పంపారు. 24 గంటల లోగా ఉభయ పక్షాలూ తమ సేనలను ఉపసంహరించుకోవాలని మండలి విజ్ఞప్తిచేసింది. ఉభయ పక్షాలూ ఆ విజ్ఞప్తిని పాటించాయి. శీఘ్రంగా చర్య తీసుకోవడం వల్ల, నానాజాతి సమితి యావత్తూ పూనుకొన్నందువల్ల వివాదం పరిష్కారమై, యుద్ధం ఆరంభం కాకుండానే ఆగిపోయింది. ఈ విజయంతో సమితి ప్రతిష్ఠ పెరిగింది కనీసం చిన్న దేశాలకు సంబంధించినంతవరకైనా సమితి శక్తి గుర్తించ తగినదిగా కనిపించింది.



## భద్రత

శాంతికి ప్రమాదం ఏర్పడినప్పుడు పరస్పరం సంప్రతించుకుని, మండలి సూచన ప్రకారం ప్రవర్తించడానికి సమితి ఒడంబడికలో దేశాలు అంగీకరించడం జరిగింది. ఒక దేశం మరొక దేశంపై దాడిచేయడానికి సిద్ధపడినప్పుడు అనుసరించవలసిన పద్ధతులను గుర్తించి ఒడంబడికలో చాలా సూత్రాలు ఉన్నాయి. ఇటువంటి దాడిని "దురాక్రమణ" అని పేర్కొన్నారు. సమితి ఎదుర్కొన్న సమస్య లన్నింటిలో ఇది అతి క్లిష్ట మైనది. ఎందుకంటే, తాము ఏది చేయాలో, ఏది చేయకూడదో ఇతరులు తమకు చెప్పడాన్ని సార్వభౌమాధికారం గల దేశాలు సహించవు. సమితి చేయవలసిన మొదటి పని- యుద్ధం ఆరంభం కాకుండా నిరోధించడం. మధ్యవర్తిత్వం ద్వారా గానీ, కొన్ని దేశాలు అన్యాయమని భావించిన పరి స్థితులను చక్కబరచడానికి ప్రయత్నించడం ద్వారా గానీ (దీనినే రాజీ కుదర్చడం అంటారు.) యుద్ధం జరగకుండా చేయాలి. సమితి ఈ పని చిన్న దేశాల విషయంలో చేయగలిగింది కాని, పెద్ద దేశాల విషయంలో చేయలేకపోయింది. అగ్రరాజ్యాలు సమితికి లొంగలేదు.

## సైన్యాల తగ్గింపు

అంతకంతకు దేశాలు సైన్యాలను, నౌకా దళాలను పెంచుకోవడం ఎక్కువయింది. ప్రపంచం మొత్తం మీద వీటికోసం విపరీతంగా ధన వ్యయం జరుగుతున్నది. ఒకరిపై అనుమానంతో ఒకరు సైన్యాలను పెంచుకుంటున్నందువల్ల రక్షణ ఉంటుందని అనుకుంటున్నారు గానీ, అది మరింత భయంకరమైన యుద్ధానికే దారితీస్తుందని గ్రహించలేకపోయారు. సైన్యాలు, ఆయుధాల తగ్గింపు విషయం చర్చించడానికి ఆ ఇరవై సంవత్స రాలలో చాలా సమావేశాలు జరిగాయి. చాలా ఉపసంఘాలను నిర్మించడం జరిగింది. వాటిలో అమెరికా, అలాగే సమితి సభ్యత్వంలేని మరికొన్ని

దేశాలు కూడా చేరాయి. ఆయుధాల సేకరణ పోటీ పెరుగుతున్నకొద్దీ ప్రతి దేశం పొరుగు దేశాన్ని చూసి భయపడడం మొదలు పెట్టింది. ఇటలీ, జర్మనీ, జపాన్ దేశాలలో నియంతలు అధికారంలోకి వచ్చారు. వారివల్ల పరిస్థితి మరీ ప్రమాదకరంగా తయారయింది. "అంతర్జాతీయ నిరాయుధీకరణ ఒప్పందం" కుదర్చడానికి సమితి ఎంతో ప్రయత్నించింది. కాని సభ్యదేశాలు కలిసి రాలేదు. అందుకే మరొక ప్రపంచ యుద్ధం రాకుండా సమితి నిరోధించలేక పోయింది.

## నానాజాతి సమితి పతనానికి కారణాలు

నానాజాతి సమితి ఎందుకు అపజయం పొందింది? దీనిపై కొన్ని వందల పుస్తకాలు రచింపబడినాయి. కాని, సమితి అపజయానికి క్లుప్తంగా ఈ క్రింది కారణాలను చెప్పుకోవచ్చు.

ఒకటి :

సమితిలో అమెరికా చేరలేదు. అయితే, అమెరికాకు చెందిన వ్యక్తులు అనేకులు అనేక విధాలుగా సమితికి గొప్ప మద్దతు ఇచ్చిన మాట నిజమే. సమితి మానవ సంక్షేమ కార్యక్రమాలకు వారు ధన సాహాయం కూడా చేశారు. అమెరికా ఆర్థికంగా, రాజకీయంగా నానాటికీ విశేషంగా బలపడుతున్నది. అటువంటి అగ్రరాజ్యం ఆ ఇరవై సంవత్సరాలూ సమితిలో చేరక పోవడం మిగతా ప్రపంచానికి పెద్ద నష్టం. అగ్రరాజ్యాలన్నింటికీ సభ్యత్వం ఉంటేగానీ ఏ ప్రపంచ సంస్థగానీ ఏదైనా కృషి చేయడానికి వీలుండదు. ఇప్పుడు ఐక్యరాజ్య సమితి విషయంలో కూడా ఈ సమస్యను మనం ఎదుర్కొంటున్నాము.

రెండు :

పెక్కు తీవ్రమైన దురాక్రమణలు జరిగినప్పుడు సమితి వాటిని నిరోధించలేక నిస్సహాయంగా ఉండిపోయింది. 1931 లో, చైనాకు ఉత్తరాన ఉన్న మంచూరియాను జపాన్ దురాక్రమించింది. 1935 లో, ఇటలీ సమితి ఆక్షేపణలను ఖాతరు చేయకుండా అబిసీనియాను దురాక్రమణ చేసింది. ఈ దేశాలన్నీ సమితిలోవే. ఇక 1938 లో, జర్మనీ నాజీ ప్రభుత్వం ఆస్ట్రియా పైన దురాక్రమణ జరిపింది. అప్పుడే యుద్ధ ప్రజ్వలనం ప్రారంభమయింది.

మూడు :

కొన్ని దేశాలు అసంతృప్తితో సమితి నుండి నిష్క్రమించాయి. ముందు జపాన్ దారి చూపింది. తర్వాత ఇటలీ, జర్మనీ అనుసరించాయి. 1939 లో, రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన కొద్ది కాలానికి సమితి సర్వప్రతినిధి సభ జరిపారు. అదే దాని చివరి సమావేశం. కాని, అప్పటికే సమితి సగం చచ్చిపోయింది.

నాలుగు

నానాజాతి సమితి 'దేశాల' సమితే గానీ 'ప్రజల' సమితి కాదు. సర్వ ప్రతినిధి సభ - మనం ఇంతకుముందు చెప్పుకున్నట్లు - అనేక విధాల ప్రయోజకరమైనదే అయినప్పటికీ, అది ఆయా దేశాల విదేశాంగ శాఖలకు మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తున్నది. పార్లమెంటులో మాదిరిగా ప్రజా ప్రతినిధులకు ఇందులో స్థానం లేదు. అంతేకాక-సమితిలో సభ్యత్వంగల ప్రతి ప్రభుత్వం తన శ్రేయస్సు దృష్ట్యా యుద్ధంచేసే హక్కు తనకు ఉన్నదని వాదిస్తూ వచ్చాయి. జాతీయత అంతర్జాతీయతను అణచివేసింది.

## గొప్ప ప్రయోగం

ఏమైనప్పటికీ, ప్రపంచ చరిత్రలో 'మానవుని పార్లమెంటు'ను సృష్టించడానికి జరిగిన మొట్ట మొదటి గొప్ప ప్రయోగం నానాజాతి సమితి: నేటి ఐక్యరాజ్య సమితిని గురించి తెలుసుకోడానికి ఈ పుస్తకంలో పేజీలు తిరగవేసే ముందు ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి. ప్రపంచ మంతటినీ ఒకే వ్యవస్థగా రూపొందించడానికి, అంతకుముందు జరిగిన ప్రయత్నా లన్నింటికంటే అది లక్ష్యానికి మరింత సమీపంగా వెళ్లింది. అయితే అది ఆ నాటి భావాలను, ప్రభావాలను అధిగమించలేక పోయింది. అది గొప్ప ప్రయోగమని మాత్రం రూఢిగా చెప్పవచ్చు.



నానాజాతి సమితి అశక్తత అన్నిటికంటే ఆర్థిక వ్యవహారాలలో ఎక్కువగా బైట పడింది. 1930 ప్రాంతాలలో, ప్రపంచ మంతటా తీవ్ర మైన ఆర్థిక సంక్షోభం ఏర్పడింది లక్షలాది ప్రజలు నిరుద్యోగులై, దీనా వస్థలో ఉన్నారు. అయినా, సమితి వారికి ఎట్టి సాహాయ్యం చేయలేక పోయింది. సైనికమైన 'భద్రత'కు అత్యధిక ప్రాధాన్యం ఇచ్చి, ప్రజలకు స్వాతంత్ర్యం, ఆహారం, స్నేహం సమకూర్చవలసిన ప్రధాన బాధ్యతను సమితి విస్మరించిందని మేధావులు విమర్శించారు.

ఐక్యరాజ్య సమితిని గురించి పరిశీలించేటప్పుడు, నానాజాతి సమితి నేర్పిన గుణపాఠాలను మనస్సులో ఉంచుకోవాలి. నానాజాతి సమితి నిర్వాహకులు చేసిన తప్పులను ఆక్షేపించడం కంటే, ప్రముఖ ప్రపంచ సేవకుడు డాక్టర్ ఫ్రిట్జాఫ్ నాన్సెన్ ఒకసారి విద్యార్థుల సమావేశంలో చెప్పిన ఈ క్రింది మాటలను జ్ఞాపకం చేసుకోవడం మంచిది.

"ఈ నలిగిన పాత దారులు మనలను గమ్యానికి చేర్చలేవు నూతన పథాలను అన్వేషించవలసిన సమయం ఆసన్నమయింది. నవ్యదృష్టితో సూటిగా, తేటగా, స్వాభావికంగా చూడగల శక్తి మీకు ఉన్నది. సరిక్రొత్త ప్రయోగాలు, సాహసాలు చేయడానికి తహతహ పడుతున్న యువకులు మీరు. మాకు కావలసింది మీరే."

# 10

# "ప్రజలమైన మనం"

శాంతికి మార్గం లేదు. శాంతే ఒక మార్గం. శాంతిని వ్యవస్థీకరించడం గురించే ఈ పుస్తకం చెబుతున్నది.

అంతరాతీయ సహకారానికి సంబంధించిన పెక్కు శాఖలను గురించి వెనకటి అధ్యాయాలలో చదివాము. ఆ శాఖలన్నింటిని ప్రస్తుత కాలంలో ఒక్క చోటికి చేర్చి ఏ విధంగా సమన్వయించుతున్నారో ఈ అధ్యాయంలో చూద్దాం.

'ఏక ప్రపంచ' లక్ష్యానికి ఇంకా పూర్ణ స్వరూపం రాలేదు. ఇప్పటికీ చాలామంది ప్రజలు ప్రపంచాన్ని ఒక్కటిగా చూడలేకపోతున్నారు. గెలీలియో కాలంలో ప్రజలకు విశ్వం ఎంత అర్థమయిందో ఇప్పటి ప్రజలకు 'ఏక ప్రపంచ' లక్ష్యం అంతకంటే ఎక్కువేమీ అర్థం కాలేదు.

కాని, ఈ పుస్తకాన్ని పదో అధ్యాయం వరకు చదివిన పాఠకునికి-మానవజాతి ప్రపంచ సమైక్యం దిశగానే పయనిస్తున్నదనే విషయంలో-సందేహం కలగవలసిన అవసరం లేదు. పైగా ఇటీవల కాలంలో ఈ పురోగమనం మరింత శీఘ్రంగా సాగుతున్నది కూడా. 1945 లో నెల కొల్పబడిన ఐక్యరాజ్యసమితి ఇందుకు ప్రబల నిదర్శనం.

ఐక్యరాజ్య సమితిగురించి ఎన్నో పుస్తకాలు, వ్యాసాలు, కర పత్రాలు వెలువడినాయి. ఎందరో దీనిపై ఉపన్యాసాలు ఇచ్చారు. మనం ఈ అధ్యాయంతో చెప్పుకోవలసినదల్లా--నేటి, పౌరులలో ప్రతి వ్యక్తీ తప్పనిసరిగా తెలుసుకోవలసిన ముఖ్యాంశాలను మాత్రమే.

## ఐక్యరాజ్య సమితి అవతరణ

రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నంత కాలం అన్ని దేశాల లోనూ రాజకీయవేత్తలు ఆలోచిస్తూ వుండిన విషయం ఏమిటంటే—యుద్ధం ముగిసిన తర్వాత ప్రపంచానికి ఎటువంటి రాజకీయ సంస్థను రూపొందించాలి అని. "మానవుడు యుద్ధాన్ని రూపుమాపకపోతే యుద్ధమే మానవుణ్ణి రూపుమాపుతుంది—" అని హిరోషిమా విషాదగాధ ప్రపంచం లోని లక్షలాది ప్రజలకు వెన్ను చరచి చెప్పింది. హిరోషిమా మీద పడిన అటంబాంబు 60 వేలమంది మనుష్యులను చంపింది; మరో లక్షమందిని తీవ్రంగా గాయపరచింది; ఒక గొప్ప ఓడ రేవును పూర్తిగా భస్మం చేసింది. ఈ మారణహోమం కొద్ది క్షణాల వ్యవధిలో జరిగిపోయింది.

1941 లో, ప్రపంచ యుద్ధం ముమ్మరంగా సాగుతూ వుండగా అమెరికా అధ్యక్షుడు, బ్రిటన్ ప్రధాని అట్లాంటిక్ మహాసముద్రంమీద ఒక నౌకలో సమావేశమయ్యారు. అప్పుడే వారు "అట్లాంటిక్ ప్రణాళిక" అనే పేరుతో ఒక ప్రకటన తయారు చేశారు. ఒక "ఐక్యరాజ్యసమితి" స్థాప

నకు అవశ్యకమైన మూల సూత్రాలు కొన్ని ఆ ప్రణాళికలో వున్నాయి. అవి ఏమిటంటే :

దేశాలు తమ వివాదాలను పరిష్కరించుకోడానికి బల ప్రయోగం చేయడం మానివేయాలి

జాతీయ సరిహద్దులను—ఆయా ప్రజల అనుమతి లేకుండా—మార్చకూడదు.

తమకు ఏ విధమైన ప్రభుత్వం కావాలో అట్టి దానిని ఎంచుకోనే స్వేచ్ఛ ప్రజలందరికీ ఉండాలి.

దారిద్ర్యం, హింస, యుద్ధం—వీటినుంచి అన్ని దేశాల ప్రజలను కాపాడ డానికిగానూ జీవన పరిస్థితులను మెరుగు పరచాలి.

1942 లో, "ఐక్యరాజ్య ప్రకటన" ఒకదానపై 26 దేశాలు సంతకాలు చేశాయి. యుద్ధాన్ని రూపుమాపదానికి చేసే కృషిలో ఒకరి కొకరు సహాయం చేసుకోడానికి, ఆట్లాంటిక్ ప్రణాళికలోని భావాలను బలపరచడానికి ఆ దేశాలు ప్రమాణం చేశాయి.

ఆ తర్వాత మూడు సంవత్సరాలలో, మాస్కో, (రష్యా), డంబర్టన్ ఓక్స్ (వాషింగ్టన్), యాల్టా (దక్షిణ రష్యా)లలో "ఐక్యరాజ్య" నాయకులమధ్య ముఖ్యమైన సమావేశాలు కొన్ని జరిగాయి. కాని వీటి అన్నింటికంటే పెద్ద సమావేశం—యుద్ధం ముగియవస్తున్న దశలో—శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగింది.

శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశం 1945 జూన్‌లో జరిగింది. నానాజాతి సమితి ఒడంబడిక స్థానంలో ఒక "నియమావళి"ని రూపొందించడం ఈ సమావేశపు ప్రధాన లక్ష్యం. కాని, ఇది చాలా పెద్ద బాధ్యత 1919 నాటి

కంటే 1945 లో ప్రపంచం చాలా సంక్లిష్టమైపోయింది. అక్కడ చేరిన 51 దేశాల ప్రతినిధులు కనీసం పదిసార్లు సర్వసభ్య సమావేశాలు జరి పారు. ప్రత్యేక ఉప సంఘాల సమావేశాలు కనీసం నాలుగు వందలు జరి గాయి. ప్రతి సమావేశంలోనూ నియమావళిలోని ప్రతి వాక్యాన్ని, ప్రతి అక్షరాన్ని పరిశీలించారు.

ఈ చర్చలలో, అనివార్యంగా కొన్ని అభిప్రాయభేదాలు వచ్చాయి. ప్రపంచమంతటికీ రాజ్యాంగాన్ని రచించ బూనుకోవడం పేరాస అని కొం దరు పెద్దలు అభిప్రాయపడ్డారు. దేశాలమధ్య లెక్కలేనన్ని భేదాలు ఉంటా యనీ, వాటిమధ్య అంగీకారం కుదర్చడం అసాధ్యమనీ వారు సెలవిచ్చారు. కాని వారు 'అసాధ్యం' అనుకున్నది సాధ్యం అయింది. ప్రతి దేశమూ దాని ఇష్టం వచ్చిన దారిన అది పోవడానికి వీల్లేదు—పోలేదు కూడాను. కొం దరు ప్రతినిధులు చాలా ముఖ్యమని భావించిన విషయాలు కొన్ని జారి పోయాయి; వారికి నచ్చని విషయాలు మరికొన్ని నియమావళిలో చేర్చబడి నాయి అయినా, వారు ఆ విధంగా సమాధాన పడగలిగినందువల్లనే అంగీ కారం కుదిరింది.

చివరికి, 1945 జూన్ 25 వ తేదీన శాన్‌ఫ్రాన్సిస్కో ఒపేరా హౌస్‌లో నియమావళిపై వోటింగ్ జరిపారు. 51 సభ్య దేశాల పేర్లు చదు వుతూ వుండగా ప్రతినిధులు తమ తమ స్థానాలలో లేచి నుంచున్నారు. మూడువేలమంది ప్రేక్షకులుకూడా లేచి నుంచున్నారు. తర్వాత నియమావళి ఆమోదింపబడిందని ప్రకటించగానే పెద్దగా హర్షధ్వానాలు చెలరేగాయి.

తుది సమావేశంలో, అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ప్రసంగిస్తూ ఇలా అన్నారు. "కొద్దిసేపటిక్రితం మీరందరూ ఆమోదించిన ఐక్యరాజ్య సమితి నియమావళి ఒక దృఢమైన పునాది. దానిమీదనే మనం విశిష్టమైన ప్రపంచాన్ని నిర్మించుకోగలుగుతాము. చరిత్రలో ఎన్నడూ జరగినంతటి

దారుణమైన మారణ హోమం, విధ్వంసకాండ ఈ యుద్ధంలో జరిగాయి. కాని, ఈ యుద్ధంతో మనం యుద్ధంపైనే విజయం సాధించాము."

అప్పటికింకా నియమావళి పూర్తిగా ఆమోదింపబడినట్లు కాదు. ఎందుకంటే, ఏ అంతర్జాతీయ ఒప్పందమైనా గానీ (ఈ నియమావళి కూడా ఒక ఒప్పందమే) ఆయా దేశాల ప్రభుత్వాలచేత కూడా ఆమోదింపబడ వలసి ఉంది. అంటే ఆ దేశాల నాయకులు స్వయంగా ఈ ఒప్పందంపైన సంతకాలు చేయవలసి ఉంది. ఇది చాలా కాలంగా ఉన్న ఆచారం. 1945 అక్టోబరు 24 వ తేదీనాటికి తగినన్ని ప్రభుత్వాలు తమ ఆమోదాన్ని తెలి పాయి. అప్పటినుంచి ఇప్పటివరకు ప్రతి సంవత్సరం అక్టోబరు 24 వ తేదీన ప్రపంచమంతటా ఐక్యరాజ్యసమతి దినోత్సవం జరుపబడుతున్నది.

## నియమావళిలోని అంశాలు

నియమావళిలో 111 ప్రకరణాలు ఉన్నాయి. అవి సమితి అంగ నిర్మాణాన్ని, కార్య నిర్వహణ విధానాన్ని వివరిస్తాయి.

నానాజాతి సమితి ఒడంబడికలో 26 ప్రకరణాలు మాత్రమే ఉన్నాయి. ఆ ఒడంబడికకూ, ఈ నియమావళికి పెద్ద తేడా ఉన్నది. ఒడం బడిక దస్తావేజు మాదిరిగా "మనత వహించిన కక్షిదారులు యావన్మందిన్నీ ... "అంటూ కొన్ని పడికట్టు పదాలతో ప్రారంభమవుతుంది.ఇక్కడ "కక్షి దారులు" అంటే 'ప్రభుత్వాలు' అని అర్థం. కాని, ఐక్యరాజ్యసమితి నియ మావళి ధోరణి మరో విధంగా ఉంది, దాని మొదటి వాక్యం: "ఐక్య రాజ్యాల ప్రజలమైన మనం. ." అంటూ ప్రారంభమవుతుంది.

అయితే, ఇప్పటికీ ఖచ్చితంగా చెప్పాలంటే ప్రభుత్వాలే సమితిలో సభ్యులు. కాని, అంతకు ముందు పాతిక సంవత్సరాలలో నానాజాతిసమితి వల్ల పొందిన అనుభవాలనుబట్టి—నూతన శాంతికి తాము ఇంత కష్టపడి

తయారు చేస్తున్న ప్రణాళికలన్నీ "ప్రజల" కోసమేనని ప్రపంచ నాయకులు గుర్తించారు.

నియమావళి ఉపోద్ఘాతంలో సభ్య దేశాలన్నీ నాలుగు వాగ్దానాలు చేశాయి. అవి:

సహనాన్ని అలవరచుకుని, చక్కని ఇరుగుపొరుగు కుటుంబాలవలె ప్రశాంతంగా జీవించడం. అంతర్జాతీయ శాంతి భద్రతల కొరకై సఖ్యంగా కలిసి ఉండడం;

"సమిష్టి శ్రేయస్సుకోసం" అవసరమైతే తప్ప సాయుధ బలాన్ని ప్రయోగించకుండా ఉండడం; అంతర్జాతీయ సహకారంద్వారా సర్వ ప్రజల ఆర్థిక, సాంఘిక పరిస్థితులు మెరుగు పరచడం.

## ఐక్యరాజ్యసమితి "అంగాలు"

184 వ పేజీలోని పటం సమితిలోని ఆరు ముఖ్యాంగాలను చూపుతుంది. అవి ఆరు పునాదిరాళ్ళ వంటివి.

ఇక్కడ ఒక్కసారి 153 వ పేజీ తిప్పి నానాజాతి సమితి పటాన్ని చూడండి. ఆ సమితిలో అంతర్జాతీయ కార్మిక సంస్థ ఒక భాగం. ఇప్పుడు ఈ సంస్థ ఒక "ప్రత్యేక సంస్థ"గా పరిగణింపబడుతున్నది, ఆర్థిక సాంఘిక వ్యవహారాల మండలికి అనుబంధించి ఉన్నది. అప్పటికీ ఇప్పటికీ కార్మిక సంఘం పెద్దగా మారలేదు కనుక, దానిని గురించి ఈ అధ్యాయంలో మళ్ళీ చెప్పుకోవలసిన అవసరం లేదు.

అలాగే అంతర్జాతీయ న్యాయస్థానం కూడా అప్పటికీ ఇప్పటికీ అంతగా ఏమీ మారలేదు. అందుచేత, ఇప్పుడు మనం చెప్పుకోవలసినది సమితికి చెందిన ఐదు అంగాలను గురించే. అవి—సర్వ ప్రతినిధిసభ, సచివా

**The United Nations**
**Six Main Organs**




లయం, భద్రతామండలి, ధర్మకర్తృత్వ మండలి, ఆర్థిక సాంఘిక వ్యవహారాల మండలి. ఈ చివరిదాని సంక్షిప్తనామం 'ఇకోసాక్' (Ecosoc-ఇకనామిక్ అండ్ సోషల్ కౌన్సిల్). ఈ ఐదు అంగాలను గురించి తెలుసుకున్న తర్వాత 'ఇకోసాక్'కు చెందిన ప్రత్యేక సంఘాలను గురించి, ఉప సంఘాలను గురించీ తెలుసుకుందాం.

## సర్వ ప్రతినిధి సభ

ఈ సభ ఏడాదికోకసారి సమావేశమవుతుంది. ఎప్పుడైనా అత్యవసర సమావేశాలు కూడా జరుగుతూ ఉంటాయి. ఇది ఒక విధంగా ప్రపంచ

బహిరంగసభ వంటిది సభ్య దేశాల నాయకులందరూ అభిప్రాయాలు వ్యక్తం చేయడానికి పీలయిన సభావేదిక అది. పెద్ద పెద్ద ప్రపంచ సమస్యలన్నీ అందులో చర్చకు వస్తాయి.



మామూలుగా ఈ సభ వార్షిక సమావేశాలు న్యూయార్కులో జరుగుతూ ఉంటాయి. కాని, అవసరాన్నిబట్టి ప్రపంచంలోని ఇతర నగరాలలో కూడా సమావేశాలు జరవవచ్చు. ఉదాహరణకు, 1951 లో సర్వప్రతినిధి సభ పారిస్‌లో సమావేశమయింది. ఈ సభకు సభ్యదేశాలన్నీ

ఐదేసిమంది ప్రతినిధులను పంపవచ్చును. కాని, ఒక్కొక్క ప్రతినిధి వర్గానికి ఒక్కొక్క వోటే ఉంటుంది. ముఖ్య విషయాలపై నిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు వోటింగ్ ఏర్పాటు చేస్తారు. మూడింట రెండు వంతుల వోట్లు ఏ అభిప్రాయాన్ని బలపరుస్తాయో, ఆ అభిప్రాయమే నిర్ణయమవుతుంది. ఈ పుస్తకం ముద్రితమయ్యేనాటికి ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వంగల దేశాల జాబితా ఈ అధ్యాయం చివరలో ఇవ్వబడింది అయితే సమితిలో చేరాలనుకుంటున్న, చేరబోతున్న దేశాలు ఇంకా కొన్ని ఉన్నాయి.

సర్వప్రతినిధి సభ విధులు చాలా ఉన్నాయి. నియమావళిలో వాటిని వివరంగా పేర్కొన్నారు. సమితిలోని ఇతర అంగాలన్నింటిపైనా సర్వ ప్రతినిధిసభ ప్రభావం విశేషంగా ఉన్నది. ఉదాహరణకు, భద్రతామండలిలోని 11 మంది సభ్యులలో ఆరుగురిని, ఆర్థిక సాంఘిక వ్యవహారాల మండలిలోని మొత్తం 18 మంది సభ్యులను సర్వ ప్రతినిధి సభయే ఎన్నిక చేస్తుంది.

సమితి సభ్యదేశాలన్నీ సార్వభౌమాధికారం గల దేశాలు కాబట్టి సర్వ ప్రతినిధిసభ వాటికి "సిఫార్సులు" మాత్రమే చేయగలుగుతుంది; శాసనాలు చేసి వాటికి దేశాలు కట్టుబడేటట్లుగా నిర్బంధించలేదు. ఇంతకు ముందు మనం చెప్పుకున్నట్లు జాతీయ పార్లమెంటుకు, అంతర్జాతీయ సభకు పెద్ద తేడా ఇదే. ఐక్యరాజ్యసమితి ప్రపంచ ప్రభుత్వం కాదు; ముందు ముందు అవుతుందని చాలామంది అనుకుంటున్నారనుకోండి.

సర్వ ప్రతినిధిసభ నిర్వర్తించే విధులన్నింటిలోకి గొప్పది ఏమి టంటే—ప్రపంచాభిప్రాయాన్ని ప్రతిధ్వనింపచేయడం. సమితికి "రహస్య రాజకీయాలు" ఏమీ వుండవు. సమితిలో చెప్పకూడనిదేమీ లేదు. దేశాలన్నీ తమ అభిప్రాయాలను సర్వ ప్రతినిధి సభలో స్వేచ్ఛగా, ధారాళంగా ఎలుగెత్తి ప్రకటించవచ్చు; అలా ప్రకటించడం తమ హక్కుగా భావి

స్తాయి. ఏమైనప్పటికీ, "ప్రజలమైన మనం" సమితి నిర్ణయాలను బలపర చటం లేదా నిర్ధుంగా చెయ్యగలిగేదేమీ ఉండదు ఇందుకు కొన్ని ఉదా హరణలు తర్వాత చెప్పుకుందాం

సచివాలయం

న్యూయార్క్‌లోని సమితి ప్రధాన కార్యాలయంలో మూడువేల మందికిపైగా ఉద్యోగులు పని చేస్తున్నారు. వీరందరూ సమితి ప్రధాన కార్య దర్శి ఉథాంట్ క్రింద పని చేస్తున్నారు. ఉథాంట్ బర్మా దేశస్తుడు. సమి తికి అనుబంధించిన ప్రత్యేక సంస్థలు, సంఘాల కార్యాలయాలు జెనీవా, బాంకాక్ (తాయ్‌లెండ్), హేగ్, మ్యాంట్రియల్, శాంటియాగో, చిలీ నగ రాలలో కూడా ఉన్నాయి. వీటిలో కొన్ని వందలమంద ఉద్యోగులు, ప్రవీ ణులు పని చేస్తున్నారు మొత్తం సమితి సిబ్బంది 28 వేలమంది వరకు ఉంటారు. వీరందరినీ కలిపి "సమితి కుటుంబం" అని అంటారు. వీరిలో ఎక్కువమంది నేరుగా "కార్యక్షేత్రం' లోనే పని చేస్తున్నారు. దాదాపుగా వీరిలో నూటికి 90 మంది సమితి ఆర్థిక, సాంఘిక కార్యకలాపాలలో పని చేస్తున్నారు. అందుచేత, ఈ అధ్యాయంలో ఈ కార్యక్రమాలకే ఎక్కువ పేజీలు కేటాయించుదాం.

నియమావళిలోని 100 వ ప్రకరణంలో అతి ముఖ్యమైన నిబంధన ఒకటి నిర్దేశింపబడింది. ప్రధాన కార్యదర్శి, ఆయన సిబ్బంది సమితికి వెలుపల ఉన్న ఏ ప్రభుత్వంనుంచి గానీ, మరే వర్గంనుంచి గానీ ఆదేశాల కోసం ఎదురు చూడరాదు, స్వీకరించ కూడదు. అంటే, వారు సమితి నిర్దేశించిన విధులను మాత్రమే నిర్వర్తించాలి; సమి తికి మాత్రమే విధేయులై ఉండాలి. సమితిలో పని చేసే తమ జాతీయులపై ఎట్టి ఒత్తిడి తీసుకురాబోమని సభ్యదేశాలన్నీ ముందుగానే వాగ్దానం



చేశాయి కాబట్టి, సమితి ఉద్యోగులకు, సర్వ ప్రతినిధిసభలోని జాతీయ ప్రతినిధులకు ఏ విధంగానూ పోలిక లేదు. ప్రతినిధులు తమ దేశాలను గురించి, తమ దేశాల తరఫున మాట్లాడుతారు. వారు వారి ప్రభుత్వాల నుంచి ఆదేశాలు పొందుతారు. కాని, సమితి ఉద్యోగులకు తమ దేశాలతో వాటి ప్రభుత్వాలతో సంబంధం ఉండకూడదు. వారు అంతర్జాతీయ పౌర ఉద్యోగులు.

ఈ ప్రపంచ బృందాన్ని రూపొందించడంలో ఒక ముఖ్య సూత్రం ఇమిడి ఉంది. సమితికి సంబంధించిన ఆ యా కార్యాలకు అతి సమర్థులైనవారిని నియమించాలంటే, ప్రపంచంలోని సాధ్యమైనన్ని ఎక్కువ దేశాలనుంచి వారిని ఎంచుకోవలసి ఉంది; సాధ్యమైనంత వరకు ఏదేశాన్ని గానీ, ఏ ప్రాంతాన్ని గానీ విడిచిపెట్టకూడదు.

న్యూయార్క్ ప్రధాన కార్యాలయంలో జరిగే అన్ని సమావేశాలకు సిబ్బంది ఏర్పాట్లు చేస్తుంది. సర్వ ప్రతినిధి సభలో పాల్గొనే ప్రతిని

ధులకు, మండలులు, ఉప సంఘాలలోని సభ్యులకు అవసరమైన సమాచారం అందించడం, ఇతర ఏర్పాట్లు చేయడం కూడా ఈ సిబ్బంది పనే.

ఏ సమావేశంలోనైనా ప్రతినిధులు మాట్లాడే ఆయా భాషలను అప్పటికప్పుడు అనువదించేవారు కావాలి; స్టెనోగ్రాఫర్లు మాత్రం ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్, రష్యన్ భాషలలోనూ, అవసరమైతే చైనీస్ భాషలోనూ సభా కార్యక్రమాన్ని నమోదు చేసుకుంటారు ప్రతినిధి మాట్లాడుతూ ఉండగా అప్పటికప్పుడే అనువదించేవారు చాలా ప్రతిభావంతులై ఉంటారు. వారి సేవ అతి ముఖ్యమైనది. ఎందుకంటే, ఒకేసారి అనేక భాషలలో నిరాఘాటంగా, ధారాళంగా చర్చ సాగడానికి వారు తోడ్పడుతారు. వారు ఒక ప్రక్క వింటూ మరొక ప్రక్క మాట్లాడుతూ ఉంటారు ప్రతినిధుల స్థానాలవద్ద డయల్స్ ఉంటాయి. ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్, రష్యన్, చైనీస్ భాషలలో ఏది వినాలనుకుంటే దానికోసం డయల్ తిప్పి ఇయర్ ఫోన్ (శ్రవణ యంత్రం) తగిలించుకుని ప్రసంగాలను వినవచ్చును.

సమితి ప్రతినిధులు, ఉద్యోగుల పిల్లలకోసం సమీపంలోనే ప్రత్యేకంగా ఒక అంతర్జాతీయ పాఠశాల ఉన్నది. అందులో సుమారుగా 500 మంది పిల్లలు చదువుకుంటున్నారు. వీరు 50 దేశాలకు చెందినవారు. వీరి ఉపాధ్యాయులు సుమారు 20 జాతులకు చెందినవారు.

సమితిలో ఏమి జరుగుతున్నదో బయటి ప్రజలకు తెలియజేసే బాధ్యత ప్రధాన కార్యాలయానికి ఉన్నది. ప్రపంచ వ్యాప్తంగా సమితి సాగిస్తున్న కార్యకలాపాలను గురించి సమితి సమాచారశాఖ పెక్కు పుస్తకాలను, పత్రికలను, పత్రాలను ప్రచురిస్తూ ఉంటుంది. "ప్రజలమైన మనం" ఎప్పటికప్పుడు సమితి విశేషాలను తెలుసుకోడానికి వీలుగా సమితి పత్రికల వారికి వార్తలు ప్రకటనలూ జారీ చేస్తూ ఉంటుంది.

దీని అంతటికీ ఎంత డబ్బు ఖర్చవుతుంది? మామూలు ఖర్చులకు గానూ సమితికి ఏడాదికి తొమ్మిదికోట్లడాలర్లపై చిల్లర ఖర్చవుతుంది. ఈ ఖర్చును సభ్య దేశాలన్నీ కలిపి భరిస్తాయి. ఒక్కొక్క దేశపు ఆర్థిక స్తోమతు ఎంత ఉన్నదో పరిశీలించి, తదనుగుణంగా ఏ దేశం ఎంత ధనం చెల్లించాలో సర్వ ప్రతినిధిసభ నిర్ణయిస్తుంది.

ఇటీవల కొన్ని ప్రత్యేక కార్యక్రమాలకోసం సమితికి అదనంగా ధనం అవసరమవుతున్నది. మధ్య ప్రాచ్యంలోనూ, కాంగోలోనూ శాంతి పరిరక్షణకు విశేషంగా ధనవ్యయం జరుగుతున్నది. ఈ అదనపు నిధులను సేకరించడం తేలిక పని కాదు. నిజానికి, సమితిలోని నాలుగోవంతు దేశాలు ఇటువంటి కార్యక్రమాలకు ధనం చెల్లించడానికి నిరాకరించాయి దీనివల్ల సమితి కొంత కాలంపాటు చాలా ఇబ్బంది పడింది. అయితే, మామూలు ఖర్చులకు ఇవ్వవలసిన ధనాన్ని ఆయా దేశాలు సకాలంలోనే చెల్లిస్తూ ఉన్నాయి—ఎక్కడో కొద్ది సందర్భాలలో తప్ప.

సమితి కృషిని గురించి ముందు పేజీలలో ఇచ్చిన ఉదాహరణలు చూస్తే, ఈ మొత్తం ఖర్చు—సాధించిన పనితో పోల్చితే—ఎంత తక్కువో తెలుస్తుంది. "ప్రజలమైన మనం" అందరం ప్రతి ఏడాది ఈ ఖర్చును సమానంగా పంచుకుంటే, ఒక్కొక్కరం సమితికి చెల్లించేది ఒక వార్తా పత్రిక లేదా ఒక కప్పు కాఫీ ఖరీదుతో సమానం. శాంతిని వ్యవస్థీకరించడానికి సమితికి అయ్యే మొత్తం ఖర్చు ఎంత స్వల్పమంటే - ఒక ఆధునిక విమానవాహక నౌకకు అయ్యే ఖర్చు, లేదా ఒక అణ్వాస్త్ర స్థావర నిర్మాణానికి అయ్యే ఖర్చు సమితికి పది సంవత్సరాలకో, ఇరవై సంవత్సరాలకో సరిపోతుంది!

## భద్రతా మండలి

సమితిలోని మూడు మండలులలో ఎక్కువ ప్రచారం పొందినది, పలుకుబడిగలది భద్రతామండలి. ఇది ప్రధానంగా రాజకీయ సమస్యలను,

అంతర్జాతీయ వివాదాలను పరిశీలిస్తుంది. (అందుకే దానికి అంత ప్రచారం లభించింది.) ఇందులో 11 మంది సభ్యులు ఉంటారు. వీరిలో ఐదుగురు శాశ్వత సభ్యులు–ఫ్రాన్సు, బ్రిటన్, రష్యా, అమెరికా, చైనాల ప్రతినిధులు. (చైనా అంటే [illegible] తైవాన్ లేక ఫార్మోజా.)



మిగిలిన ఆరుగురు సభ్యులను సర్వ ప్రతినిధిసభ ఎన్నిక చేస్తుంది. ఒక్కొక్క సభ్యుడు రెండేసి సంవత్సరాలపాటు భద్రతామండలిలో ఉంటాడు. 1945 లో సమితిని స్థాపించినప్పటినుంచి ఇప్పటివరకు ఎన్నో కొత్త దేశాలు ఇందులో చేరాయి (వీటి జాబితా 248 వ పేజీలో చూడండి) అందుచేత, మండలికి మరిన్ని ఎక్కువ దేశాలను ఎన్నుకోవాలనీ, దాని వల్ల మరిన్ని ఎక్కువ దేశాలు మండలికి తమ సాహాయ్య సహకారాలతో సేవచేసే అవకాశం ఉంటుందని పలువురు భావిస్తున్నారు.

ముఖ్యమైన విషయాలన్నింటిలోనూ శాశ్వత సభ్యులు ఐదుగురూ కలిసి వోటు చేయాలి. అలా చేయకపోతే ఆ తీర్మానం చెల్లదు. ఇలా ఒక



దేశం వోటు చేయకపోవడాన్ని 'వీటో' చేయడం అంటారు. అంటే ఒక శాశ్వత సభ్యుడు మిగతా నలుగురి అభిప్రాయాన్ని త్రోసిపుచ్చే అవకాశం ఉన్నది. ఈ నిబంధనవల్ల, భద్రతామండలి ముఖ్యమైన నిర్ణయాలు చేయడం అసంభవమైన పరిస్థితులు చాలాసార్లు ఏర్పడినాయి. రష్యాకు, మిగతా శాశ్వత సభ్య దేశాలకు మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు ఏర్పడేవి. దాని వల్ల, మండలిలో అధిక సంఖ్యాకులు సమర్థించిన అనేక ప్రతిపాదనలు 'వీటో' చేయబడినాయి. 1956 లో, సూయజ్‌పై సైనిక చర్యను నిలిపి వేయాలని కోరే తీర్మానాన్ని బ్రిటన్ వీటో' చేసింది. కాబట్టి, అంతర్జాతీయ ఏకీభావంకంటే జాతీయ సార్వభౌమాధికారమే ఒక్కొక్కప్పుడు శక్తిమంతమవుతుందని 'వీటో' స్పష్టంగా రుజువు చేస్తున్నది.

శాంతికి ప్రమాదం ఏర్పడినప్పుడు, శాంతి పరిరక్షణ ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడు, శాంతి సూత్రాన్ని అతిక్రమించే దేశంతో రైలు సంబం



దాలను, నౌకా విమాన తంతి సంబంధాలను, రేడియో సంబంధాలను పూర్తిగా తెంచివేసుకోవలసిందని సమితి సభ్య దేశాలన్నింటికీ భద్రతా మండలి విజ్ఞప్తి చేస్తుంది. అది మండలి బాధ్యత అని నియమావళి నిర్దేశించింది. ఈ తీవ్ర చర్యలను "మంజూరు" (Sanctions) అంటారు. అవసరాన్నిబట్టి సైనిక చర్య తీసుకోవాలని కూడా భద్రతామండలి ఆదేశించవచ్చు. కాని, ప్రతిసారి ఇటువంటి చర్యకు 'వీటో' అడ్డం పడుతున్నది

అందుచేత 'వీటో'వల్ల భద్రతా మండలిలో ప్రతిష్టంభన ఏర్పడినప్పుడు, శాంతి పరిరక్షణ చర్యలను తీసుకునే అధికారం సర్వ ప్రతినిధి సభకు ఇస్తూ 1950 లో ఒక తీర్మానాన్ని సభ అమోదించింది. అప్పటి నుంచి సమితి "శాంతి పరిరక్షణ" కార్యకలాపాలను సర్వ ప్రతినిధి సభ, భద్రతామండలి కలిసి నిర్వహిస్తున్నాయి

"శాంతి పరిరక్షణ" కార్యకలాపాలు అంటే ఏమిటి? ఈ క్రింది ఉదాహరణలవల్ల ఆ మాటకు అర్థం చక్కగా తెలుస్తుంది.

1947 లో నెదర్లాండ్స్‌కు, ఇండొనీసియాకు మధ్య వివాదం ఏర్పడింది. కాని, భద్రతాసమితి కల్పించుకుని, ఉభయ పక్షాలను యుద్ధవిరమణ చేయవలసిందనీ, శాంతియుతంగా వివాదాన్ని పరిష్కరించుకోవలసిందనీ కోరింది. తర్వాత సమితి పర్యవేక్షక సంఘాన్ని వివాద ప్రాంతానికి పంపడం జరిగింది. ఫలితంగా, ఇండొనీసియా సంయుక్త రాష్ట్రాల అవతరణ శాంతియుతంగా జరిగింది.

1948 లో పాలస్తీనా సమస్య అరబ్-ఇజ్రాయిల్ సంఘర్షణకు దారి తీసింది. పాలస్తీనా విభజన విషయమై ఈ వివాదం ఏర్పడింది. కాని,



సమితి మధ్యవర్తి ఉభయ పక్షాలమధ్య సంప్రతింపులు జరిపి శాంతి కుదిర్చాడు. స్వీడన్ దౌత్య ప్రముఖుడు కౌంట్ బెర్నాడోట్ మధ్యవర్తిగా పని చేశాడు. ఆ పని నిర్వహణలోనే ఆయన ప్రాణాలు వదిలారు.

1950 లో, కొరియా [illegible] [illegible] దురాక్రమణ జరిగినట్లు ఫిర్యాదు చేరగానే, దాడిని తిప్పికొట్టడానికి కొరియాకు సాయం చేయవలసిందని సభ్యదేశాలకు భద్రతా మండలి సిఫార్సు చేసింది. 16 దేశాల నుంచి సేకరించి, సమీకరించిన సమితి సైన్యం కొరియా యుద్ధంలో పాల్గొన్నది.



చాలా రక్తపాతం జరిగిన తర్వాత. చివరికి 1953 లో సంధి కుదిరింది: యుద్ధ విరమణ జరిగింది.

1956 లో, బ్రిటన్, ఫ్రాన్స్, ఇజ్రాయిల్ దేశాల సేనలు ఈజిప్టుపై దాడి చేసినప్పుడు, మధ్యప్రాచ్యంలో శాంతి పరిరక్షణకై సర్వ ప్రతినిధి సభ సమితి అత్యవసర సైన్యాన్ని రూపొందించింది. (దీని సంక్షిప్త నామం 'యునెఫ్'—U N E F—యునైటెడ్ నేషన్స్ ఎమర్జన్సీ ఫోర్స్.) ఏడు దేశాలనుంచి సేకరించిన సేనలతో ఈ 'యునెఫ్'ను రూపొందించారు. ఇది ఇప్పటికీ ఇజ్రాయిల్‌కు అరబ్ రాజ్యాలకు మధ్య సరిహద్దు మండలాలలో గస్తీ కాస్తూనే ఉంది. ఇప్పటికీ ఇది ప్రమాద ప్రాంతంగానే ఉన్నది.

1960 లో, కాంగో రిపబ్లిక్ సమితి సాయం కోరింది. అప్పటికి కాంగో స్వాతంత్ర్యం పొంది ఎక్కువకాలం కాలేదు. (దాని రాజధాని లియోపోల్డ్ విల్.) కటాంగాలోనూ, ఇతర చోట్ల గల తిరుగుబాటు వర్గాల నుంచి తమ భూభాగానికి రక్షణ కల్పించవలసిందని కాంగో అభ్యర్థించింది. అందుమీదట, కాంగోకు సైనికంగా, ఇతరత్రా సాయం అందజేయడానికి అవసరమైన చర్యలు తీసుకోవలసిందని భద్రతా మండలి ప్రధాన కార్యదర్శికి అధికారం ఇచ్చింది వెంటనే సమితి సేనను అక్కడకు పంపి, క్రమవ్యవస్థను నెలకొల్పడం జరిగింది అంతేకాక, కాంగోలో ప్రజా జీవితానికి చక్కని ప్రాతిపదిక ఏర్పరచడం కూడా జరిగింది. కాని, ఈ కృషిలో నాటి ప్రధాన కార్యదర్శి డాగ్ హామర్షెల్డ్ ప్రాణాలు కోల్పోయారు. మధ్య ఆఫ్రికాలో విమానం కూలిపోగా ఆయన మరణించారు.

## ధర్మకర్తృత్వ మండలి

ఇది నానాజాతి సమితిలోని 'సంరక్షణాధికారాల సంఘం' వంటిది. విమోచనం పొంది, ఇంకా స్వపరిపాలనా వ్యవస్థ పొందని దశలో ఉన్న వలస ప్రాంతాల శ్రేయస్సును పరిరక్షించడం దీని బాధ్యత.



సంస్కృతులు, సాంఘిక వ్యవస్థలు ఎంత భిన్నంగా ఉన్నప్పటికీ ప్రపంచంలోని మానవు లందరికీ ఒకే రకమైన హక్కులు ఉన్నాయనీ, ఒకే విధమైన ఆశయాలున్నాయనీ, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత గుర్తించడం జరిగింది. అందుచేత, సమితి నియమావళి ననుసరించి, వెనక బడిన దేశాల ప్రజల శ్రేయస్సును కాపాడడం కోసం పన్నెండు మంది సభ్యులతో ధర్మ కర్తృత్వ మండలిని స్థాపించారు. వారి శ్రేయస్సుకు రక్షణ కల్పించడం అభివృద్ధి చెందిన దేశాల "పవిత్ర ధర్మం" అని సమితి భావించింది

ఇటువంటి "సంరక్షణక్రింద ఉన్న ప్రాంతాలు" స్వపరిపాలన ఏర్పరచుకోడానికి సహాయం చేయడం ధర్మకర్తృత్వ మండలి మొదటి కర్తవ్యం. వీటిలో చాలా ప్రాంతాలు ఇటీవల కొద్ది సంవత్సరాలలో స్వతంత్ర దేశాలు అయినాయి పసిఫిక్ ప్రాంతంలో మొదట పదకొండు

ఉండేవి, ఇప్పుడు మూడు మాత్రమే. (నౌరూ, న్యూగినియా, ఇతర దీవులు) సమితి సంరక్షణ క్రింద మిగిలాయి.

సమితి ప్రధాన కార్యాలయంనుంచి ప్రతి ఏడాది ప్రతినిధి వర్గాలను ఆ ప్రాంతాలకు పంపుతూ ఉంటారు. ఈ ప్రతినిధి వర్గాలు ఆ ప్రాంతాలలో ప్రజా శ్రేయస్సు ఎలా సంరక్షించబడుతున్నదో పరిశీలించి, అక్కడి పరిస్థితులను సమితికి నివేదిస్తాయి. తమకు ఏమైనా ఫిర్యాదులు వుంటే వాటిని ధర్మ కర్తృత్వ మండలికి అందజేయడం సంరక్షిత ప్రాంతాల ముఖ్య బాధ్యత

ఈ ప్రాంతాలలోని చిన్న చిన్న గ్రామాలనుంచి, వ్యక్తులనుంచి ప్రతిరోజూ ధర్మ కర్తృత్వ మండలికి పెద్ద టపా వస్తుంది. వేలాది ప్రజలు తమ నిత్య జీవన పరిస్థితులగురించి, సమస్యలను గురించి, తమ ఆశలను గురించి, పోలీసులు, పన్ను వసూళ్ళ అధికారులు తమకు చేస్తున్న "అన్యాయా"లను గురించి మండలికి లేఖలు వ్రాస్తూ ఉంటారు తమ పొలం అన్యాక్రాంతమయిందనో, పశువులను ఎవరో తోలుకు వెళ్ళారనో, ఇంకా ఇటువంటివే ఎన్నో ఫిర్యాదులు చేస్తూ వుంటారు. వారికి సమితి సానుభూతి లభిస్తుంది. సాధ్యమైన సందర్భాలలో సాయం, మద్దతు కూడా లభిస్తాయి.

ఇవి కాక, 70 కి పైగా ఇతర ప్రాంతాలను 1945 లో సమితి పర్యవేక్షణ క్రింద ఉంచడం జరిగింది. అప్పటికి అవి ఇంకా స్వాతంత్ర్యం పొందలేదు. వాటిని "స్వపరిపాలన లేని ప్రాంతాలు" అని వ్యవహరించేవారు వాటిలో ఈ క్రింది దేశాలు ఈ మధ్య కాలంలో స్వాతంత్ర్యం పొందాయి. (మిగతావి త్వరలో పొందబోతున్నాయి). ఘనా, నైజీరియా, సీర్రాలియోన్, చాడ్, కాంగో (బ్రాజవిల్), కాంగో (లియోపోల్డ్ విల్), మడగాస్కర్, మాలీ, ఐవరీ కోస్ట్, గినియా, గాబన్, దహోమీ, సూడాన్, సెనెగాల్, నైజర్, మారిటానియా, ఎగువ వోల్టా, కెన్యా, యుగాండా,

మొరాకో; టునీసియా (ఇవన్నీ ఆఫ్రికాలోనివి). సైప్రస్ (మధ్యధరా ప్రాంతం), మలయా సమాఖ్య, లావోస్, కంబోడియా, వియత్నాం (ఆగ్నేయాసియా).

ఈ దేశాలు ఒక్కొక్కటే స్వాతంత్ర్యం పొందడం, పొందిన వెంటనే సమితి సభ్యుల జాబితాలో చేరడం జరుగుతూ వచ్చింది.

## ఆర్థిక, సాంఘిక వ్యవహారాల మండలి (ఇకోసాక్)

"మరింత విస్తృతమైన స్వాతంత్ర్యం, మరింత ఉన్నతమైన జీవన ప్రమాణాలు" సృష్టించాలని సమితి నియమావళి ఆశయం. ఇక్కడ మళ్ళీ—ఆహారం, స్వాతంత్ర్యం ప్రపంచ వ్యాప్తమైన స్నేహంతో ముడివడి ఉండడం గమనార్హం.

ఈ మండలిలో ఇప్పుడు 18 మంది సభ్యులున్నారు. ఒక్కొక్కరి సభ్యత్వ కాలం మూడు సంవత్సరాలు. ఇటీవల పెక్కు కొత్త దేశాలు సమితిలో చేరినందున, సభ్యుల సంఖ్యను 27 కు పెంచాలని అనుకుంటు న్నారు. ఈ మండలికి ఎన్నుకునేది దేశాలనే గానీ వ్యక్తులను కాదు. అయి నప్పటికీ సాధారణంగా, ఎన్నిక అయిన దేశాలు—మండలి జరిపే ప్రతి సమావేశానికీ—ఒకే ప్రతినిధివర్గాన్ని పంపుతూ వుంటాయి. ఆ విధంగా ఆ ప్రతినిధులు అంతర్జాతీయ సమిష్టి కృషిని అలవరచుకొనగలుగుతున్నారు.

ఇకోసాక్ క్రింద పెక్కు సంఘాలు, సంస్థలు పని చేస్తున్నాయి. వీటిని గురించి ఈ అధ్యాయంలో క్లుప్తంగా తెలుసుకుందాం. ఇకోసాక్ ముఖ్య అనుబంధ సంస్థలను "ప్రత్యేక సంస్థలు" అని వ్యవహరిస్తున్నారు. అటువంటివి ఒక డజనుకి పైగా ఉన్నాయి. ప్రక్క పేజీలో ఉన్న పట ములో వాటిని, సమితిలో వాటి స్థానాన్ని స్థూలంగా గ్రహించవచ్చును. వాటిని సాధారణంగా వాటి పొడి అక్షరాలతోనే వ్యవహరిస్తారు. వాటి పూర్తి పేర్లు ఈ అధ్యాయం చివరలో చూడవచ్చును.



ఆఫ్రికా, యూరప్, దక్షిణ అమెరికా, దూర ప్రాచ్యం—వీటికి నాలుగు ప్రాంతీయ సంఘాలు ఉన్నాయి. (వీటిని పటంలో ఎడమవైపు చూడవచ్చును) ప్రతిదేశం తన ప్రాంతపు ఆర్థిక ప్రణాళికలో పాల్గొనడానికి వీలుగా ఈ సంఘాలను నియమించారు.

పటంలో కుడివైపున 'ఐ ఎల్ ఓ' (అంతర్జాతీయ కార్మిక సంఘం), 'యు పి యు' (ప్రపంచ తపాలా సంఘం) ఉన్నాయి. వీటిలో మొదటిది 1919 లో స్థాపించబడింది; రెండవది 1874 లో స్థాపించబడింది. దాదాపుగా మిగిలినవన్నీ కొత్తగా స్థాపించబడినవే. వీటిలో ఉదాహరణకు నాలుగింటిని చూద్దాం. ఇవి; 'ఎఫ్ ఎ ఓ', 'డబ్ల్యు హెచ్ ఓ', 'ఐ సి ఎ ఓ', 'డబ్ల్యు ఎం ఓ'. వీటిని చూసిన తర్వాత—పటంలో ఎడమవైపున ఉన్న 'యూనిసెఫ్' (యు ఎన్ ఐ సి ఇ ఎఫ్), 'హెచ్ ఆర్ పి'లను చూద్దాం.

## ఎఫ్ ఎ ఓ F A O (ఆహార, వ్యవసాయ సంఘం)

**"ప్రజలమైన మన"లో మూడింట రెండు వంతులమందికి కడుపు నిండా తినడానికి తగినంత తిండి లేదు; లక్షలాది ప్రజలకు గృహ వసతి**




లేదు; పాఠశాలలు లేవు; వ్యక్తిగత భద్రత లేదు; జీవనోపాధి లేదు. ఇది మన అందరికీ కూడా ప్రమాదకరమైన పరిస్థితి. ఎందుకంటే, అసంఖ్యాక ప్రజలు దారిద్ర్యంతో నికృష్ట జీవితం సాగిస్తూ ఉంటే నిజమైన శాంతి లభ్యం కాదు.

అందుచేతనే ఆహార వ్యవసాయ సంఘం 1945 లో కార్య రంగంలో ప్రవేశించింది. అప్పటి నుంచి అది అన్నార్తుల పాలిట ఆశా కిరణంగా ఉన్నది ఈ సంఘానికి లెక్కలేనన్ని బాధ్యతలున్నాయి. ఆసియాలో యూరప్‌లో సస్యశ్యామలమైన పెక్కు ప్రాంతాలను రెండవ ప్రపంచ యుద్ధం నాశనం చేసింది. అందువల్ల ఈ సంఘం తన నిర్మాణాత్మక కార్యక్రమాన్ని పునాదులనుంచి ప్రారంభించవలసి వచ్చింది.

సమితి 'కుటుంబ' దేశాలన్నీ కొమ్ము కాసి ఈ సంఘాన్ని గబగబా నడిపించాయి. ఈ సంఘం ప్రపంచంలోని క్షుత్బాధను పూర్తిగా అంతం

చేయగలదని కొంతకాలంపాటు అందరూ ఆశ పడ్డారు. కాని మానవాళికి మరొక కొత్త బెడద వచ్చిపడింది. జనాభా విపరీతంగా పెరగడం ప్రారంభించింది.

"ఈ లక్షలాది, కోట్లాది అదనపు జనానికి ప్రపంచం తిండి పెట్టగలదా ?" అనే ప్రశ్న ఎదురయింది.

ఈ ప్రశ్నకు ఇంతవరకు ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. 1939 నాటి నుంచి ఇప్పటికి ప్రపంచ జనాభా రెట్టింపు అయింది. ఆహారోత్పత్తి మాత్రం ఏడాదికి ఒక శాతం, రెండు శాతం పెరుగుతున్నది. ఆహారోత్పత్తి పెరుగుతున్నది నిజమే, కాని. తినే జనం ఇంకా ఎక్కువగా పెరుగుతున్నారు. రోజుకు అదనంగా 1,40,000 మంది భోజనానికి వస్తున్నారు, ఇలా ఆహారం కంటే జనాభా ఎక్కువగా పెరుగిపోతు ఉంటే, అన్నార్తులకు ఆశ ఏమి ఉంటుంది?

సమితి వర్గాలలో దీనినే "వ్యత్యాసం" (The Gap) సమస్య అంటారు. ధనిక దేశాలు మరింత ధనిక దేశాలవుతున్నాయి పేదదేశాలు మరింత పేద దేశాలవుతున్నాయి. ధనిక దేశాలకు, పేద దేశాలకు మధ్య ఈ వ్యత్యాసాన్ని తగ్గించడానికి, 1960 లో సర్వప్రతినిధి సభ దశవర్ష ప్రణాళికను ప్రారంభించింది. ఆహారోత్పత్తిని అధికం చేయడానికి వాణిజ్యాన్ని అభివృద్ధి చేయడానికి ఆరోగ్య పరిస్థితులను మెరుగు పరచడానికి, మానవ మేధను సర్వతోముఖంగా ఉపయోగించుకొనడానికి (విద్యాభివృద్ధికి) సమితికి చెందిన సంస్థలన్నీ కలిసి కృషి చేస్తున్నాయి. (ఈ "వ్యత్యాస" సమస్యను మళ్ళీ 11 వ అధ్యాయంలో పరిశీలించుదాం)

1960 లో, సమితి ఆహార వ్యవసాయ సంఘం "క్షుద్బాధా విమోచనోద్యమం" ప్రారంభించింది. దాదాపుగా సభ్యదేశాలు అన్నీ ఈ ఉద్యమంతో సహకరిస్తున్నాయి. ఈ ఉద్యమంలోని కార్యక్రమాలు ఇవి.




ఆహారోత్పత్తిని పెంచడంకోసం ఆయా దేశాలలో భూసార పరిరక్షణకు నీటి వనరుల అభివృద్ధికి సాయం చేయడం:

వ్యవసాయ క్షేత్రాలలో, అడవులలో, మత్స్య తటాకాలలో సాధించిన ఉత్పత్తులను ప్రపంచమంతటా అవసరాలకు అనుగుణంగా పంపిణీ చేయడం.

ఋణ్యసహాయదాతలకు—ముఖ్యంగా వెనకబడిన దేశాలలోని వారికి ఇవ్వడం; వారి జీవన పరిస్థితులను మెరుగు పరచడం.

ఆహార వ్యవసాయ సంఘం రెండు సంవత్సరాలకొకసారి సమావేశమవుతుంది. 25 మంది సభ్యులుగల ఒక మండలి దీని కార్యకలాపాలను నిర్వహిస్తుంది. దీని సాలుసరి ఖర్చు సుమారు రెండు కోట్ల డాలర్లు ఈ సంఘం ప్రధాన కార్యాలయం రోమ్ (ఇటలీ)లో ఉన్నది. దీని డైరెక్టర్ జనరల్ భారతీయుడు. ఆయనకింద పెక్కుమంది పని చేస్తూ ఉంటారు.

## డబ్ల్యు హెచ్ ఓ (ప్రపంచ ఆరోగ్యసంఘం):

జాతీయ సరిహద్దులు రోగాలను అడ్డగించలేవని 8 వ అధ్యాయంలో చెప్పుకున్నాం, అందుచేత ఆరోగ్యం ప్రపంచమంతటికీ సంబంధించిన సమస్య. ప్రపంచ ఆరోగ్య సంఘం 1945 లో స్థాపించబడింది, అప్పటి నుంచి ప్రపంచవ్యాప్తంగా ఈ సంఘం చేసిన కృషి, సాధించిన పెక్కు విజయాలు అన్ని దేశాల ఆరోగ్యశాఖాధికారుల మన్ననలు చూరగొన్నాయి. అన్ని దేశాలూ ఈ సంఘానికి మద్దతునిచ్చాయి.

1947 లో ఈజిప్టులో కలరావ్యాధి తీవ్రంగా వ్యాపించింది. ఈ అంటురోగం మొదట ఒక గ్రామంలో ప్రారంభమయింది. కొద్ది రోజుల లోనే కలరారోగాల సంఖ్య 60 వేలకు పెరిగింది వెంటనే సుమారుగా ఒక ఇరవై దేశాలు ప్రపంచ ఆరోగ్య సంఘం ద్వారా ఈజిప్టుకు సాయం పంపాయి. డాక్టర్లను, నర్సులను, ఔషధాలను, టీకాల మందును అక్కడకు పంపడం జరిగింది. ఆరు వారాలలో వ్యాధిని అదుపులోకి తీసుకువచ్చారు. ఆరోగ్య సంఘం అత్యంత జయప్రదంగా నిర్వహించిన కార్యాలలో ఇదొకటి.

ప్రపంచ మంతటా ప్రబలి ఉన్న అనేక ఇతర రోగాలను కూడా ఇలాగే అదుపులో పెట్టడం జరిగింది. ఈ రోగాలు అంతకు పూర్వం అమిత



వేగంతో పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ విచ్చల విడిగా వ్యాపించి పోతూ ఉండేవి. ఒకప్పుడు మలేరియా మహమ్మారి ఏడాదికి 30 లక్షలమందిని పొట్టనబెట్టుకుంటూ ఉండేది ముఖ్యంగా దూరప్రాచ్య దేశాలలో అది ఆడింది ఆటగా ఉండేది. కాని ఈనాడు 'డి డి టి'తో దాని ఆట కట్టింది. సంచార బృందాలు ప్రపంచంలో మూలమూలలకు వెళ్లి 'డిడిటి' చల్లి మలేరియాను శుభ్రంగా తుడిచిపెట్టి వేశారు. ఉదాహరణకు, ఇటలీలో మలేరియా రోమన్ సామ్రాజ్యకాలనుంచి తిష్ఠ వేసుకు కుర్చుంది. ఇటలీ మలేరియా సంస్థానంగా ఉండేది. ఇప్పుడు దాని హయాం అంతరించింది.

ప్రపంచ ఆరోగ్య సంఘం, ఆహార వ్యవసాయసంస్థ చేదోడు వాదోడుగా పనిచేస్తూ ఉంటాయి, కడుపునిండా తినడానికి తిండిలేని ప్రదేశాలను ప్రపంచపటంలో టిక్కుపెట్టి, తర్వాత అనారోగ్యం తీవ్రంగా ఉన్న ప్రదే

కాలను టిక్కు పెట్టితే అవీ ఇవీ ఒకే దేశాలవుతాయి. ఎందుకంటే తిండి సమృద్ధిగా లేని చోటనే అనారోగ్యం ఉంటుంది.ఆహారం, ఆరోగ్యం. ఒక దాని నొకటి విడిచిపెట్టి ఉండవు. సమితి దశవర్ష ప్రపణాళిక క్రింద నిపుణుల బృందాలు ఇతర ప్రత్యేక సంస్థలతో సహకరిస్తూ కొత్తదేశాలు తమ ఆరోగ్య సంస్థలను తామే నెలకొల్పుకొనగలిగేటట్లు తోడ్పడుతున్నాయి.

ప్రపంచ ఆరోగ్య సంస్థ సాలుసరి ఖర్చు రెండు కోట్ల డాలర్లపై చిల్లర ఉంటుంది. ఇది ఏడాదికి ఒకసారి సమావేశమవుతుంది. ఆ సమావేశంలోనే 18 మంది సభ్యులతో ఆహార వ్యవసాయ సంఘం మాదిరిగానే ఒక కార్యనిర్వాహక మండలిని నియమిస్తుంది. దీని డైరెక్టర్ జనరల్ కెనడాకు చెందినవాడు, ప్రపంచ వ్యాప్తంగా ఈ సంఘం నిర్వహించే కార్యక్రమాలను ఆయన పర్యవేక్షిస్తూ ఉంటాడు. ఈ సంఘం ప్రధాని కార్యాలయం జెనీవాలో ఉన్నది.

## ఐ సి ఎ ఓ (ICAO అంతర్జాతీయ పౌర విమాన సంస్థ)

సాలె గూటిలోని దారాలవలె ఈనాడు భూగోళమంతటా విమాన మార్గాలు అల్లుకుపోయాయని మనం ఇంతకు ముందు చెప్పుకున్నాం. (146 వ పేజీలోని పటం చూడండి మరొక్కసారి.) ఈ విమాన మార్గాల నిర్వహణ వ్యవహారాలు చూడడానికి ఏర్పడినది. అంతర్జాతీయ పౌర విమాన సంస్థ.

వైమానికులు, విమానాలకు సంబధించిన ఇతర ఉద్యోగుల భద్రతకు చర్యలను నిర్ణయించడం. సమన్వయ పరచడం ద్వారా-విమాన ప్రయాణీకులందరి సౌకర్యం కోసం-పౌర విమాన వ్యవస్థను రూపొందించడానికి ఈ సంఘం ఎంతగానో తోడ్పడింది అప్పుడప్పుడే స్వంత విమానయానం సంస్థలను నెరకొల్పుకుంటున్న దేశాలలో యువకులకు విమానాలను నడపడంలోనూ, ఇతర విషయాలలోనూ ఈ సంస్థ శిక్షణ నిస్తుంది.



విమానాలకు ప్రమాదాలను సూచించే రేడియో సంకేత ధ్వనులను వాడుకలోకి తెచ్చినది ఈ సంఘమే. ప్రపంచలో పలుచోట్ల ప్రమాదాలకు లోనైన వారిని రక్షించే కార్యక్రమాలను, తప్పి పోయిన వారి కోసం అన్వేషించే కార్యక్రమాలను, ఇంకా ఈ రకమైన అనేక కార్యక్రమాలను ప్రారంభించినది కూడా ఈ సంఘమే. వాతావరణ సూచన కోసం మహా సముద్రాల మధ్యలో అక్కడక్కడ కొన్ని ప్రత్యేక నౌకలను నిలిపి ఉంచే

పద్ధతిని ఈ సంఘమే నిర్వహిస్తున్నది. దీనివల్ల అన్ని దేశాలూ ప్రయో జనం పొందుతున్నాయి.

వంద పైగా దేశాలకు ఈ సంస్థలో సభ్యత్వం ఉన్నది. ఈ దేశాల ప్రతినిధులతో కూడిన ఒక సభ ఈ సంస్థ వ్యవహారాలను నిర్వహిస్తుంది. ప్రపంచంలోని విమాన మార్గాలను అన్నింటినీ కనిపెట్టి ఉండడం, అవసర మైన పథకాలు రూపొందించడం ఈ సంస్థ తాలూకు ఒక మండలి చేస్తూ ఉంటుంది. దీని సాలు సరిఖర్చు 40 లక్షల డాలర్లు మాత్రమే. దీని ప్రధాన కార్యదర్శి ఫ్రాన్సు దేశీయుడు. ప్రధాన కార్యాలయం మాంట్రి యల్ (కెనడా) లో ఉన్నది.

## డబ్లు ఎం ఓ (W M O ప్రపంచ వాతావరణ పరిశోధక సంస్థ)

ఇది ఆహార వ్యవసాయ సంస్థల అంతర్జాతీయ పౌర విమాన సంస్థ వంటి ఇతర సంస్థల సన్నిహిత సహకారంతో పనిచేస్తుంది. ప్రపంచం లోని వివిధ ప్రాంతాలలో గల వాతావరణ పరిశోధక కేంద్రాల కార్య కలా పాలను సమన్వయ పరచడం దీని ప్రధాన లక్ష్యం ఒక సంస్థ సేకరించిన సమాచారాన్ని మరొక సంస్థకు అందజేస్తూ ఉంటుంది. ఎప్పటికప్పుడు వాతావరణ పరిశీలనలు జరుపుతూ, ఆ సమాచారాన్ని పౌర విమానశాఖలకు, నౌకాయాన సంస్థలకు, వ్యవసాయ శాఖలకు, ఇతర సంస్థలకు అంద జేస్తూ ఉంటుంది. వాతావరణ సూచికలను రేడియో ద్వారా ప్రసారం చేయడం, పెద్ద తుపానులను ముందుగానే కనిపెట్టడం, విమానాల సిబ్బం దికి వాతావరణ విజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు తయారు చేయడం ఇవన్నీ ఈ సంస్థ చేసే పనులు.

ఈ సంస్థ ప్రచురించిన మేఘాల చిత్రపటాల పుస్తకం (ఇంట ర్నేషనల్ క్లౌడ్ అట్లాస్) లో కొన్ని వందల రకాల మేఘాల స్వరూప

స్వభావాలు వివరింపబడి ఉంటాయి. ధ్రువ మండలంలోనూ, సమ శీతోష్ణ మండలంలోనూ, ఉష్ణమండలంలోనూ ఉండే మేఘాలు, వాటిలో రకాలు, వాటిని గుర్తించే పద్ధతులు ఆ పుస్తకంలో పేర్కొనబడి ఉంటాయి. వ్యవసాయం, ఆరోగ్యం పరిశ్రమలు మున్నగు వాటికి వాతావరణం పరిశీలక సౌకర్యాలు అమర్చడంలో ఈ సంస్థ ఆయా దేశాలకు సాయం చేస్తుంది. దీని నిపుణుల బృందాలు ఆఫ్ఘనిస్తాన్, హైతీ, ఇజ్రాయిల్, లిబియా, టర్కీ, యుగోస్లావియా దేశాలలో పనిచేశాయి. వాతావరణ పరిశీలనలో ఈ సంస్థ విద్యార్థులకు శిక్షణ ఇస్తుంది.



అంతర్జాతీయ భూభౌతిక శాస్త్ర విజ్ఞాన సంవత్సరంగా పరిగణింపబడిన 1957-58 సంవత్సరంలో ఈ సంస్థ ప్రపంచ వ్యాప్తంగా వాతావరణ పరిశీలన కార్యక్రమాన్ని చేపట్టింది. ఆ ఏడాది నమోదు చేసిన 1,30,00,000 పరిశీలనలపై నివేదిక సమర్పించింది.

ప్రపంచ వాతావరణ పరిశోధక సంఘం మహాసభ కనీసం నాలుగు సంవత్సరాల కొకసారి జరుగుతుంది; దాని కార్యవర్గంలో 18 మంది

సభ్యులు ఉంటారు; సాలు సరిఖర్చు ఐదు లక్షల డాలర్ల పై చిల్లర; దీని ప్రధాన కార్యదర్శి బ్రిటిష్ జాతీయుడు; దీని ప్రధాన కార్యాలయం కూడా జెనీవాలోనే ఉన్నది.



## యూనిసెఫ్ (UNICEF అంతర్జాతీయ శిశు సంక్షేమనిధి)

ఇది పైన చెప్పినవాటి మాదిరి ప్రత్యేక సంస్థ కాదు. ప్రపంచ ఆరోగ్య సంస్థ తాలూకు ఒక శాఖ అని చెప్పవచ్చు. ఇది 1946 లో స్థాపించబడింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ మంతటా దారుణ పరిస్థితులు ఏర్పడినప్పుడు లక్షలాది శిశువులకు — ముఖ్యంగా యూరప్‌లోని వారికి ఈ నిధి ఎంతగానో సాయం చేసింది.

పిల్లలకోసం లక్షలాది పౌనుల పాల పొడిని, చేప నూనెను, ఇతర రకాల ఆహార పదార్థాలను ఈ సంస్థ సరఫరా చేసింది. 60 లక్షల మంది పిల్లలకు దుస్తులకోసం, పాదరక్షల కోసం, ప్రత్తి, ఉన్ని, చర్మం సరఫరా చేసింది. 1950 నుంచి ఈ సంస్థ ప్రధానంగా "వర్ధమాన దేశాల"లో పిల్లల సంక్షేమం కోసం కృషిచేయడం ప్రారంభించింది. (వర్ధమాన దేశాలను గురించి వచ్చే అధ్యాయంలో చూద్దాం.) అంగవికలురైన పిల్లలపట్ల ఈ సంస్థ ప్రత్యేక శ్రద్ధ చూపుతున్నది. దక్షిణ అమెరికాలో కోరింత దగ్గును, ఇతర శిశు వ్యాధులను రూపుమాపడానికి యూనిసెఫ్ ఉద్యమం సాగించింది.

ఇటీవల ఒక సంవత్సరం ఈ సంస్థ శిశుసంక్షేమ కార్యక్రమాలకు గానూ వివిధ దేశాలకు మూడుకోట్ల డాలర్లకు పైగా ధనాన్ని కేటాయించింది. ఈ సంస్థ ఖర్చులో అత్యధిక భాగం పిల్లల ఆరోగ్యం కార్యక్రమాల కోసమే ఖర్చు అవుతుంది. అయితే పిల్లల విద్యా కార్యక్రమాలకు కూడా ఈ సంస్థ సాయం చేస్తుంది. దీని ఆదాయంలో ఎక్కువ భాగం ఇప్పుడు కుటుంబ, శిశు సంక్షేమ కార్యక్రమాలకు, విద్యకు, వృత్తి శిక్షణకు ఖర్చు అవుతున్నది.

యూనిసెఫ్ ఇటీవల ఆరోగ్యకార్యక్రమాలకు, శిక్షణ కార్యక్రమాలకు గానూ 2,30,000 డాలర్ల ధనం కెన్యాకు కేటాయించింది. దీనితో కలిపి ఆ దేశంలో గ్రామీణ ఆరోగ్య పథకాలం కోసం ఈ సంస్థ ఇచ్చిన డబ్బు మొత్తం 10 లక్షల డాలర్లు అయింది. అంధత్వం వ్యాధి నిర్మూలనకై భారత దేశానికి యూనిసెఫ్ 5 లక్షల డాలర్లు ఇచ్చింది. మెక్సికోలో మలేరియా నిర్మూలనోద్యమం కోసం 1955 నుంచి ఇప్పటికి దాదాపు 15 లక్షల డాలర్లు ఖర్చుపెట్టింది. యూనిసెఫ్ నుంచి ధన సాహాయ్యం స్వీకరిస్తున్న దేశాలు, తాము స్వీకరించినదానికి రెండున్నర రెట్లు



ధనం తమది చేర్చి పథకాలను అమలు జరుపుతున్నాయి. అంటే—యూని సెఫ్ ఒక డాలరు ఇస్తే, దానిని స్వీకరించే దేశం తన సొమ్ము రెండున్నర డాలర్లు చేర్చుతున్నది. యూనిసెఫ్ ఇప్పుడు 112 దేశాలలోని 500 పైగా దీర్ఘకాలిక కార్యక్రమాలకు సాయం చేస్తున్నది. నిజంగా అది ప్రపంచ పరివ్యాప్తమైన అద్భుత కృషి.

ప్రపంచంలోని అన్ని దేశాలకు యూనిసెఫ్ సాయం చేస్తున్నట్లే యూనిసెఫ్‌కు ప్రపంచ దేశాలన్నీ సాయం చేస్తున్నాయి. వివిధ దేశాల లోని వేలాది పాఠశాలలు ధనం, ఆహారం, వస్త్రాలు యూనిసెఫ్‌కు కాను కగా పంపుతూ ఉంటాయి. ప్రతి ఏడాది క్రిస్మస్ పండుగకు ప్రపంచ దేశా లన్నింటి నుంచి లక్షలాది బాలలు 'శుభాకాంక్షల పత్రాల'ను యూనిసెఫ్‌కు పంపుతారు. వాటిపై బాలచిత్రకారులు స్వయంగా బొమ్మలు చిత్రించి

పంపుతారు. వాటిని అమ్మగా వచ్చిన ధనం ఈ 'శిశు సంక్షేమనిధి' లో చేరుతుంది.

30 మంది సభ్యులు గల కార్యనిర్వాహక మండలి ఈ సంస్థను నిర్వహిస్తుంది. దీనికి ఒక ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ ఉంటాడు. దీని ప్రధాన కార్యాలయం న్యూయార్క్‌లోనే ఉంది.

## మానవ వ్యక్తి విలువ

సమితి "యంత్రాంగం" గురించిన పై వర్ణన చదువుతున్నప్పుడు 'వ్యక్తి' ప్రాముఖ్యాన్ని మనం మధ్య మధ్య కాసేపైనా మరిచిపోయే ప్రమాదం ఉన్నది. కాని. సమితి ఎప్పుడూ 'వ్యక్తి' ప్రాముఖ్యాన్ని విస్మరించదు. అంతర్జాతీయ కార్మికసంఘం, ధర్మకర్తృత్వ సంఘం, శిశు సంక్షేమనిధి వీటిని చూస్తే సమితి ఒక పెద్ద అధికార యంత్రం కాదని తెలుస్తుంది. 'మానవ సత్వాల సంఘం' ఈ విషయాన్ని రూఢిచేస్తుంది.

ఉదాహరణకు ఒక వ్యక్తి కథ తీసుకుందాం. అతడికి పౌరసత్వం లేదు; ప్రయాణానుమతి పత్రం లేదు: ఇల్లూవాకిలీ అసలేలేవు: పశ్చిమానికి వలస వెళ్ళి, అక్కడ ఏదో జీవనోపాధి చూసుకుని స్థిరపడదామనే ఉద్దేశంతో తూర్పు యూరప్ నుంచి జర్మనీకి పారిపోయాడు రోగిష్టివాడు కావడం వల్ల అతడికి ఏ దేశానికి ప్రవేశానుమతిపత్రం (విసా) దొరకలేదు. అయినా వెనక్కి తిరిగి పోలేడు. అందుచేత అతడు ఒక పెనామా దేశపు నౌకలో వైర్లెస్ ఆపరేటర్‌గా ఉద్యోగంలో కుదిరాడు అతడు అలా నాలుగు సంవత్సరాలు ఆ నౌకలోనే ఒక దేశంనుంచి ఇంకొక దేశానికి తిరుగుతూ గడిపాడు. కాని ఏ దేశంలోనూ ఉండిపోవడానికి వీల్లేదు; ఉండనివ్వరు. చివరికి, సమితి కాందిశీకుల హైకమిషనర్ ఇతగాడి పరిస్థితి తెలుసుకుని, ఇంగ్లండ్‌లో నివాస వసతి కల్పించాడు. సొంత దేశం, సొంత

ఇల్లు లేక ఇటువంటి వారు కొన్ని వేలమంది ఎప్పటికైనా దేశం, ఇల్లు లభిస్తాయనే ఆశతో ఏళ్ళతరబడి కాందిశీకుల శిబిరాలలో నివసిస్తున్నారు. వారి ఆశకు ఆలంబనం సమితే. దిక్కులేని వానికి సమితే దిక్కు. లక్షలాది సమితి ప్రజలు సాయంకోసం చూస్తున్నారు.



తమ 'స్వాతంత్ర్యం' అనీ, తమ 'హక్కులు' అనీ వేటినైతే భావించారో వాటికోసం ప్రజలు పెక్కు శతాబ్దాలకాలం పోరాడారు. 'స్వాతంత్ర్యం' కోసం యుద్ధాలు జరిగాయి; రక్తం ఏరులై పారింది; అన్ని జాతులూ స్వాతంత్ర్య సాధనకై అనేక కష్టాలు భరించారు. ప్రాణాలు అర్పించారు. ప్రతిదేశమూ తాను తన ప్రజలకు సంపాదించిపెట్టిన స్వాతంత్ర్యాన్ని చూసి గర్విస్తుంది—అయితే ఎటువంటి "స్వాత్రంత్రాలు" అతి ముఖ్యమైనవి అనే విషయంలో అన్ని దేశాలు భావాలు ఒక్కటి కాకపోవచ్చు. 'స్వాతంత్ర్యం' అనే పదానికి ఒక్కొక్క ప్రజ ఒక్కొక్క అర్థం చెప్పుకుంటుంది.

నుంచి ప్రతి ఏడాది డిసెంబరు 10 వ తేదీని మానవ హక్కుల-దినోత్సవం జరుపుతున్నారు. మానవుని స్వాతంత్ర్య సమర చరిత్రలో అది అతిప్రధాన మైన దినం.

ఈ ప్రకటనలో ముప్ఫయి చిన్న ప్రకరణాలు ఉన్నాయి. ప్రపంచంలో ఎన్ని భాషలున్నాయో దాదాపు అన్నింటిలోనూ ఈ ప్రకటనను ప్రచురించారు ప్రకటనలో పేర్కొన్న "హక్కులు అన్నింటినీ ఇక్కడ చెప్పడం సాధ్యంకాదు; కాని, మొదటి ప్రకరణం మాత్రం, "మానవులందరూ స్వతంత్రులుగా, సమానులుగా జన్మించారు..." అని ప్రకటించింది. బానిసత్వం, హింస, అక్రమ నిర్బంధం, అమానుష శిక్షలు-వీటిని గురించి కొన్ని ప్రకరణాలు పేర్కొన్నాయి మత స్వాతంత్ర్యం, అభిప్రాయ ప్రకటన స్వాతంత్ర్యం, ఉద్యోగం చేసుకునే హక్కు, వృత్తిని ఎంచుకునే హక్కు, కార్మిక సంఘంలో చేరే హక్కు—వీటిని గురించి మరికొన్ని ప్రకరణాలు పేర్కొన్నాయి. ప్రపంచంలోని ప్రతి బాలుడు, ప్రతి బాలిక విద్యాభ్యాసం చేసే హక్కు కలిగి ఉన్నారని కూడా ఈ ప్రకటన తెలిపింది.

ఇదికాక, 1959 లో సర్వప్రతినిధి సభ "బాలల హక్కుల ప్రకటన"ను ఒక దానిని కూడా ఆమోదించింది. "శారీరకంగా, మానసికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా, సాంఘికంగా-స్వేచ్ఛాయుత పరిస్థితులలో, సహజ రీతిలో—వికాసం పొందడానికి అవసరమైన సాయం పొందే" హక్కు-బాలలందరికీ ఉన్నదని ఈ ప్రకటన పేర్కొన్నది. చట్టంలో బాలలకు ప్రత్యేక రక్షణలు కల్పించాలి. వారి వికాసానికి ప్రత్యేక అవకాశాలు కల్పించారు. జన్మించినప్పటినుంచి ఒక పేరు, ఒక జాతి కలిగి ఉండే హక్కు ప్రతి శిశువుకు ఉన్నది; ఆరోగ్యంగా పెరిగి పెద్దదయే హక్కు ఉన్నది. ఇందుకోసం బిడ్డకు, తల్లికి కూడా అవసరమైన రక్షణ కల్పించాలి; వారిపట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. తగుమాత్రపు బలవర్ధకా

హారం, సురక్షితమైన ఆశ్రయం, వైద్య సదుపాయం పొందే హక్కు పిల్లలకు ఉన్నది; ఇవికాక "ఉచిత, నిర్బంధ" విద్య పొందే హక్కు కూడా ఉన్నది.

మానవ స్వత్వాల ప్రకటన వల్ల, సమితి సాధించిన ఇతర ఒప్పందాల వల్ల-'ఏకత' అనే గమ్యం దిశగా మానవుడు గొప్ప పురోగమనం



పాఠి.పినట్లయితే? [illegible] ఉన్నాయి—అరబ్బులు కాబట్టి, క్రైస్తవులు కాబట్టి, బౌద్ధులు కాబట్టి, ఎస్కిమోలు కాబట్టి కాదు-వారు మానవులు కాబట్టి.

సమితి సాధించిన ఈ ఘన విజయాన్ని ప్రధాన కార్యదర్శి ఉథాంట్ ఇటీవల ఒక "మానవుల హక్కుల దినోత్సవం"లో క్లుప్తంగా ఇలా పేర్కొన్నారు.

"జెట్ విమానాలు, టెల్‌స్టార్ ఉపగ్రహాలూ అందు బాటులోకి వచ్చిన నేటికాలంలో ప్రపంచం శీఘ్రగతిని ఏక సమాజంగా రూపొందుతున్నది: ఈ సమాజంలో అందరి ఆశయాలు ఒక్కటే. ఏ దేశానికి ఆ దేశం ఒక ద్వీపంలాగా ఉండే రో[illegible] హక్కులకు సంబంధించిన సమస్యలు అంతర్జాతీయ చర్చా విషయాలైనాయి."

## సమితి సభ్య దేశాలు

| | |
|---|---|
| ఆఫ్ఘనిస్తాన్ | లైబీరియా, |
| ఆల్బేనియా | లిబియా |
| అల్జీరియా | లక్సెంబర్గ్, |
| అర్జెంటినా, | మడగాస్కర్ |
| ఆస్ట్రేలియా, | మలేసియా |
| ఆస్ట్రియా | మాలి |
| బెల్జియం, | మారిటానియా |
| బొలీవియా, | మెక్సికో, |
| బ్రెజిల్, | మంగోలియా |
| బల్గేరియా | మొరాకో |
| బర్మా | నేపాల్ |

బురుండీ
బైలో రష్యన్ ఎస్. ఎస్. ఆర్.
కంబోడియా
కామెరూన్
కెనడా.
మధ్య ఆఫ్రికా రిపబ్లిక్
సింహళం
చాడ్
చిలీ.
చైనా.
[illegible]
కాంగో (బ్రాజావిల్)
కాంగో (లియోపాల్డ్ విల్)
కోస్టారికా.
క్యూబా.
సైప్రస్
జకొస్లవాకియా.
దహోమీ
డెన్మార్క్.
డొమినికన్ రిపబ్లిక్.
ఈక్వడార్.
ఎల్ సాల్వడార్.
ఇథియోపియా.
ఫిన్లెండ్

నెదర్లాండ్స్.
న్యూజీలాండ్.
నికరాగ్వా.
నైజర్
నైజీరియా
నార్వే.
పాకిస్తాన్
పనామా.
పెరగ్వే.
పెరూ.
ఫిలిప్పైన్స్.
పోలెండ్.
పోర్చుగల్
రుమేనియా
రువాండా
సౌదీ అరేబియా.
సెనెగాల్
సియ్రాలియోన్
సోమాలియా
దక్షిణ ఆఫ్రికా.
స్పెయిన్
సూడాన్
స్వీడన్
సిరియా.

ఫ్రాన్స్•
గాబన్
ఘనా
గ్రీస్•
గ్వాతెమాలా•
గినియా
హైతీ•
హోండురాస్•
హంగరీ
ఐస్‌లాండ్
ఇండియా•
ఇండొనీషియా
ఇరాన్•
ఇరాక్•
ఐర్లెండ్
ఇజ్రాయిల్
ఇటలీ
ఐవరీకోస్ట్
జమైకా
జపాన్
జోర్డాన్
కెన్యా
థాయ్‌లాండ్
టోగో
ట్రినిడాడ్, టొబాగో
టునీసియా
టర్కీ•
యుగాండ
యుక్రేనియన్ ఎస్. ఎస్ ఆర్•
యు. ఎస్. ఎస్. ఆర్ (రష్యా)•
సంయుక్త అరబ్ రిపబ్లిక్•
బ్రిటన్•
టాంగనీకా, జాంజిబార్
సంయుక్త రిపబ్లిక్
అమెరికా సంయుక్త
రాష్ట్రాలు•
ఎగువ ఓల్టా
ఉరుగ్వే•
వెనిజులా•
ఏమెన్
యుగోస్లావియా•
కువాయిత్
లావోస్
లెబనాన్•

•ఈ గుర్తు ఉన్న దేశాలు 1945 లో చేరినవి.

మొత్తం సభ్యుల సంఖ్య 112.

# ఆర్థిక, సాంఘిక వ్యవహారాల మండలి

[దాని అనుబంధ సంఘాలు, సంస్థలు]

యూరప్ ఆర్థిక వ్యవహారాల సంఘం

ఆసియా, దూర ప్రాచ్య ఆర్థిక వ్యవహారాల సంఘం

దక్షిణ అమెరికా ఆర్థిక వ్యవహారాల సంఘం

ఆఫ్రికా ఆర్థిక వ్యవహారాల సంఘం

గణాంక వ్యవహారాల సంఘం

జనాభా వ్యవహారాల సంఘం

సాంఘిక వ్యవహారాల సంఘం

మానవ హక్కుల సంఘం

మహిళా సంక్షేమ సంఘం

నిద్ర మందుల వ్యవహారాల సంఘం

అంతర్జాతీయ వస్తు వాణిజ్య వ్యవహారాల సంఘం

సాంకేతిక సహాయ సంఘం

ఐ. ఎల్. ఒ—(ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్) అంతర్జాతీయ కార్మిక సంఘం.

ఎఫ్. ఎ. ఒ—(ఫుడ్ అండ్ అగ్రికల్చర్ ఆర్గనైజేషన్) ఆహార, వ్యవసాయ సంఘం.

యునెస్కో—యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్, సైంటిఫిక్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్) ప్రపంచ విజ్ఞాన సమితి

డబ్ల్యు. హెచ్. ఒ—(వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్) ప్రపంచ ఆరోగ్య సంఘం.

ఐ. ఎం ఎఫ్—(ఇంటర్నేనల్ష మానిటరీ ఫండ్) అంతర్జాతీయ ద్రవ్యనిధి.

బ్యాంక్—అంతర్జాతీయ పునర్నిర్మాణ అభివృద్ధి కార్యక్రమాల బ్యాంకు.

**ఐ. ఎఫ్. సి**—(ఇంటర్నేషనల్ ఫైనాన్స్ కార్పొరేషన్) అంతర్జాతీయ ఆర్థిక సహాయ సంస్థ.

**ఐ. సి. ఎ. ఓ**—(ఇంటర్నేషనల్ సివిల్ ఏవియేషన్ ఆర్గనైజేషన్) అంతర్జాతీయ పౌర విమాన సంఘం.

**యు. పి. యు**—(యూనివర్సల్ పోస్టల్ యూనియన్) ప్రపంచ తపాలా సంఘం.

**ఐ. టి. యు**—(ఇంటర్నేషనల్ టెలికమ్యూనికేషన్ యూనియన్) అంతర్జాతీయ తంతి సమాచార సంఘం.

**డబ్ల్యు. ఎం. ఒ**—(వరల్డ్ మెటియరోలాజికల్ ఆర్గనైజేషన్) ప్రపంచ వాతావరణ పరిశోధక సంఘం

**ఐ. ఎం. సి. ఒ**—(ఇంటర్ గవర్న్మెంటల్ మారిటైమ్ కన్సల్టేటివ్ ఆర్గనైజేషన్) అంతర ప్రభుత్వ సముద్ర వ్యవహారాల సంప్రతింపుల సంఘం.

# 11

# రోదసీ యుగావతరణ

మొట్టమొదటి అమెరికన్ రోదసీ యాత్రికుడు జాన్ హెచ్. గ్లెన్ 1962 ఫిబ్రవరిలో రోదసీలో భూమిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసిన కథ అందరికీ తెలిసినదే. అయితే, అతడు చేసిన మరొక పని అంతగా అందరికీ తెలియదు. ఈ చివరి అధ్యాయంలో దానిని గురించి చెప్పుకోవడం అవసరం.

కర్నల్ గ్లెన్ 1962 మార్చి నెలలో, సమితి ప్రధాన కార్యాలయాన్ని సందర్శించాడు. సమితి ప్రముఖులలో ఒకరైన డాక్టర్ రాల్ఫ్‌బంచ్ అత డికి స్వాగతం చెప్పారు. ఆ సందర్భంలో గ్లెన్ ప్రపంచానికొక సందేశ మిస్తూ "రోదసిలో నూతన విశేషాల అన్వేషణకు భారీయెత్తున సమిష్టి కృషి అవసరమని చెప్పాడు".

గ్లెన్ తన సందేశంలో ఇంకా ఇలా పేర్కొన్నాడు:

"మేము పాల్గొంటున్న రోదసీ యాత్రలు కేవలం జాతీయ కృషి కాదు—ఇది అంతర్జాతీయ కృషి కూడా. రోదసీ నౌక గమనాన్ని భూమి

మీదనుంచి ఎప్పటికప్పుడు గమనిస్తూ ఉండడానికి పెక్కు దేశాల సహ కారం అవసరమవుతుంది. అందుచేత, ఇది నిజానికి అంతర్జాతీయ కృషి అనే చెప్పాలి. విస్తృత పరిధిలో చూస్తే. రోదసిలో జరిపే అన్వేషణ కృషి యావత్తూ శాస్త్ర పరిజ్ఞానంమీద, దానికి సంబంధించిన క్రమశిక్షణమీద ఆధారపడి ఉంటుంది. ఈ శాస్త్ర పరిజ్ఞానమంతా ఎన్నో శతాబ్దాల అంతర్జాతీయ కృషివల్లనే లభించింది. రోదసీ విజ్ఞానం, రోదసీ సాంకేతిక జ్ఞానం



అభివృద్ధి చెందినకొద్దీ మన కార్యక్రమాలు మరింత భారీయెత్తున సాగించ వలసి ఉంటుంది. అప్పుడు అంతర్జాతీయ సహకారం మరింత అవసరమవు తుంది సహజంగా అటువంటి సహకారానికి ఐక్యరాజ్యసమితే కేంద్ర మవుతుంది "



గ్లెన్ తన ప్రసంగాన్ని ఇలా ముగించాడు: "మనం ఒకరినుంచి మరొకరం నేర్చుకోవలసినది, మనం అందరం కలిసి ప్రకృతినుంచి నేర్చు కోవలసినది అనంతంగా ఉంది. మనం శాంతియుతంగా, సమిష్టిగా నేర్చు కోగలమనీ,కృషి చేయగలమనీ ఆశించుదాం "

గ్లెన్ సందర్శించిన కొద్ది కాలానికే రష్యా రోదసీ యాత్రికుడు మేజర్ ఘెర్మన్ ఎస్. టిటోవ్ సమితి కార్యాలయాన్ని సందర్శించాడు. అతడు రష్యన్ రోదసీ యాత్రికులలో రెండవవాడు. గ్లెన్‌కంటే ఆరు నెలలు ముందుగా అతడు రోదసిలో భూమి చుట్టూ 17 సార్లు ప్రదక్షిణం చేశాడు. అమెరికా దేశీయుడైన గ్లెన్ ఏమి చెప్పాడో రష్యా దేశీయుడైన టిటోవ్ కూడా దాదాపుగా అదే చెప్పాడు. రోదసీ విజ్ఞానాన్ని అంతర్జాతీయంగా అభివృద్ధి చేయాలనీ, రోదసీ పరిశోధనలను ప్రపంచ శాంతిని సుస్థిరం చేయడానికే వినియోగించాలని అతడు చెప్పాడు.

వీరు రేపటి ప్రపంచానికి రూపురేఖలు దిద్దుతున్న వ్యక్తులు ఇక నుంచి మనం రెండు లక్ష్యాలను మనస్సులో ఉంచుకొనడం అవసరమని స్పష్టమయింది. మొదటిది—రోదసిలో జరిపే ప్రయోగాల విషయంలో ప్రపంచ దేశాల మధ్య పోటీకి బదులు సహకారాన్ని పాదుకొల్పాలి. రెండవది—రోదసిని యుద్ధానికి కాక శాంతికి నెలవుగా చేయాలి. రోదసీ పరిశోధనలలో శాస్త్రజ్ఞులు, రాజకీయవేత్తలు, "ప్రజలమైన మనం" భాగం పంచుకోవాలి.

## మానవజాతి దూతలు

ఈ సూత్రాలను 'వాస్తవాలు'గా మార్చడానికి ఐక్యరాజ్యసమితి కంకణం కట్టుకుని కృషి చేస్తున్నది. 1961 లో జరిగిన సర్వ ప్రతినిధిసభ సమావేశం—రోదసికి సంబంధించిన ప్రపంచ వ్యాప్తమైన ఒప్పందాలను కుదర్చడానికి—పథకం తయారు చేయడం ప్రారంభించింది. రోదసికోసం సరికొత్త "న్యాయ సూత్రాల"ను రూపొందించే ప్రయత్నం కూడా అప్పుడే ప్రారంభమయింది. రోదసీ స్వాతంత్ర్యంపై పెక్కు న్యాయ సూత్రాలను సర్వ ప్రతినిధి సభ ప్రపంచ దేశాలకు సిఫార్సు చేసింది. ఐక్యరాజ్యసమితి

నియమావళితో సహా 'అంతర్జాతీయ న్యాయం' యావత్తూ రోదసికి కూడా వర్తిస్తుందని ప్రకటించింది. "రోదసీ న్యాయ" చరిత్రలో సర్వ ప్రతినిధిసభ తీర్మానం ఒక ప్రధాన ఘట్టం కాగలదు.



1963 లో జరిగిన సర్వ ప్రతినిధిసభ రోదశిలో విధ్వంసక అస్త్రాలను ప్రయోగించరాదని అన్ని దేశాలకు విజ్ఞప్తి చేసింది. ఆ సమావేశానికి 110 దేశాలు హాజరయినాయి. అన్ని దేశాలూ ఆ తీర్మానాన్ని ఆమోదించాయి. "సాధారణ, సంపూర్ణ నిరాయుధీకరణ గమ్యం దిశగా ఇది మరొక ముందడుగు" అని ఉధాంట్ హర్షం ప్రకటించారు. భూమిపై నిరాయుధీకరణ సమస్యను పరిష్కరించడానికి రోదసిపై అంతర్జాతీయ ఒప్పందాలు తోడ్పడుతున్నాయి.



"రోదసిని కలుషితం చేయకండి!" అని ప్రపంచ దేశాలన్నీ ముక్త కంఠంతో విజ్ఞప్తి చేశాయి. అణ్వస్త్రాలను గానీ, ఇతర విధ్వంసక అస్త్రాలను గానీ రోదసీలోనికి ప్రవేశపెట్టబోమని అమెరికా, రష్యాలు సమితికి వాగ్దానం చేశాయి. సమితి సర్వ ప్రతినిధిసభ అన్ని దేశాలకు రెండు విజ్ఞప్తులు చేసింది: (1) అటువంటి ఆయుధాలతో కూడిన సాధనాలను వేటినీ రోదసిలో ప్రదక్షిణాలు చేయించడం గానీ రోదసిలో అట్టే పెట్టడం గానీ తగదు. (2)ఇటువంటి చర్యలకుసంకల్పించేవారి నెవ్వరినీ ప్రోత్సహించరాదు.

ఇవన్నీ చాలా గొప్ప కట్టుదిట్టాలు. అయితే మరి, రోదసీ యుగం శాంతిని నెలకొల్పగలదనే భావించవచ్చునా? ఇటువంటి షరతులను

సవాల్ చేసేవారు ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. భూమిమీద సాగిస్తున్న ఆయుధాల పోటీని రోదసికి కూడా విస్తరింపచేయాలని కొన్ని దేశాలలో కొందరు ప్రజలు వారి ప్రభుత్వాలను ఒత్తిడి చేస్తున్నారు—"ఎందుకు చేయకూడదు?" అని వారు దబాయించి అడుగుతున్నారు. "ఎప్పటి కప్పుడు మనం నూతనాయుధాలను—మరింత శక్తిమంతమైన అస్త్రాలనూ తయారు చేసుకోవలసిందే. లేకుంటే మనకు రక్షణ ఉండదు. అణ్వస్త్రాలను నిర్దిష్ట లక్ష్యాలమీదికి గురిచూసి ప్రయోగించగల రాకెట్లు మనకు ఉన్నాయి. ఇవి రోదసిలోనికి కూడా అమిత వేగంతో దూసుకుపోగలవు. అటువంటప్పుడు ఈ అణ్వస్త్రాలను రోదసిలోని ప్రయోగ కేంద్రాలనుంచి శత్రు దేశాలమీదికి ప్రయోగించే ఏర్పాట్లు ఎందుకు చేయకూడదు? లేకుంటే కనీసం శత్రు దేశంపై 'నిఘా'వేసి ఉండేందుకు రోదసిలో కొన్ని సాధనాలను ఉంచవచ్చును కదా?"—ఇదీ వారు చెప్పేది.

కాని, సమితి మాత్రం "ససేమిరా వల్ల కాదు" అన్నది. రోదసిని యుద్ధోన్మాదులకు అందనివ్వరాదు; అది అందరూ కలిసి సఖ్యంగా కృషి చేయవలసిన క్షేత్రం—కాకుంటే భూగోళం బూడిదగా మారిపోతుంది.

"రోదసీ యాత్రికులు 'మానవజాతి దూతలు'. విపత్కర పరిస్థితిలో వారికి అన్ని దేశాలూ సాధ్యమైన సహాయం యావత్తూ అందజేయాలి" అని 1963 లో సర్వప్రతినిధిసభ మరొక ఒప్పందంలో ప్రకటించింది. ఆ ఒప్పందలో కూడా ఏకగ్రీవామోదం పొందింది. రోదసి నించి భూమికి తిరిగి వచ్చిన రోదసీ నౌక ఏ దేశపు హద్దులలో దిగినప్పటికీ దానిని, దానిలోని పరికరాలను, మనుష్యులను భద్రంగా వారి స్వదేశానికి అప్పగించాలనే షరతు కూడా ఒప్పందంలో ఉన్నది.

"అంతరంక్షంలో అన్ని గోళాలను, అన్ని దేశాలూ స్వేచ్ఛగా, సమానంగా, అంతర్జాతీయ న్యాయానికి అనుగుణంగా ఉపయోగించుకోవచ్చును" ఇది మరొక షరతు.



ఇంకొక ఒప్పందం ఇలా పేర్కొన్నది: "రోదసిలో తాను సాగించే కార్యకలాపాలు ఇతర దేశాలకు హాని కలిగించవచ్చునని ఏ దేశమైనా భావించేటట్లయితే, అటువంటి కార్యకలాపాలను ప్రారంభించే ముందు ఆ యా దేశాలతో సంప్రతించవలసి ఉన్నది".

అన్నిటికంటే ముఖ్యమైన అంశం ఏమిటంటే, రోదసిపైన గానీ, ఇతర గ్రహాలమీద గానీ ఏ దేశానికి "యాజమాన్యం" ఉండదు. అవి ఎవరి సొత్తు కాదు.

ఈ షరతులన్నీ ఎందుకంటే, ఆఫ్రికా, ఆసియా, దక్షిణ అమెరికా ఖండాలను దురాక్రమణ చేసి పంచుకున్నట్లుగా, ముందు ముందు రోదసీ పరిశోధనలు అభివృద్ధి చెందినప్పుడు చంద్రమండలాన్నీ, ఇతర గ్రహాలను

హక్కు భుక్తం చేసుకోకుండా జాగ్రత్త పడేందుకే. 'జాతీయ' పతాకాలు భూమిమీద ఎగురవేయడానికే గానీ అంతరిక్షంలో ఎగురవేయడానికి కాదు. నిజంగానే, నూతన యుగం అవతరించింది!

## వరుణ సామ్రాజ్యం, అంటార్కిటికా

అదృష్టవశాత్తూ, భూమిమీదనే ఇంకా ఏ ఒక్క దేశపు అధికారం క్రిందలేని విశాల ప్రాంతాలు చాలా ఉన్నాయి. సముద్రాలు ప్రపంచమంతటికీ చెందినవి. భూగోళంలో నాలుగింట మూడు వంతులు ఈ సముద్రాలు ఆక్రమించాయి. వాటిపై అధికారం చెలాయించే హక్కు ఏ ఒక్క దేశానికీ లేదు. అయితే, గాఢ యుద్ధాలు జరిగినప్పుడు ఆకాశంలో, భూమిమీద, సముద్రంమీద కూడా శత్రువును నిర్జించడానికి అన్ని రకాల ప్రయత్నాలు జరిగాయి. కాని, అప్పటికీ ఇప్పటికీ కూడా వాస్తవం ఏమిటంటే సముద్రాలు మానవజాతి అంతటికీ చెందినవి.

"ఐక్యరాజ్యసమితి అధికారాన్ని సముద్రాలకు ఎందుకు విస్తరింపచేయకూడదు?" అనే ప్రశ్న మధ్య మధ్య కొందరు అడుగుతూనే ఉన్నారు. ఒకప్పుడు దేశాల మధ్య సంబంధాలకు ప్రధాన సాధనాలుగా ఉండిన మహా సముద్రాలు, ఇప్పుడు విజ్ఞానశాస్త్ర పరిశోధనలకు విశేషంగా ఉపయోగపడుతున్నాయి. వాటి ప్రాముఖ్యం అంతకంతకు పెరుగుతున్నది. ఆధునిక యంత్ర సాధనాలు సముద్రాల అట్టడుగు భాగానికి వెళ్ళి పరిశోధనలు సాగించగలుగుతున్నాయి. సముద్ర గర్భ పరిశోధన కార్యక్రమాలలో అంతర్జాతీయ సహకారాన్ని ప్రోత్సహించడానికి, తద్వారా సముద్ర విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి తోడ్పడడానికి 1961 లో ప్రపంచ విజ్ఞాన సమితి (యునెస్కో) ఒక సంఘాన్ని నియమించింది. ఇటువంటి కార్యక్రమాలలో హిందూ మహా సముద్ర పరిశోధన ఒకటి. ఇది ఐదు సంవత్సరాల




కార్యక్రమం. మిగతా మహా సముద్రాల కంటే దీనిని గురించి ప్రపంచానికి
చాలా కొద్దిగా తెలుసు. ఈ కార్యక్రమంలో 20 పరిశోధక నౌకలు పాల్గొం

టున్నాయి. ఈ మహా సముద్రం అట్టడుగున ఎన్నో విలువైన ఖనిజాలు, జీవ సంపద ఉన్నాయి. ఇవి అన్నీ మానవజాతి సొంత ఆస్తి. ఈ ఆస్తిని అందరం కలిసి అనుభవించ వచ్చును కదా!

1958 లో, ఐక్యరాజ్యసమితి జెనీవాలో సముద్ర న్యాయ మహా సభను నిర్వహించింది. సముద్రాల అడుగున ఉన్న సంపదలను వినియోగించుకునే విషయాన్ని ఈ మహాసభ చర్చించింది. కాని, ఈ అంతర్జాతీయ సంకల్పానికి మళ్ళీ 'జాతీయత' అడ్డు తగిలింది. ఏమైనప్పటికీ, మహాసభ ఒక కట్టుబాటు మాత్రం చేయగలిగింది. జాతీయ ప్రభుత్వాలు అంతవరకూ చేస్తున్నట్లుగా—సముద్రాలలోని కొన్ని ప్రాంతాలలో ప్రమాదకరమైన అణు ధార్మిక పదార్థాలను ముంచడం గానీ, సముద్ర ఉపరితలాన్ని విష కలుషితం చేయడం గానీ కూడదని ఆంక్ష విధించ గలిగింది.

"వారుణ ప్రణాళిక" (నెప్ట్యూనో) అనే ఒక కొత్తరకం ప్రణాళిక సూచించబడింది. అందే పురాణాలలో వర్ణించిన 'వరుణ సామ్రాజ్యా'న్ని సమితి అదుపులోకి తీసుకురావాలని ఆ ప్రణాళిక ఉద్దేశం. (సముద్రాలకు అధిదేవత నెప్ట్యూన్ (Neptune) అనీ, సముద్రాలే అతడి సామ్రాజ్య మనీ పాశ్చాత్య పురాణాలే పేర్కొన్నాయి.) వ్యవసాయానికి ఎంతమాత్రం పనికిరాని విశాలమైన ఎడారులెన్నో ప్రపంచంలో ఉన్నాయి. వాటిని సార వంతం చేయగల ఎరువులు ఎంతో అవసరం. అటువంటి ఎరువు సముద్రం అడుగున పుష్కలంగా లభిస్తుంది. ఇంతవరకు ఆ ఎరువును వెలికితీసే ప్రయత్నం ఎవ్వరూ చేయలేదు. అటువంటివే విలువైన పదార్థాలు—ఇంతకు ముందు ఎవ్వరూ ముట్టుకోనివి—ఎన్నో సముద్రం అడుగున ఉన్నాయి. ఆధునిక యంత్రాల సాయంతో ఆ సంపదను బయటకు తెచ్చే రోజు రావచ్చు. (ఇంతవరకు ఆ సంపద ఏ ఒక్క దేశానికి చెందినది కాదు.)

కాని, అంతకంటే ముందు అత్యవసరంగా, వెంటనే చూడవలసి నది దక్షిణ ధ్రువం సంగతి. సాహసికులైన అన్వేషకులు ఎన్నో సంవత్సరాల క్రితమే ఆ దుర్గమ హిమ మండలాన్ని అధిగమించారు. అంతు పట్టని ధ్రువ మండల రహస్యాలను తెలుసుకోవడంకోసం బ్రిటిష్‌వారు, అమెరికావారు, ఆస్ట్రేలియావారు, స్వీడన్‌వారు, ఇంకా ఎన్నో దేశాల శాస్త్రజ్ఞులు అంటార్కిటిక్ అంచుల వరకు వెళ్లి అక్కడ స్థావరాలు నెల కొల్పారు.

దక్షిణ ధ్రువ మండల పరిశోధన 1773 లో జేమ్స్‌కుక్‌తో ప్రారంభ మయింది. అతడు బ్రిటిష్ నావికుడు. అంటార్కిటిక్ వలయాన్ని దాటి, భూగోళపు అతి దక్షిణ అంశాలను గుర్తించిన మొట్టమొదటి వ్యక్తి అతడే. అంటార్కిటికాని (లేక అంటార్కిటిక్ మండలము)ను చూసిన మొట్టమొదటి వ్యక్తి రష్యన్ అన్వేషకుడు ఫాబియన్ బెల్లింగ్షాసెన్. 1820 లో అతడు ఆ ప్రాంతాన్ని చేరాడు. 1819, 1821 సంవత్సరాల మధ్య అతడు అంటార్కిటిక్ చుట్టూ సముద్రంలో ప్రదక్షిణం చేశాడు. తర్వాత 1840 లో ఫ్రాన్స్‌కు చెందిన జూల్స్‌డ్యుమాంట్ డి ఉర్విల్ మొట్ట మొదటిసారిగా అంటార్కిటిక్ మండలంపై కాలు పెట్టాడు.

ఆ విధంగా, ఇక్కడ మళ్ళీ అంతర్జాతీయ సహకారం కథలోకి వచ్చింది. బ్రిటిష్ పరిశోధక బృందం నాయకుడు జేమ్స్‌క్లార్క్‌రాస్ 500 మైళ్ళ వైశాల్యంగల విక్టోరియా లాండ్‌ను, 500 మైళ్ళ వైశాల్యంగల హిమ ఖండాన్ని కనిపెట్టాడు. (ఈ ప్రదేశం ఇప్పుడు ఆయన పేరిట రాస్ హిమఖండం అని పిలువబడుతున్నది.) అంటార్కిటిక్ వలయానికి దక్షిణాన పూర్తిగా ఒక శీతాకాలమంతా గడిపిని మొట్టమొదటి వ్యక్తి బెల్జియం దేశీయుడు ఆడ్రియన్ డి గెర్లాచి. 1901 లో, ఎరిక్ వాన్‌డ్రైగాల్‌స్కీ నాయకత్వాన ఒక జర్మన్ పరిశోధక బృందం శాస్త్ర పరిశోధనలకోసం ప్రత్యేకంగా నిర్మించిన నౌకలో అంటార్కిటికాకు వెళ్లింది. 1903 లో

స్వీడన్ తాలూకు పరిశోధక బృందం ఒకటి అంటార్కిటిక్ ప్రాంతానికి వెళ్ళగా, అక్కడ వారి నౌక మంచులో కూరుకు పోయింది. ఆర్జెంటీనా నౌకాదళ అధికారి జూలియన్ ఇరిజార్ అక్కడకు వెళ్లి స్వీడిష్ బృందాన్ని కాపాడాడు.

1907, 1909 సంవత్సరాల మధ్య కాలంలో, ఎర్నెస్ట్ షాకిల్టన్ నాయకత్వాన బ్రిటిష్ పరిశోధక బృందం ఒకటి దక్షిణ ధ్రువానికి 97 మైళ్ళ దూరం వరకు వెళ్ళి, దక్షిణ అయస్కాంత ధ్రువాన్ని చేరింది. 1911 లో నార్వేకు చెందిన రోవాల్డు ఆముండ్సెన్ తన బృందంతో కలిసి దక్షిణ ధ్రువాన్ని చేరాడు. దక్షిణ ధ్రువాన్ని చేరిన మొదటి బృందం అదే. తర్వాత మరొక నెలకే బ్రిటన్‌కు చెందిన రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ ధ్రువాన్ని చేరుకున్నాడు. అంటార్కిటిక పరిశోధనలో ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టినవారిలో ప్రముఖుడు అమెరికా దేశీయుడు అడ్మిరల్ రిచర్డ్ బర్డ్. 1928, 1941 సంవత్సరాల మధ్యకాలంలో అతడు ఈ పరిశోధనలకు విమానాలను, యాంత్రిక శకటాలను ప్రవేశపెట్టాడు. ఇలా, ఇంకా ఎందరో ఈ పరిశోధనలు సాగించారు, సాగిస్తున్నారు.

1957-58 సంవత్సరాన్ని అంతర్జాతీయ భూభౌతిక పరిశోధనల సంవత్సరంగా పరిగణించి, సమితిలోని పెక్కు సభ్యదేశాలు వాతావరణ పరిశోధనకు సంబంధించిన వివిధ కార్యక్రమాలను నిర్వహించాయి. వాటి ఘనవిజయాన్ని పురస్కరించుకుని సమితి 1960 లో అంటార్కిటిక్ పరిశోధన కార్యక్రమం తలపెట్టింది. ఆ సందర్భంలోనే 12 దేశాలు అంటార్కిటికా ఒప్పందం కుదుర్చుకున్నాయి విజ్ఞానశాస్త్రపరంగా విశేష ప్రాముఖ్యం గల ఈ అంటార్కిటిక్ పరిశోధన కార్యక్రమాన్ని-సమితి సభ్య దేశాలన్నింటి మద్దతుతో-ఆ విధంగా అంతర్జాతీయ పరిధిలోనికి తీసుకు రావడం జరిగింది.

ఈ ఒప్పందంలోని ఉద్దేశం ఏమిటి? 'అంతర్జాతీయ భూభౌతిక పరిశోధనల సంవత్సరం'లో మొత్తం అంటార్కిటిక్ అంతా శాస్త్ర పరిశోధనల ప్రయోగశాలగా మారిపోయింది. తర్వాత, 12 దేశాలు కుదుర్చుకున్న ఒప్పందం క్రింద అది అనేక రంగాలలో అంతర్జాతీయ సహకారానికి ప్రయోగశాలగా మారింది. ఆ ప్రయోగశాలలో శాస్త్రజ్ఞులు, పరిశీలకులు తమ తమ ప్రభుత్వాల ప్రతినిధులుగా కాక, అంతర్జాతీయ ప్రవీణులుగా కలిసి కృషి చేస్తున్నారు. ఈ ప్రయోగం ఆయా దేశాల రాజకీయ నాయకులకు కూడా ఒక విధంగా సాయపడుతున్నది. చంద్రమండలం మీద, రోదసిలోనూ హక్కులను ఎలా పంచుకోవాలన్న సమస్య పరిష్కారానికి అది ఒక దారి చూపింది.

అంటార్కిటిక్ మండలం రాకెట్ ప్రయోగ కేంద్రాలకు, అణ్వస్త్ర విక్షేపాలకు నిలయమవుతుందేమోనన్న భయాన్ని ఈ ఒప్పందం పోగొట్టింది. "సమస్త మానవజాతి శ్రేయస్సు దృష్ట్యా అంటార్కిటిక్ మండలాన్ని ఇక ముందు కూడా కేవలం శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే ఉపయోగించుకోవాలి. అది అంతర్జాతీయ స్పర్ధలకు, విరోధాలకు నిలయం కారాదు. ఈ అభిప్రాయమే ఒప్పందానికి ప్రాతిపదిక" అని ఒప్పందంలోని ఉపోద్ఘాతంలో పేర్కొన్నారు.

కనీసం 30 సంవత్సరాల వరకు అంటార్కిటిక్ మండలంపై ఏ ఒక్క దేశమూ అధికారాన్ని స్థాపించరాదని 12 దేశాలూ అంగీకరించాయి. ఈ ఒప్పందానికి పూర్వమే కొన్ని దేశాలు అంటార్కిటిక్ మండలంలోని కొన్ని ప్రాంతాలను తమ అధీనంలోకి తెచ్చుకున్నాయి. వాటిపై తమ అధికారాన్ని వదులుకునేందుకు అవి ఇష్టపడటం లేదు. అయితే, ఒప్పందం అమలులో ఉన్నంతకాలం కొత్తగా ఏ దేశమూ అక్కడ తమ అధికారాన్ని ప్రకటించదని ఆశించవచ్చు.

అంటార్కిటిక్ మండలంలో శాస్త్రపరిశోధనలకు అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించడం ఈ ఒప్పందంలోని ప్రధానోద్దేశం. ఈ ఒప్పందం క్రింద అంటార్కిటికాలో అణ్వస్త్ర పరీక్షలను నిషేధించడం జరిగింది. ఈ నిషేధం సరిగా అమలు జరుగుతున్నదా లేదా అని ఎప్పటికప్పుడు పరిశీలన జరుపుతూ ఉంటారు. అణుధార్మిక పదార్థాలను నిక్షేపించడంకూడా నిషేధించారు.

అంటార్కిటికా కార్యక్రమాన్ని ఆక్షేపించిన వారుకూడా లేకపోలేదు. మొదట్లో కొన్ని దేశాల రాజకీయనాయకులు ఆక్షేపణ లేవదీశారు. అయితే వారిమాటలు చెల్లలేదు. అంటార్కిటికాపై జరిగిన సాంకేతిక సమావేశాలన్నీ అత్యంత స్నేహపూరిత వాతావరణంలో, పరస్పర సదవగాహనతో జరిగాయి. శాస్త్ర పరిశోధనలలో రాజకీయ, సైనిక విషయాల ప్రసక్తి తీసుకురాబోమని ప్రభుత్వాలు అంగీకరించాయి.

"శాస్త్రపరిశోధనకు రక్షణ కల్పించడానికి రూపొందించిన మొట్టమొదటి ఒప్పందం ఇది. ప్రభుత్వ ప్రసక్తి లేకుండా, తన కార్యక్రమాన్ని తానే నిర్ణయించుకోడానికి పూర్తి అధికారం ఇవ్వబడిన సంస్థ కూడా ఇదే. విజ్ఞాన శాస్త్రానికి, ప్రభుత్వాలకు మధ్య సంబంధాలను సమన్వయ పరచడానికి ఇది చక్కని విధానం. మానవునికి లొంగకుండా బిగదీసుకుని ఉన్న ఒక భూమండలం శాంతి సాధనకు ఇంతగా తోడ్పడటం ఎంత విచిత్రం!" అని అంటార్కిటికా శాస్త్రపరిశోధక సంఘం అధ్యక్షుడు జార్జెస్ లాక్లెవెర్ అన్నారు.

## సౌర పరిశోధన

అంతర్జాతీయ భూభౌతిక పరిశోధన కార్యక్రమ విజయాన్ని పురస్కరించుకుని ప్రారంభించిన మరొక కార్యక్రమం అంతర్జాతీయ సౌర పరి



శోధన కార్యక్రమం. ఇది రెండు సంవత్సరాల (1964-1965) కార్యక్రమం. పెక్కు దేశాల ఖగోళ శాస్త్రజ్ఞులు పాల్గొన్న ఈ కార్యక్రమంలోని అంశాలు ఇవి. ఆర్క్టిటిక్ మండలం మొదలుకొని అంటార్క్టిటిక్ మండలం వరకు భూగోళం మీద వివిధ ప్రదేశాలలో వరసగా నెలకొల్పిన స్థావరాల నుంచి శాస్త్రపరికరాలతో కూడిన రాకెట్లను భూమి వాతావరణపు అంచుల వరకు పంపడం; వాతావరణ పరిశోధనకు ఉపయోగించే గాలి గుమ్మటాలను భూమి ఉపరితలం నుంచి పది పన్నెండు మైళ్ళ ఎత్తు వరకు ఆకాశంలోకి పంపించడం; విజ్ఞానశాస్త్ర సమాచార సేకరణకై రోదసి లోనికి ఉపగ్రహాలను, రోదసీ నౌకలను, ఇతర పరిశోధక సాధనాలను పంపడం.

ఈ కార్యక్రమానికి ప్రత్యేకంగా ఈ రెండు సంవత్సరాలను ఎందుకు ఎంచుకున్నారంటే— ఈసంవత్సరాలలో సూర్యమండలం 'ప్రశాంతం'గా ఉంటుంది. సూర్యునిపై మచ్చలు ఉండవు; జ్వాలా ఉద్ధృతం ఉండదు. (సౌర చక్రం సుమారు 11 సంవత్సరాలు. అంటే—ఒక ఉచ్ఛ బిందువు నుంచి తిరిగి అదే బిందువును చేరుకోడానికి సూర్యునికి పట్టే కాలం.)

సూర్యుని ధార్మికతయే భూమి మీది ప్రాణుల మనుగడకు ఆధార మని అందరికీ తెలుసు. కాని భూమిపైన, గ్రహాంతరాంతరాళం పైన సూర్యమండలంలోని సంఘటనల ప్రభావం ఎలా ఉంటుందో పూర్తిగా నిర్ధారణ చేయడం జరిగలేదు. అందుచేత, భూభౌతిక పరిశోధన సంవత్స రంలో—సూర్యుని ధార్మికత గరిష్ఠ స్థాయిలో ఉన్నప్పుడు-సేకరించిన సమా చారానికి, ఆ తర్వాత సూర్యుడు శాంతించినప్పుడు సేకరించే సమాచారా నికి ఎంత తేడా ఉంటుందో బేరీజు వేయడం ఈ సౌరపరిశోధన లక్ష్యం. ఈ పరిశోధనలో సహకరించడానికి 64 దేశాలు అంగీకరించాయి. వేర్వేరు స్థితులలో సూర్యుడు ప్రదర్శించే వేర్వేరు స్వభావాలను పరిశోధించి, పోల్చి చూడడం ద్వారా సూర్యమండల సమగ్ర స్వరూపాన్ని చిత్రించగలమని శాస్త్రజ్ఞులు భావించారు.

## అణుశక్తి

ఐక్యరాజ్య సమితి విశాల ఛత్రచ్ఛాయలో నూతన వైజ్ఞానిక మైత్రి వర్ధిల్లుతున్నది; సమస్త రంగాలలో అంతర్జాతీయ సహకారం శీఘ్రగతిని ప్రవృద్ధ మవుతూంది.

ముఖ్యంగా అణుశక్తి అభివృద్ధి విషయంలో ఇది ఎంతైనా నిజం మొదటినుంచి కూడా అణుశక్తిని 'శుద్ధ శాస్త్రం' (ప్యూర్ సైన్స్) గా ఎవరూ పరిగణించలేదు. మానవ జీవన వ్యవహారాలపై దీని ప్రభావం



విశేషంగా ఉంది. అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు ఉపయోగించు
కొనే విషయంలో ఐక్యరాజ్య సమితికి చెందిన అంతర్జాతీయ అణుశక్తి
సంస్థ కృషి చేస్తున్నది.

వెనుకబడిన ప్రాంతాలని చెప్పబడుతున్నవాటిలో దరిద్ర జీవితం
సాగిస్తున్న లక్షలాది ప్రజలను ఉద్ధరించడం అణుశక్తి శాంతి ప్రయోజనా
లలో ఒకటి. విద్యుచ్ఛక్తిని మరింత చౌకగా, అధికంగా ఉత్పత్తి
చేయడం ఎలాగన్నది అన్నిచోట్ల ఎదురవుతున్న సమస్య. "అణుసంయోగ
శక్తి" దీనికి తగిన పరిష్కారం చూపగలదు. అంటే - హైడ్రోజన్
బాంబుకు గల అమోఘ శక్తిని నిత్యజీవితంలో ఉపయోగానికి తీసుకు
రావడం అన్న మాటే.

అణుశక్తి శాంతి ప్రయోజనాలపై 1955 లో ఐక్యరాజ్య సమితి జెనీవాలో ఒక మహాసభను నిర్వహించింది. భారతదేశానికి చెందిన హోమీ జె. భాభా దానికి అధ్యక్షత వహించారు. 'అణుసంయోగంవల్ల జనించే భయంకర శక్తిని వ్యాపారరీత్యా లాభసాటిగా ఉండేటట్లు అదుపులోకి తీసుకు రావడం సాధ్యం కాదనుకోవడం పొరపాటు' అని ఆయన అన్నారు. అయితే, అట్టి శక్తిని ఉత్పత్తి చేయడానికి సూర్యమండలంలో ఉన్నంత వేడి అవసరమవుతుందనీ. అంత వేడిని పుట్టించడానికి హిరోషిమా, నాగసాకీలపై వేసిన ఆటంబాంబులతో సమానమైన ప్రేలుడు శక్తి అవసరమనీ ఆయన చెప్పారు అంతటి భయంకర శక్తిని అదుపులో పెట్టడం సాధ్యమేననీ, అందుకు అట్టే ఎక్కువ సంవత్సరాలు పట్టదనీ డాక్టర్ భాభా తన విశ్వాసాన్ని ప్రకటించారు. ప్రపంచ అణుభౌతిక శాస్త్రవేత్తలలో ఆయన ఒకరు.

ఆయన చెప్పినట్లు, ఆ శక్తిని అదుపులోకి తీసుకురాగలిగితే విద్యుచ్ఛక్తి సమస్య తీరిపోయినట్లే. అప్పుడు ఇక విద్యుచ్ఛక్తిని నేరుగా అణుసంయోగ శక్తిని ఉత్పత్తి చేసే "ఇంజను" నుంచి రాబట్టుకోవడం సాధ్యమవుతుంది. అలాగే "అణువిచ్ఛేద శక్తి" ని కూడా ఉపయోగించుకొనవచ్చును. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో టర్బైనులను నడిపేందుకు అవసరమైన ఆవిరిని లేదా వాయువులను వేడి చేయడానికి అణువిచ్ఛేద శక్తిని ఉత్పత్తి చేసే రియాక్టర్లను ఉపయోగించవచ్చును. మామూలు ఇంధనాలు ఏవీ ఇవ్వలేనంతటి విపరీతమైన వేడిని ఈ రియాక్టర్లు ఇవ్వగలవు.

భారత దేశంలోని 40 కోట్ల పైగా ప్రజల జీవన ప్రమాణాలను వృద్ధి చేయడానికి యురేనియం రియాక్టర్లు విశేషంగా తోడ్పడగలవని డాక్టర్ భాభా సూచించారు. ఆయన ఇంకా ఇలా వివరించారు. "న్యూఢిల్లీ నగరంలోని దీపాలకు, రవాణాకు, కర్మాగారాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

చేయాలంటే 1,40,000 కిలోవాట్ల ఉత్పాదక శక్తి గల విద్యుత్ కేంద్రం అవసరం. ఇటువంటి కేంద్రాన్ని నిర్వహించడానికి రోజుకు రెండు వేల టన్నుల బొగ్గు అవసర మవుతుంది. బొగ్గు గనులను నిర్వహించడానికి, గనుల నుంచి అవసరమైన చోటికి రవాణా చేయడానికి విపరీతంగా డబ్బు ఖర్చవుతుంది. ఉదాహరణకు-ఢిల్లీలోని విద్యుత్ కేంద్రానికి బొగ్గు చేరవేయ డానికి 1700 లారీలు, 30 రైలు ఇంజనులు అవసరమవుతాయి. ఇలా బొగ్గును చేరవేయడానికి అయ్యే ఖర్చు కంటే అణు విద్యుదుత్పత్తి కేంద్రానికి అయ్యే ఖర్చు తక్కువే అవుతుంది. అణువిద్యుత్ ఇంధనానికి రవాణా సమస్య ఉండదు. భారతదేశంలో యురేనియం, అణుశక్తి ఉత్ప త్తికి అవసరమైన ఇతర ముడిపదార్థ[illegible] సమృద్ధి [illegible] [illegible]. [illegible] రంగంలో అభివృద్ధి సాధిస్తే భారతదేశం దారిద్ర్యాన్ని ఎంత శీఘ్రంగా జయించగలదో ఊహించుకోవచ్చు."

## పెరుగుతున్న వ్యత్యాసాలు

భారతదేశం ఉన్న పరిస్థితిలోనే ప్రపంచంలో ఇంకా వర్ధమాన దేశాలు ఉన్నాయి. కాని, అణుశక్తిని అదుపులోకి తీసుకునేవచ్చే బృహత్ కార్యం ఇంకా జరగలేదు. అణువు యొక్క అపరిమిత శక్తి భూమిమీద కోట్లాది ప్రజలను ఉద్ధరించే రోజు వస్తుందనే ఆశ ఉన్నప్పటికీ, ప్రస్తుతం మాత్రం ధనిక దేశాలకు, పేద దేశాలకు మధ్య అంతరం అంతకంతకు పెరిగిపోతున్నది. జనాభా పెరుగుతున్న నిష్పత్తినిబట్టి చూస్తే, ఇంకొక 20 సంవత్సరాలకు ప్రపంచ జనాభా 400 కోట్లు అవుతుంది. అందుచేత అణుశక్తి అదుపులోకి వచ్చేవరకు మనం ఎదురు చూస్తూ కూర్చోవడం వీలు కాదు

ఎందుచేతనంటే, యూరప్, ఉత్తర అమెరికాల ప్రజలు మరింత ధనవంతులు విద్యావంతులు అవుతూ ఉండగా, ఇతర ప్రపంచంలో



దారిద్ర్యం, అజ్ఞానం పెరుగుతున్నాయి. ప్రపంచంలో మూడింట రెండు వంతుల దేశాలు—అంటే నాలుగింట మూడువంతుల ప్రజలు—ఇంకా వెనక బడే ఉన్నారు. మనం వెనక పేజీలలో చెప్పుకున్నట్లు విజ్ఞాన శాస్త్రం అంతగా అభివృద్ధి చెందినప్పటికీ అధిక సంఖ్యాకుల పరిస్థితి ఇలా ఉన్నది.

కలవారికీ లేనివారికీ మధ్య గల అగాధం పెరిగిపోతున్నది. వెనక బడిన దేశాలు ఎగుమతిచేసే సరకుల ధరలు పడిపోతున్నాయి. అవి దిగుమతి చేసుకుంటున్న సరకుల ధరలు మాత్రం పెరిగి పోతున్నాయి. అందు వల్ల వాటి పేదరికం పెరుగుతున్నది తీవ్రమైన, కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంటే తప్ప, లేకపోతే ధనిక దేశాలకు, పేద దేశాలకు మధ్య ఆర్థిక వ్యత్యాసం మరింత దారుణమైపోతుంది. అది ప్రపంచానికి క్షేమదాయకం కాదు దానివల్ల మనిషికీ మనిషికీ మధ్య ఈర్ష్యాద్వేషాలు చెలరేగుతాయి.

అప్పుడు తూర్పు దేశాలు, పశ్చిమ దేశాలు అనే తేడాలు లేకుండా ఉత్తరాది వారు, దక్షిణాదివారు అనే విభేదాలు తలెత్తుతాయి. సామ్రాజ్య తత్త్వం అంతరించు. సర్వత్రా పేదరికం వ్యాపిస్తుంది

## "అవకాశం గల ప్రపంచం"

ఈ 'వ్యత్యాసం' సమస్యను సకాలంలో పరిష్కరించే ఉద్దేశంతో, 1963 వసంత కాలంలో జెనీవాలో ఒక అసాధారణమైన మహాసభ జరిగింది. అందులో 96 దేశాలు పాల్గొన్నాయి విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలను మానవాభ్యుదయం కోసం ఉపయోగించే విషయమై ఈ మహాసభ చర్చించింది భూగోళంలోని మానవ కుటుంబం తన కుటుంబ వ్యవహారాలు ముచ్చటించుకునేందుకు జరిపిన సమావేశంగా దీనిని వర్ణించారు.

నీరు, నేల, ఖనిజాలు, శక్తి, జనాభా, శీతోష్ణ స్థితి – వీటిలో తనకుగల ప్రకృతిసిద్ధమై వనరులను ప్రతి దేశం అంచనా వేసుకోవాలి. ఇదే మొట్టమొదటి చర్య అని మహాసభకు హాజరైన 1665 మంది ప్రవీణులు, శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడ్డారు ఆ తర్వాత చేయవలసిన పని— ఒక్కొక్క ప్రత్యేక కృషికి ఒక్కొక్క పథకం రూపొందించుకోవడం. ఇందుకోసం అభివృద్ధిచెందిన దేశాల ప్రవీణుల సాహాయ్యం, సలహా పొందాలి. ఇది ప్రపంచం అంతటికీ చెందిన బాధ్యత.

పరిశ్రమలు, రవాణా సౌకర్యాలు, తపాలా సౌకర్యాలతోపాటు వ్యవసాయం, అటవీ సంరక్షణ, మత్స్య పరిశ్రమలు కూడ శీఘ్రంగా అభివృద్ధి చెందాలి. ఆధునిక పరిశ్రమలతో సమానంగా వ్యవసాయం పురోగమించడానికి జాగ్రత్తగా, కట్టుదిట్టమైన ప్రణాళికలు రూపొందించుకోవడం అవసరం. ఉదాహరణకు పంటల రాబడి పెరగాలంటే ముందు రాసాయనిక పు ఎరువులు అవసరం. ప్రతిచోటా మరింత మంచి ఆహారం, ఆరోగ్యం,



జీవన పరిస్థితులు సమకూర్చాలి. వీటి అన్నింటికంటే ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసింది విద్య విషయంలో. ముఖ్యంగా—కొత్త వృత్తులను స్వీకరించే వారికి వాటిలో శిక్షణ ఇవ్వటం అత్యవసరం.

వర్ధమాన దేశాలన్నింటి అభివృద్ధిని దృష్టిలోకి తీసుకుంటే, ఇప్పుడు చెప్పిన ఈ కార్యక్రమాన్ని వంద పెట్టి హెచ్చవేయవలసి వస్తుంది అంత బృహత్తర కార్యం ఇది.

ఇది అతి త్వరగా నిర్వర్తించవలసిన కార్యం కనుకనే, ఐక్యరాజ్య సమితి—విజ్ఞాన శాస్త్రం, విద్య, ఆహారోత్పత్తి, సాంకేతిక సాహాయ్యం



మున్నగు విషయాలలో—తన అనుబంధ సంస్థలను బలపరచవలసిందిగా అభివృద్ధి చెందిన దేశాలకు విజ్ఞప్తి చేసింది కాని, అటువంటి "సాధ్య ప్రపంచం" ఇంకా దూరంగానే ఉంది. (పైన చెప్పిన మహాసభ నివేదికలో మొదటి సంపుటానికి "సాధ్య ప్రపంచం" అని శీర్షిక పెట్టారు.)

## సమితి పతాకచ్ఛాయలో....

ప్రపంచంలో మొత్తం భూమి వైశాల్యం 13,50,00,000 చదరపు మైళ్ళు. ఇందులో పది శాతం భూమి మాత్రమే సాగులో ఉన్నది. వరదల నిరోధం, నీటి పారుదల పథకాలవల్ల, యాంత్రిక వ్యవసాయ పద్ధతులవల్ల మరి 20 శాతం భూమిని సాగులోకి తీసుకురావచ్చును. ఎడాలను సారవంతం చేయడం, ఆర్కిటిక్ భూములను, ఉన్నత ప్రాంతాలలో భూములను వ్యవసాయ యోగ్యం చేయడం కూడా సాధించగలిగితే వ్యవసాయభూమిని ఇంకా విస్తృతం చేయవచ్చును. అలా చేయగలిగిననాడు వెయ్యికోట్ల జనాభాను, లేదా ఇంకా ఎక్కువ జనాభాను పోషించగలం.

కాని, ఈ కృషిని ఎలా ప్రారంభించాలన్నది పెద్ద సమస్య. ముఖ్యం గా—ఇంత డబ్బు ఎక్కడనుంచి తీసుకు వస్తాము అనేది ప్రశ్న. ఇక్కడ డబ్బు అంటే—నిజానికి మనుష్యుల శక్తి, నైపుణ్యం, నిర్వహణ సామర్ధ్యం, యంత్రాలు, పదార్థాలు అనే అర్థం. అంతేగానీ—ధనిక దేశాలనుంచి రొక్కం, బంగారు కడ్డీలు పేద దేశాలకు తరలించడం అని కాదు.

ఇది కొత్త సమస్య ఏమీ కాదు. పూర్వం సామ్రాజ్యాలను నిర్మించినవారు మనుష్యులే. విపణులు ఏర్పరచుకోడానికి, గనులు, తోటలు మొదలయినవి నిర్వహించడానికి అన్వేషకులు, వర్తకులు, ఇంజనీర్లు విదేశాలకు వెళ్ళడం వెనకటి అధ్యాయాలలో చూశాం. చరిత్రలో ఆ శకం ఇక అంతరించింది. ఆర్థికంగా, రాజకీయంగా, సైనికంగా సామ్రాజ్య తత్త్వానికి ఇక భవిష్యత్తు లేదు. కాని, వర్ధమాన దేశాలకు ధనిక దేశాల పెట్టుబడులు చాలా అవసరంగా ఉన్నాయి. అయితే, పెట్టుబడులు పెట్టే ప్రభుత్వాలు గానీ,



ప్రైవేటు సంస్థలు గానీ తమ సాహాయ్యం పొందుతున్న దేశాలపై పెత్త
నం చెలాయించడానికి మాత్రం ప్రయత్నించ కూడదు.

ఈ విషయంలో సమితి కుటుంబానికి ఎంతో ప్రాముఖ్యం ఉన్నది
సాహాయ్యం చేసే దేశాలు మొహమాటం పెట్టడం. పెద్దరికం చెలాయిం
చడం అనే ప్రసక్తి లేకుండా చేస్తుంది సమితి సమితికి చెందిన ప్రవీణులు.
సలహాదారులు ఇతర దేశాల ప్రవీణులతో కలిసి వర్ధమాన దేశాలకు వెళ్లి.
ఆ దేశీయులకు అవసరమైన పనులు చేసిపెడతారు. ఇందులో మొహమాటా
లకు, స్వలాభాపేక్షకు ఆస్కారం ఉండదు. ఇతర దేశాల ప్రభుత్వాలకు.
ఇతర దేశాలలోని సంస్థలకు పని చేసే సాంకేతిక నిపుణులు తాము తమ
యజమానుల బాగుకోసం పని చేయడమే తప్ప. తమ వ్యక్తిత్వానికేమీ
గౌరవం లేదని అసంతృప్తి పొందుతారు. కాని, ధనిక దేశాలపట్ల విముఖత
గల వర్ధమాన దేశాలలో ఈ సాంకేతిక నిపుణులే సమితి ఆధ్వర్యంలో పని
చేయడానికి ఆ విధంగా అసంతృప్తి చెందరు. తమ వ్యక్తిత్వానికి గౌరవం
లభిస్తున్నదనే తృప్తి వారికి ఉంటుంది.

## అస్త్ర సన్యాసం అత్యావశ్యకం

ఆధునిక మారణాయుధాల ఉత్పత్తిని—ముఖ్యంగా అణ్వాయుధాల
ఉత్పత్తిని—అరికట్టకపోతే సౌభాగ్యవంతమైన నూతన ప్రపంచ నిర్మాణానికి
మనం తయారు చేసుకునే ఈ పథకాలన్నీ నిరర్థకమవుతాయి. అణ్వాయు
ధాల ఉత్పత్తికోసం విశేష ధనవ్యయం జరుగుతుంది; ఎందరో మనుష్యుల
ప్రతిభ, శారీరక శక్తి, కాలం వ్యయమవుతాయి. ఇదంతా దుర్వ్యయం

వెనకబడిన దేశాలను అభివృద్ధి చెందిన దేశాల సగటు స్థాయికి తీసుకు
రావాలంటే సుమారుగా సంవత్సరానికి 1,400 కోట్ల డాలర్ల మేరకు కొత్త
పెట్టుబడి నిధులు అవసరమవుతాయి. ఇది చూడడానికి చాలా పెద్దమొత్తంగా



కనిపిస్తుంది పెద్ద మొత్తమే నిజానికి. కాని, ఈ ధనం—అంటే మానవ ప్రతిభ, యంత్రాలు, ముడి పదార్థాలు—ఇప్పుడు దుర్లభం కాదు; ధనం సమృద్ధిగానే ఉంది. నిజానికి, ఇంతకు పదిరెట్ల ధనం 'జాతీయ రక్షణ' కోసం ప్రపంచం ఖర్చు పెడుతున్నట్లు సమితి నిపుణుల పరిశీలనవల్ల తేలింది. ఇంత పెద్ద వ్యయంతో తయారు చేస్తున్న ఆయుధాలు – శాంతి భద్రతలకు బదులు – భయాన్ని, ప్రమాద పరిస్థితిని సృష్టిస్తున్నాయి ఈ దుర్వ్యయాన్ని ఇప్పుడు సామాన్య ప్రజలలో మరింత ఎక్కువమంది గుర్తించ గలుగుతున్నారు

కాబట్టి, ఇప్పుడు మన ఎదుట ఉన్న పెద్ద సమస్య ఏమిటంటే— మన కత్తులను కొడవళ్ళుగా, ఈటెలను నాగలి కర్రలుగా మార్చడం




ఎలాగన్నది. మార్చాలన్న ఇచ్ఛ ఉంటె మార్చడం—చాలామంది అను
కుంటున్నంత కష్టమేమీ కాదు. 1963 ఐక్యరాజ్యసమితి "నిరాయుధీకరణ
వల్ల ఒనగూడే ఆర్థిక, సాంఘిక పర్యవసానాలు" అనే నివేదిక ఏకగ్రీ
వాభిప్రాయంతో తయారు చేసింది. మారణ, విధ్వంసక అస్త్రాలను పున
ర్వికాస, పునర్నిర్మాణ సాధనాలుగా మార్చడానికి కొన్ని సూత్రాలను
అందులో పేర్కొనడం జరిగింది. ఆ సూత్రాలను అమలులో పెట్టవలసిన
పని అగ్రరాజ్యాలదే. మిగతా దేశాలన్నీ ఆ శుభ ముహూర్తంకోసం ఎదురు
చూస్తున్నాయి.

నిరాయుధీకరణ సమస్య సారాంశం ఇదే.

## సాంకేతిక సాహాయ్యం

వెనకబడిన దేశాలని చెప్పబడుతున్నవాటికి సాంకేతిక సాహాయ్యం అందజేయడానికి సమితి ఆర్థిక సాంఘిక వ్యవహారాల మండలి 1947 లోనే కృషి ప్రారంభించింది. 1949 లో, 'సాంకేతిక సాహాయ్య విస్తృత కార్యక్రమం' ప్రారంభమయింది. సమితిలోని పెక్కు సభ్య దేశాల ప్రభుత్వాలు పెట్టుబడి పెట్టాయి. సమితి అనుబంధ సంస్థలు ఈ కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నాయి. వర్ధమాన దేశాలు తమ పరిశ్రమలను, వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకుని, తమ ప్రజల జీవన ప్రమాణాలను వృద్ధి చేసుకోడానికి ఈ 'విస్తృత కార్యక్రమం' సాయపడుతున్నది.



ఏడాదికొకసారి సమితి కార్యాలయంలో 'ప్రదాన మహాసభ' జరుగుతుంది. ఆ సమావేశంలో సభ్య ప్రభుత్వాలు రానున్న సంవత్సరంలో తాము ఎంత ధనం ఇవ్వగలిగేదీ ప్రకటిస్తాయి. మొదటిది పది సంవత్సరాలలో (1950 — 59) ఆ విధంగా వివిధ ప్రభుత్వాలు 26,80,00,000 డాలర్ల ధనం ఇచ్చాయి.

తర్వాత 1957 లో. సమితి సర్వసభ్య ప్రతినిధి సభ సాంకేతిక సహాయానికి ఒక ప్రత్యేక ప్రతినిధిని ఏర్పాటు చేసింది. నీరు, ఖనిజాలు, విద్యుచ్ఛక్తి మొదలయిన వనరులను అంచనా వేయడానికై పెద్దయెత్తున



పరిశీలనలు జరపడానికి ఈ నిధి పెట్టుబడి పెడుతుంది. ఆ తర్వాత, ఆ అంచనాలను ఆధారం చేసుకుని పథకాలు, కార్యక్రమాలు తయారుచేస్తుంది. ఈ నిధిని 106 ప్రభుత్వాలు ధన సాహాయ్యం చేశాయి. ఫలితంగా ఈ నిధి తక్కువ ఆదాయంగల 121 దేశాలలోని 374 ముఖ్య కార్యక్రమాలకు ఉపయోగపడింది. ఇప్పటివరకు ఈ నిధి సాహాయ్య కార్యక్రమాలకు అయిన ఖర్చు మొత్తం 8170 లక్షల డాలర్లు దాటింది. ఇందులో నూటికి నలభై వంతుల ధనం నిధి యిచ్చింది. మిగిలిన అరవై వంతుల ధనాన్ని ఆ యా దేశాలు స్వయంగా సమకూర్చుకున్నాయి.

ఇవి కాక, పునర్నిర్మాణ, అభివృద్ధి కార్యక్రమాల అంతర్జాతీయ బ్యాంకు ఒకటి ఉంది. ఇది కూడా సమితి అనుబంధ సంస్థలలో ఒకటి (దీనినే 'ప్రపంచ బ్యాంకు' అని వ్యవహరిస్తారు.) ఇది ఎక్కువగా రహదారులు, రైలు మార్గాలు, నౌకాశ్రయాలు, విద్యుదుత్పత్తి కేంద్రాలు మొదలైనవాటికి ఋణాలు ఇస్తుంది. 1963 వరకు ప్రపంచ బ్యాంకు 70 దేశాలలోని 800 పైగా కార్యక్రమాలకు సుమారుగా 800 కోట్ల డాలర్ల మేరకు ఋణాలు ఇచ్చింది. ఈ అంకెలు గొప్ప కృషిని సూచిస్తున్నమాట నిజమే గానీ, స్వల్పాదాయ దేశాల అవసరాలతో పోల్చుకుంటే ఈ సాహాయ్యం చంద్రునికి నూలుపోగు వంటిదే అవుతుంది. ప్రజల జీవన ప్రమాణాలను వృద్ధి చేయడానికి వలసిన శక్తిని ఈ దేశాలకు చేకూర్చాలంటే ఆర్థిక సాహాయ్య కార్యక్రమాలను విస్తృతం చేయవలసిన అవసరం ఉన్నది. "ఇది ప్రస్తుత కాలంలో అత్యవసరమైన కార్యం" అని సమితి ప్రధాన కార్యదర్శిచెప్పారు.

## అంతర్జాతీయ సహకారానికి ఆటపట్టు ఆఫ్రికా

ఈ విధమైన అంతర్జాతీయ సహకారం ముమ్మరంగా సాగుతున్న రెండు ప్రాంతాలను ఉదాహరణగా చెప్పుకుందాం: ఒకటి — ఉత్తర ఆఫ్రికా, రెండవది దక్షిణ అమెరికా.

సమితి ప్రధాన కార్యదర్శి 1964 లో, అల్జీరియా జాతీయ సభ (పార్లమెంటు)లో ప్రసంగిస్తూ ఇలా అన్నారు: "ప్రపంచ ప్రజలందరి శ్రేయస్సుదృష్ట్యా, అభివృద్ధి పొందిన దేశాలు ఇప్పుడిప్పుడే అభివృద్ధి పొందుతున్న దేశాలకు సాంకేతికంగాను, ఇతర విధాలగానూ సాయం చేయాలి. అది ధర్మం. దీనిని ప్రపంచ దేశాలన్నీ అంగీకరించేట్లు, ఆచరణలో పెట్టేటట్లు చేయడానికి సమితి చాలా కృషి చేసింది. అభివృద్ధి చెందిన దేశాలు బడుగు దేశాలకు చేసే ఈ విధమైన సాహాయ్యం అంతర్జాతీయ నైతిక ధర్మాన్ని సమున్నతం చేయగలదు."

సమితి నిర్వహించే అనేక కార్యక్రమాలలో ఆఫ్రికా ప్రత్యేక స్థానం ఆక్రమిస్తూంది. ఖనిజాలు, పెట్రోలియం, సహజ వాయువు, జలవిద్యుచ్ఛక్తి



ఆఫ్రికాలో లభించినంతగా ప్రపంచంలో మరెక్కడా లభించవు. అయినా, అభివృద్ధి విషయంలో అన్నింటికంటే వెనుకబడి ఉన్నది ఆఫ్రికా ఖండమే. చరిత్రలో ఎప్పుడో జరిగిన ప్రమాదానికి ఫలితాలు ఇప్పటి వరకూ ఆఫ్రికా అనుభవిస్తూనే ఉంది. దీనిని ఇక కొనసాగనివ్వకూడదు.

అందుచేత ఆఫ్రికా దేశాలు తమ సహజ సంపదలను అంచనా వేసు కొనడానికి సమితి సాయం చేయవలసి ఉంది. అది ప్రత్యేక బాధ్యత. ముందు తన వనరులను అంచనా వేసి, తర్వాత సాధ్యమైనప్పుడు వాటిని వినియోగంలోకి తీసుకురావాలి. ఈ విధంగా, ప్రపంచ సహజ సంపదలో ఆఫ్రికా అన్నింటికంటే పెద్ద భాగస్వామి అవుతుందని ఊథాంట్ చెప్పారు.

## మరొక సహకార ప్రయోగ క్షేత్రం

ఆండీస్ పీఠభూమిలో ప్రపంచ నిర్మాణ ప్రయోగం మరొకటి సాగు తున్నది ఈ కార్యక్రమం క్రమంగా వేగాన్ని పుంజుకొంటున్నది. ఈక్వ డార్, పెరూ, బొలీవియాలలో ఈ నాడు సుమారు 70 లక్షలమంది ఎర్ర ఇండియనులు కేవలం నిరుపేదలుగా బ్రతుకుతున్నారు. 16వ శతాబ్దంలో స్పెయిన్‌వారు దండయాత్ర చేయగా వీరు పారిపోయి వచ్చి ఈ ప్రాంతా లలో స్థిరపడ్డారు. ఈ నాడు నికృష్ట స్థితిలో ఉన్నా కొన్ని శతాబ్దాల పూర్వం వీరు గొప్పగా బ్రతికినవారే. వ్యవసాయంలో గొప్ప పురోభివృద్ధి సాధించి, సిరిసంపదలతో తులతూగిన ఇన్‌కాస్ నాగరకతకు వారసులు వారు.

వారి దారిద్ర్యానికి ముఖ్య కారణాలు—ఆర్థికమైన వనరులు లేకపోవ డం, అవసరమైన 'పరిజ్ఞానం' లేకపోవడం, బయట ప్రపంచం నుంచి సాహాయ్యం అందకపోవడం. కాని, వారికి మంచి తెలివితేటలు ఉన్నాయి; కష్టించి పని చేయగలిగిన శక్తి ఉన్నది; దేశాన్ని అభివృద్ధిలోకి తీసుకురావ డానికి అవసరమైన గొప్ప అంగ బలం ఉన్నది—లేనిదల్లా అర్థబలమే.

వారి ఇళ్ళు, పరిసరాలు ఆరోగ్యకరమైనవి కావు. తలుపులు, కిటికీలు లేని రాతి ఇళ్ళలో వారు నివసిస్తారు. వాటిని సరిగా ఊడ్చడం కూడా ఉండదు. భూమధ్యరేఖకు సమీపంగా ఉండే ప్రాంతం కాబట్టి వారి రాత్రికి 12 గంటలు ఉంటాయి. అయినా, రాత్రిపూట వారి ఇళ్ళలో దీపాలు కూడా ఉండవు. ఆ ప్రాంతంలో తీవ్రమైన వడగాలులు వీస్తూ ఉంటాయి. తరచుగా మంచు పడుతూ ఉంటుంది. వర్షాలు కొద్దిసేపు కుండపోతగా కురిసిపోతూ ఉంటాయి. మంచినీరు దొరకడం కష్టం. నీరు గడ్డకట్టిపోతూ ఉంటుంది. లోతు తక్కువ నూతులు ఉంటాయి గానీ, వాటిలో నీరు త్వరగా కలుషితమైపోతుంది. ప్రజలు రెండేసి నెలల కొకసారి మాత్రమే బట్టలు విడిచి ఉతుక్కుంటూ ఉంటారు. అది వారి ఆచారం. పరుపులు, బొంతలు శుభ్రం చేసుకోవడం అసలే ఉండదు.

ఈ కారణాలన్నింటివల్ల సహజంగా ఆ ప్రాంతంలో మరణాల సంఖ్య చాలా ఎక్కువ. మసూచి, కోరింత దగ్గు, క్షయ, ఊపిరితిత్తులకు సంబంధించిన ఇతర వ్యాధులు ఏడాది పొడుగునా ఎడతెరిపి లేకుండా ఉంటాయి. దోమలు, నల్లులు వగైరా రక్త పిపాసుల సంఖ్య చెప్పడానికి వీల్లేదు. తిండి చాలా చౌకబారు తిండి అందులో మాంసకృత్తులు గానీ, క్రొవ్వు పదార్థాలు గానీ ఉండవు. పోనీ, భోజన పదార్థాలలో ఎక్కువ రకాలైనా ఉండవు. ఎప్పుతూ ఒకే విధమైన పదార్థాలు తింటూ ఉంటారు. పాలు, గ్రుడ్లు, మాంసం అమ్మే విపణులు వారికి ఎక్కడో చాలా దూరంగా ఉంటాయి. అవి వీరికి అట్టే అందుబాటులో ఉండవు. వారిలో నూటికి 80 మంది నిరక్షరాస్యులు.

వీరి అభివృద్ధికి ఇన్ని అవరోధాలు ఉన్నా సంతోషించవలసిన విషయమేమిటంటే, సహజంగా వారు చాలా తెలివైనవారు; చురుకైనవారు; నేర్చుకోవాలన్న ఆసక్తి, శ్రద్ధ ఉన్నవారు. ఇప్పుడిప్పుడు వారి సమాజంలో

మూఢ నమ్మకాలు తగ్గిపోతున్నాయి తమ పిల్లలను చదివించాలనీ, వివిధ వృత్తులలో శిక్షణ ఇప్పించాలనీ వారు తహ తహ పడుతున్నారు.

తమ పరిస్థితులను చక్కబరచడానికి ప్రవీణుల బృందాలను పంప వలసిందిగా ఆ ప్రాంతాల ప్రభుత్వాలు అంతర్జాతీయ సంస్థలను అభ్యర్థించాయి.

సాంకేతిక సాహాయ్య విస్తృత కార్యక్రమం క్రింద ఐక్యరాజ్యసమితి, దాని అనుబంధ సంస్థలయిన ప్రపంచ విజ్ఞాన సమితి, ప్రపంచ ఆరోగ్య సంఘం, ఆహార వ్యవసాయ సంఘం, అంతర్జాతీయ కార్మిక సంఘం కలిసి ఆండీస్ పీఠభూమిలో సహకార కృషి సాగిస్తున్నాయి. దీనికి "ఆండియన్ ఇండియన్ కార్యక్రమం" అని పేరు పెట్టారు. ఆ ప్రాంతంలోని బొలివియా, ఈక్వడార్, పెరూ, కొలంబియా, చిలీ అర్జెంటినాల ప్రభుత్వాలు సమితి సంస్థలతో చేతులు కలిపి ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాయి.

ఎర్ర ఇండియన్లను వారి దేశాలలోని మిగతా ప్రజల స్థాయికి తీసుకు రావడం, జాతీయ జీవనంలో వారిని భాగస్వాములుగా చేయడం, వారి జీవన పరిస్థితులను మెరుగు పరచడం ఈ కార్యక్రమ లక్ష్యం, ఆండియన్ పీఠ భూమిలో మరీ వెనక బడిన కొన్ని ప్రాంతాలలో సమాజ వికాస కేంద్రాలను నెలకొల్పుతున్నారు. ఆధునిక వ్యవసాయ పద్ధతులలోనూ, వడ్రంగం కమ్మరం మొదలయిన వృత్తులలోనూ అక్కడి ప్రజలకు శిక్షణ ఇవ్వడానికి ఆరోగ్య సౌకర్యాలను, విద్యా సౌకర్యాలను మెరుగు పరచడానికి ఈ కేంద్రాలు ఉద్దేశింపబడతాయి.

ఆ విధంగా సమితి అభాగ్యుల సముద్ధరణకు కంకణం కట్టుకున్నది.

## శాంతికి నిజమైన రక్షణలు

అంటార్కిటికానుంచి ఆఫ్రికా వరకు, ఆండీస్‌నుంచి ఆఫ్రికా వరకు, సాంకేతిక, సహకార రంగాలలో సాధించిన ఘన విజయాలనే అసంఖ్యాకమైన నూలు పోగులతో—ఏక ప్రపంచ ఆదర్శాన్ని పడుగు పేకలుగా చిక్కగా నేత నేయడం జరుగుతున్నది. ఎందరెందరో అంతర్జాతీయ సేవకులు ఈ నేత పని చేస్తున్నారు.



కాని. మనం ఇప్పటివరకు చెప్పుకున్న వైజ్ఞానిక, ఆర్థిక, సాంఘిక ఉద్యమాల వెనుక మరొక ముఖ్యమైన అంశం ఉన్నది—అది విద్య. మన నాగరకత యాంత్రిక శాస్త్రానిదా? మానవులదా? ఈ విజయం యంత్రాలదా, మనుష్యుల మనస్సులదా? దీనికి ప్రపంచ విజ్ఞాన సమితి (ఐక్యరాజ్య సమితి విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక సంఘం యునెస్కో (Unesco) చెప్పే సమాధానం ఏమిటో చూద్దాం.

ప్రపంచ విజ్ఞాన సమితి సిద్ధాంతం దాని నిబంధనావళి ఆరంభంలో క్లుప్తంగా, తేలిక మాటలలో ఇలా తెలుపుతున్నది.

"యుద్ధాలు మనుష్యుల మనస్సులలోనే ప్రారంభమవుతాయి కనుక, శాంతికి రక్షణలు కూడా మనుష్యుల మనస్సులలోనే నాటుకోవాలి."

అయితే, శాంతి రక్షణకు ప్రపంచ విజ్ఞాన సమితి చేసిన ఏర్పాట్లు ఏమిటి? దీనికి సమాధానం—మానవ విజ్ఞానానికి, కృషికి సంబంధించిన అన్ని శాఖలలోనూ కనిపిస్తుంది. ఎందుకంటే, మనం ఈ పుస్తకం అంతటా చదివినట్లు, "శాంతి" లక్ష్యాన్ని సాధించడం అనేది తేలిక పని కాదు—దానిని సాధించడానికి అన్ని దేశాలలోనూ, అన్ని స్థాయిలలోనూ ప్రణాళికాబద్ధమయిన కృషి జరగాలి. ఆ కృషిలో ప్రతి వ్యక్తీ పాల్గొనాలి.

అజ్ఞాన నిర్మూలనోద్యమాన్ని విస్తృత ప్రాతిపదికపై సాగించవలసి ఉంది. చదవడం, వ్రాయడం రాని పురుషులు, స్త్రీలు ప్రపంచంలో ఈనాడు వంద కోట్లమందికి పైగా ఉన్నారు. వీరిలో చాలామంది—మనం ఇంతకు ముందే చూసినట్లు—కేవలం అజ్ఞానులే కాదు; వారిని దారిద్ర్యం, క్షామం కూడా పీడిస్తున్నాయి. ఆకలి, దారిద్ర్యం, అజ్ఞానం—ఇవి విడదీయడానికి వీల్లేకుండా ఒకదానితో ఒకటి లంకెబడి ఉంటాయి. ఇదొక విష వలయం ఈ వలయాన్ని ఛేదించడంలో ఈ కోట్లాది ప్రజలకు ప్రపంచ విజ్ఞానసమితి., సమితిలోని ఇతర సంస్థలు సాహాయ్యం చేస్తున్నాయి.



ప్రపంచంలోని వయోజనులలో సగంమంది, బాలలలో సగంమంది నిరక్షరాస్యులు. 70 కోట్లమంది స్త్రీ పురుషులు అసలు ఒక్కసారి కూడా పాఠశాల గడప త్రొక్కినవారు కారు 20 కోట్లమంది చదువుకునే ఈడు గల బాలలకు చదువుకునే అవకాశం లభించడంలేదు

ఈ దురదృష్టకర పరిస్థితులు విద్యావ్యాప్తిని నిరోధిస్తున్నాయి అభివృద్ధిలోకి వచ్చిన మనం ఈ పరిస్థితులను తొలగదీయగలమా ? చదువురాని వంద కోట్లమందికి పాఠశాలల సౌకర్యం కల్పించడానికి మనకు ఉన్న సంపదను పంచుకోగలమా ? సమితిలోని 112 దేశాల తరపున ప్రపంచ విజ్ఞాన సమితి తలపెట్టిన బృహత్కార్యం ఇదే

ప్రపంచమంతా మానవ మేధ పరుగులు తీస్తున్నది, ఆకలితో, రోగాలతో బాధ పడుతూ తలదాచుకొనడానికి సరియైన ఇళ్ళు లేక, జీర్ణ వస్త్రాలతో జీవితం గడుపుతున్న కోట్లాది ప్రజలు ఇక తమకు ఈ కష్టాలు ఉండ్లే

కాలం ఉండవని ఇప్పుడు తెలుసుకున్నారు. తమ జీవన ప్రమాణాలకుమధ్య ఎంత అంతరం ఉన్నదో వెనకబడిన దేశాలవారు చక్కగా అర్థం చేసుకో గలుగుతున్నారు.

ఈ అంతరాన్ని అంతం చేసే లక్ష్యంతో సమితి నడుం బిగించి కార్యరంగంలో దిగి, దశవర్ష ప్రణాళిక (10 వ అధ్యాయంలో మనం చదివి నది) ప్రారంభించింది. ఆహారోత్పత్తిని పెంచడం, వనరులను పూర్తిగా వినియోగంలోకి తీసుకురావడం, గృహ సౌకర్యాలను పెంపొందించడం, విజ్ఞాన శాస్త్రాన్ని అభివృద్ధి పరచడం, అంతర్జాతీయ వాణిజ్యాన్ని విస్తృతం చేయడం—ఇవన్నీ ఈ ప్రణాళికా లక్ష్యాలు. ప్రపంచ విజ్ఞాన సమితిని నెల కొల్పడంతో ఈ ప్రణాళిక అమలును ప్రారభించడం జరిగింది ఎందుచేత్న

ఈ ప్రణాళిక లక్ష్యాలను సాధించడానికి అత్యవసరమైనవి—మానవ శక్తి, ప్రతిభ. "వర్ధమాన దేశాలలోని వర్తమాన దుస్థితికి కారణం ఆ దేశ ప్రజల ప్రతిభ వినియోగానికి రాకపోవడమే. వారి ప్రతిభే వారి భవిష్యత్తుకు ఆశాజ్యోతి" అని సమితి ప్రణాళిక తెలియజేస్తూంది. ఈ దేశాలు తమ వన రులను అంచనా వేసుకోవాలి, ఖనిజాలకోసం అన్వేషణను తీవ్రతరం చేయాలి; గ్రామీణ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి సౌకర్యాలను పెంపొందించు కోవాలి. వీటికోసం విద్యను ప్రణాళికాబద్ధం చేయాలి అంటే-ప్రాథమిక విద్య, సెకండరీ విద్య, సాంకేతిక విద్య, ఉన్నత విద్య అనేవాటితో విద్యను వ్యవస్థీకరించాలి. నిరక్షరాస్యులైన ప్రజలు ఆధునిక అర్థశాస్త్రాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్ని అందుకోలేరు.

## ఆకాశాన్నంటే ఆశయాలు

అందుచేతనే, ప్రపంచంలోని 70 కోట్లమంది నిరక్షరాస్య వయో జనులను అక్షరాస్యులుగా చేయడానికి, పిల్లలందరికీ ఉచిత విద్యా సౌకర్యం



కల్పించడానికి సలహాకోసం, సాహాయ్యంకోసం జాతీయ ప్రభుత్వాలు ప్రపంచ విజ్ఞాన సమితిని అభ్యర్థిస్తున్నాయి.

లక్షల సంఖ్యలో పాఠశాలలను నిర్మింపజేయడం, దశ లక్షల సంఖ్యలో ఉపాధ్యాయులను తయారు చేయడం, శత లక్షల సంఖ్యలో పాఠ్య పుస్తకాలను ప్రచురించడం, ఇంకా సహస్ర లక్షల సంఖ్యల్లో బోధనా పరికరాలను ఉత్పత్తి చేయడం—ఇవన్నీ ప్రపంచ విజ్ఞాన సమితి ఆశయాలు కాని, దాని నిధులు మాత్రం ఇలా లక్షల సంఖ్యలో లేవు.

గడచిన కొన్ని సంవత్సరాలలో ప్రపంచ విజాన సమితి ప్రాంతీయ సమావేశాలు జరిపి, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలకు చెందిన దాదాపు అన్ని దేశాల అవసరాలను అంచనా వేసింది ; కార్యక్రమాలు రూపొందిం



చింది. 1959 లో ఆసియా దేశాల ప్రతినిధులు కరాచీలో సమావిష్టులయారు. 1980 నాటికి ఆసియాలోని పిల్లలందరికీ ప్రాథమిక విద్యా సౌకర్యం కల్పించాలని ఒక ప్రణాళిక తయారు చేశారు. దానికి "కరాచీ ప్రణాళిక" అని పేరు పెట్టారు. 1960 లో అరబ్ రాజ్యాల విద్యా మంత్రులు బీరూట్‌లో సమావేశం జరిపి, తమ ప్రాంతానికి ఒక విద్యా ప్రణాళికను రూపొందించుకున్నారు. తర్వాత 1961 లో, అడిస్ అబాబాలో ఆఫ్రికా రాజ్యాల సమావేశం జరిగింది. 1980 నాటికి ఆఫ్రికా బాలలందరికీ ప్రాథమిక విద్యా సౌకర్యం కల్పించాలని "అడిస్ అబాబా ప్రణాళిక" ఉద్దేశం. దక్షిణ అమెరికా దేశాలన్నింటిలోనూ ప్రాథమిక విద్యావ్యాప్తికి ప్రపంచ విజ్ఞాన సమితి రూపొందించిన ప్రణాళిక 1956 నుంచి అమలులో ఉన్నది.

ఈ విద్యా పథకాలకు ఎంతమంది ఉపాధ్యాయులు అవసరమవుతారో చూద్దాం. 1980వ సంవత్సరంలో కొత్తగా పాఠశాలల్లో చేరే విద్యార్థుల కోసం, ఉద్యోగ విరమణ చేసిన ఉపాధ్యాయుల స్థానాలను భర్తీ చేయడం కోసం అదనంగా 68 లక్షల మంది ఉపాధ్యాయులు ఒక్క ఆసియాకే అవసరమవుతారు. అంటే, ఇప్పటి ఉపాధ్యాయుల సంఖ్యకు అప్పటి సంఖ్య మూడు రెట్ల పైగా ఉంటుంది. ఆఫ్రికాలో అప్పుడు ఏడాదికి అదనంగా 76,700 మంది ఉపాధ్యాయులు అవసరమవుతారు. దక్షిణ అమెరికాలో—చదువుకునే ఈడు వచ్చి కూడా పాఠశాలల్లో చేరని పిల్లలందరికీ విద్యా సౌకర్యం కల్పించాలంటే ఇప్పుడు 1 30,000 మంది ఉపాధ్యాయులు అవసరమవుతారు; చదువుకునే ఈడు వస్తున్న పిల్లలకోసం ఇంకా 2,75,000 మంది ఉపాధ్యాయులను తయారు చేయవలసి ఉంటుంది.

ఇక ఖర్చు సంగతి చూద్దాం. ఆఫ్రికా రాజ్యాలు తమ జాతీయ ఆదాయాలలో మూడు శాతం విద్యకు ఖర్చు పెడుతూ ఉండేవి. 1965 లో దీనిని నాలుగు శాతానికి పెంచాయి. 1980 నాటికి కనీసం ఆరు శాతానికి పెంచాలని సంకల్పించుకున్నాయి. కాని, విద్యా పథకాల అమలుకు అవసరమైన వేలాది ఉపాధ్యాయులకోసం, పుస్తకాలకోసం, పరికరాలకోసం ఈ దేశాలన్నీ ప్రపంచ విజ్ఞాన సమితి సాయాన్ని అర్థిస్తున్నాయి.

ఆసియాలోని ఇరవై సంవత్సరాల విద్యా కార్యక్రమానికి మొత్తం 5600 కోట్ల డాలర్లు ఖర్చు అవుతుందని కారాచీ సమావేశంలో అంచనా వేశారు. (ఈ కార్యక్రమంలో సహకరించే దేశాలు 15.) ఆసియా దేశాలలో ఇప్పుడు, ఒక్కొక్క వ్యక్తికి సగటున ఏడాదికి 3.5 డాలర్లు చదువు కోసం ఖర్చు పెట్టడం జరుగుతున్నది. 1980 నాటికి ఒక్కొక్కరికి 5 డాలర్లు ఖర్చు పెట్టడం జరుగుతుంది. (ఈ ఖర్చు పశ్చిమ దేశాలలో ఇప్పుడు పెడుతున్న ఖర్చులో పదో వంతుకంటే తక్కువ)

చంద్రమండలాన్ని చేరుకోవడానికి పోటీ పడుతున్న అగ్ర రాజ్యాల ఘర్షణ పట్ల వెనకబడిన దేశాల విముఖతకు అర్థమేమిటో దీనివల్ల తెలుస్తుంది భూమిమీద సుస్థిరమైన శాంతిని నెలకొల్పుకొనగలిగితేనే రోదసీ విజయానికి చేసే ప్రయత్నాలకు అర్థం ఉంటుంది. ప్రపంచ విజ్ఞాన సమితి కార్యక్రమాలు తయారు చేస్తుంది, కాని సముచితమైన నిర్ణయాలు తీసుకోవలసినది మనమే.

## ఉజ్జ్వల భవిష్యత్తుకు స్వాగతం

కాబట్టి, చివరికి మిగిలిన ప్రశ్న ఏమిటంటే—రోదసీ యుగంలో జీవిక సాగించదలచుకుంటే మనుష్యుల 'మనస్సులు' ఏ విధంగా ఏ విధంగా ఉండాలి అనేది

టెన్నిసన్ జోస్యం చెప్పినట్లు మానవజాతి నిజంగా సర్వమానవ పరిషత్తుగా, ప్రపంచ సమాఖ్యగా పరిణమించనున్నదా? ఎన్నో శతాబ్దాలుగా మానవుడు కంటున్న కల నిజం కాబోతున్నదా? లేక ఇన్ని తరాలుగా మానవుడు కొద్ది కొద్దిగా నిర్మించుకుంటూ వచ్చిన ఈ మహోన్నత నాగరకతా సౌధం యావత్తూ అణుధూళిగా మారబోతున్నదా?

ఈ ముఖ్యమైన ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే పుస్తకాన్ని ముగిస్తున్నామంటే దానికి కారణం, ఈ సమాధానం ఒక్కరు చెప్పగలిగినది కాదు; మీరు, నేను, మనం అందరం చెప్పవలసిన సమాధానం అది

సమాధానం చెప్పగలిగినా చెప్పలేకపోయినా, కనీసం--జాన్ అడింగ్టన్ సైమండ్స్ ఒక పద్యంలో వ్యక్తం చేసిన విశ్వాసంతోనే అగోచరమైన భవిష్యత్తుకు స్వాగతం చెబుదాము. ఆ పద్యంలోని భావం ఇది:

"ప్రపంచం ఇదివరకూ ఎన్నడూ ఎరుగని ఒక మహోదాత్త మానవజాతి అవతరించబోతున్నది. వారి ఆత్మలలో స్వాతంత్ర్య జ్వాల, వారి నేత్రాలలో విజ్ఞాన జ్యోతి వెలుగుతూ ఉంటాయి.

వారు అతి శాంత సౌమ్య స్వభావులు; అయినా సాహసులు, శక్తి సంపన్నులు, ఒక్క రుధిర బిందువు చిందించకుండా పృధ్వీజల వాయు రాకాశతేజోమయ ప్రపంచంపై మానవుని ప్రభుత్వాన్ని వారు సుస్థిరంగా స్థాపించగలరు."